ఉ॥ పాయనివేడ్కతో నునికి। పట్టులకుంజని గోవులెల్ల నం
బేయనిచీరి హుమ్మనుచుఁ। జేరిచి మూర్కొని వంచితిల్లి పె
ల్లైయతిరేకమై పొదుఁగు। లం దడలేక స్రవించుచున్న పా
లాయెడ నాకుచున్ సుముఖులై యొసఁగెన్ నిజవత్సకోటికిన్॥

క॥ వ్రేతలకును. గోవులకును
మాతృత్వము సాలఁగలిగె। మఱిమాధవుపై
మాతలనిహారియు నిర్మల
కౌతూహల మొప్పఁదిరిగెఁ। గడుబాల్యమునన్॥

—శ్రీ మ. భా గ వ త ము



# పల్లెటూరి భాగ్యము

పల్లెటూళ్లు హిందూదేశమున కాయువుపట్టులు. సనాతనము నుండియు భారతీయులు పల్లెటూళ్ల భాగ్యమును అభివృద్ధి పరచుట యందలి శ్రద్ధను పట్టణములను గూర్చి చూపించలేదు. పరిపాలనపు కట్టుబాటులలో గ్రామపంచాయతీ దేశీయరాజ్యాంగమునకు ప్రాతిపదికము. విద్యావిషయములో పల్లెటూళ్ల పండితులు నగరవాసులగు రాజాధిరాజాది శ్రీమంతులకు గురువులు. సాంఘికపు కట్టుబాటులలో పల్లెటూళ్ళు పెట్టినదే పట్టణమునకు వరవడి. సిరి సౌభాగ్యములలో పట్టణములకు పల్లెలే ఆధారములు. ఆరోగ్య భాగ్యము, శాంతజీవనము, ఆధ్యాత్మికచింతనము పల్లెటూరి వాతావరణము నాశ్రయించి యుండును.

ఇట్టి పల్లెటూళ్ళకు ప్రాణము లేవియనిన గోవులని చెప్పితీరవలెను. గోవుల తోడిదే పాడి, గోవులతోడిదే పంట. పాడిపంటల తోడివే యితర ఆధిభౌతిక ఆధ్యాత్మిక భాగ్యములు. ఇట్టి గోవులను పెంచుట ప్రతిపల్లెటూరి గృహస్థునకును కేవలము కర్తవ్యధర్మముగా నుండెను. ఇల్లుకట్టుకొనుటకు పునాదులు త్రవ్వుచున్నప్పుడే గోశాలకు తగిన స్థలము నేర్పాటు చేసుకొను చుండిరి. గృహస్థును గేస్తురాలునుగూడ తమశ్రద్ధలోని ప్రశస్తమైన భాగము నీగోసంరక్షణము నిమిత్తమై ప్రసరించుచుండిరి. గృహస్థు గోవులకు తగిన సాలవేయును, రాటలపాతును, గరికవేళ్ళు తెచ్చిపెట్టును. గేస్తురాలు ఆవులకువలసిన కుడితి కడుగు మొదలగువానిని జాగ్రత్తపెట్టును, సాల నద్దమువలె తుడిచి రమణీయముగ నుంచును.

ఇట్టిగోవు సంసారపు జీవులలో నొకజీవియై యింటిల్లి పదిమందివద్ద చనువుగా తిరుగుచుండును. పసిపాపలు దానిని తాకి నిమురుచు నాడుకొందురు. ముసలమ్మలు ఆరో

గ్యకరమగు గోమూత్రమును పుణ్యమని పురిషిలించి త్రావుదురు. గేస్తురాలే నిర్భయముగా పాలుపిండి కాగబెట్టుకొనును. యజమాని పశువులను మందల కొప్పగజెప్పి మేపించుకొనును, యెడ్లను కడిగి శుభ్రము చేయును.

గోవునుగూర్చి యింతశ్రద్ధ నింటియందరును పెట్టుకొనుటకు కారణము గోక్షీరముల మహాత్వమనవలెను. ఏజంతువు పాలకైన నేదోనగైన నుండవచ్చునుగాని గోక్షీరముల కెట్టి దోసగునులేదు. ఆవుపాలలో నుండు విటమిను శక్తి (జీవకారిక శక్తి) మరియే పాలయందును లేదని ప్రస్తుత పాశ్చాత్యవైద్యుల అభిప్రాయమై కూడ నున్నది. శిశువులకు తల్లిపాల తరువాత ఆవుపాలవంటి ఆరోగ్య పదార్థములేదు. ఆవుపాలు, మజ్జిగ, పెరుగు, వెన్న, నెయ్యి, మీగడ లేయింట పుష్కలగనున్న ఆయింటి వారందరు నిరోగులై, బలిష్ఠులై, మేధావంతులై, శ్రమాశీలురై దేశీయ సౌభాగ్యమునకు పట్టుకొమ్మలగు పౌరులగుదురు.

గోపోషణమునందు మనపూర్వులు కనపరచిన భక్తి శ్రద్ధలను మన మిప్పుడు కనబరచ కుండుటచేత అవి చిక్కి సన్నగిల్లుచున్నవి. మనమును వానితోబాటు సీరసిల్లుచుండుటలో వింతలేదు. పల్లెటూళ్లలో గోవులమేత బీళ్లను వ్యవసాయ భూములలో కలుపుకొనునట్టియు గోవు లశవులలో మేసినచో బందెలదొడ్లలో పెట్టునట్టియు దురాచారము లిప్పుడిప్పుడు వ్యాపించుచున్నవి. పల్లెటూళ్ల పెద్దలెల్లరును సకాలమున తెలివిగొని గోద్రోహకరములగు నిట్టి దురాచారములను విసర్జించి, గోవులను బాగుపరచుకొనకున్నచో గోవులతోబాటు తమ పాడిపంటలుకూడ చితిగి దౌర్భాగ్యముపాలగుదురని గుర్తించవలెను.

డెన్మార్కు, అయిర్లాండు, అమెరికా మొదలగు పాశ్చాత్యదేశములలోని గోవులముందర మన యావులు సింహములముందర లేళ్లవలె కనిపించును. అచ్చట పశువులదొడ్లు మానవుని మందిరములకంటె నిర్మలములై యుండును. మలమూత్రము లొక్కనిమిషముకూడ దొడ్డిలో నుండకుండ కొట్టుకొనిపోవుటకు తగిన యేర్పాటులుండును. గృహస్థులందరును దిట్టమైన ఆహారమును పెట్టుచున్నారో లేదో ప్రభుత్వోద్యోగస్థులు తనిఖీ చేయుచుందురు. వాటికెట్టి పశురోగములుకానితగలకుండ వైద్యులు టీకాలు వేయుదురు. వాటి చిత్తముల కానందము కలుగునిమిత్తము రేడియో మొదలగు పరికరములద్వారా సంగీతశ్రవణము జరుగుచుండును. ఈగవ్రాలిన నేలజారునట్లు బలిష్ఠములగు శరీరములను పదేపదే కడుగుచుండుటచే అవి కండలుతేరి నిగనిగలాడుచుండును.

ఇట్టి పరిస్థితులలో పెరిగిన గోవులు పెద్ద పొదుగులుచేసి దినమునకు ముమ్మారు నలుమారు పాలిచ్చుచుండుటయు, ఆ పాలు పితుకుటకు రెండుచేతులు చాలక విద్యుత్సాధనములను ప్రయోగించుటయు, ఆపాలు ఆదేశముల కతిపుష్కలముగుటచేత నిలవచేసియు, ముద్దలు, గుండలుచేసియు విదేశముల కెగుమతిచేసి ప్రజలు శ్రీమంతులగుచుండుటయు మనము గాంచుచున్నాము.

# సుగంధజ్వాల

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం.ఏ.,బి.యల్.

పృథ్వీరంగమునుండి ఇటీవల (సెప్టెంబరు 20) నొక మహావ్యక్తి నిష్క్రమించినది.

ప్రస్తుతయుగ స్త్రీలోకమున బీసెంటుసతి తలమానికమై తనరియుండెను. ఏదిక్కు వెతకినను, నేటి వనితయం దీమెతో సరిపోల్పఁదగు నీమంతిని లేదు. పురుషులందైన నీమె చెంగట నిలువందగువారు లెక్కకు మిక్కిలి తక్కువగనున్నారు. కాలవిహాయసమున భాస్వంతజ్యోతివలె వెలుఁగు నీమె జీవనమందు, మహితశమంతకమయూఖలట్లు మహత్తరాశయములు వెలుగొందినవి! ఉన్నతాశయచరితార్థమునకై బీసెంటుసతి ఆత్మార్పణ మొనరించుకొన్నది. ఈమె చరిత్రాంశములను నే నిపుడు తెలుపఁదలఁచుకొనలేదు. ఈమె జీవన వాహిని దగచివంతన చేఁబడు భావనవనీతమునే ఇందుక సోదరీమణుల కనులెదుటఁబెట్టి యూహించుచుంటిని.

ఇచ్ఛాశక్తియందును, దృఢనిశ్చయమందును, కార్యదీక్షయందును, అనన్యజీవనమందును ఆమెది యుగవానికిఁ దీసిపోదని బీసెంటుసతి చరిత్రము తెలుపుచున్నది. నిప్పుసెగ సోకినఁగాని అపరంజి తేజరిల్లదు. అరిష్టపుంకమున మ్రగ్గినగాని మానవుని మహత్త్వము రంగారు బంగారువలె ప్రకాశింపదు. తాను ప్రేమించినవారిని అగ్నిపరీక్షయందుఁ ద్రోయుట జగదీశునకు పరిపాటియైనది! భీషణఝంఝ ఉన్నతోర్వీరుహములతో పోరునుగాని గరికపోచలతోఁ గాదు. పుటము వెట్టనెంచుట పుత్తడినిగాని కిలము గొట్టిన ప్రదుకీడ్పు ఇత్తడిని గాదు. రాహుకేతులు దిగ్రమింగఁదలఁచుట సూర్యచంద్రులను గాని గులకరాళ్లను గాదు. అగ్నికంటె వేడియై, కరవాలుకంటె వాడియైన కష్టములు సామాన్యుల నెదిరించి, తమ మానమును మాపొనరించుకొనవు. దారిద్ర్యమనుడు, దండనమనుడు, అవమానమనుడు, అత్యాచారమనుడు, మహాపురుషులను పెంచి పెద్దఁజేసిన తల్లులు. పురాణములను వెతకుఁడు–చరిత్రలను పెల్లగింపుఁడు–నిర్భరమున కొంత కన్నీరు వెలారుపక మహాపురుషులైనవా రుండిరేమో కన్గొనుఁడు. మొద్దుపై బోరగిలఁజేసి, మేకులతో మోది, పూతరక్తమును దశదిశల జిమ్మి, మొగమున నుమిసి, తలపై నీలముండ్లను గ్రుచ్చి, దుర్మతులగు చోరులనడుమ శిలువపై నిలువంబెట్టి, వాడి మేకుల నెమ్ము లందుఁగొట్టి అల్లనల్లన ఏసు యసువుల నూడఁబెఱికినది అత్యాచారము! నిర్మల నీతిప్రబోధమున కాలముఁగడపు సోక్రటీసు నోటికి గరళము నందించినది అత్యాచారము!! చెప్పరాని బాధలను గాంధిపై ద్రోయునది అత్యాచారము!!! అత్యాచారమునకు తలయొగ్గని మనుజుఁడు తన మనుష్యత్వము నెట్లు తేటపఱచుకొనఁగలఁడు?

అత్యాచారమునకు తలయొగ్గిన అభాగినులలో—కాదు భాగ్యవతులలో బీసెంటుసతి యొకతె. పిన్నతనమునుండియు నీమె సత్తువను సావబెట్టవలెనని యే దైవత మూహించినది. ఏవిషయముగాని విమర్శింపక గ్రహించుట బీసెంటుసతి ప్రకృతికి ప్రతికూలము. క్లిష్టమైన జీవనసమస్యల నెదుర్కొనుశక్తి క్రైస్తవమతము సాయపడక, ఈమె దృష్టి నన్యమతస్థ విజ్ఞానము దెసఁద్రిప్పినది. పతికిని, ఈమెకును మనసులు వేఱాయెను. వీరినపురకు కోర్టులందుగూడ పెనగులాడవలసిన గతిపట్టెను. నిరాశయందు క్రుంగి పడి, ఒకప్పు డీమె విసుగొని జీవనమును కడముట్టింపఁ దలపడెను. "నీ యాయువుపై నీకు హక్కు లే"దని జలదగంభీరస్వరమున నెవరో నీమె యంతరంగమున పలికిరి.

బొమ్మలాటకై మనుజులను జగదీశుఁడు జగతిమీఁద కంపడు. ప్రత్యేకవ్యక్తిని ఒక్కొక ఉద్దేశసిద్ధికై సర్వేశుఁడు వసుంధరపైఁ బుత్తెంచును. సామాన్యులు కాక, మహాపురుషు లీ విషయమును శైశవమందే గుర్తింతురు (Vide: Milton's works)

దీనిని గుర్తించుటకు కొంత ఆలస్యమగుచో గుణ శించునందాక వీరిని, వీరి నియతి ముందులకు నడపుచునుండును. పనికిమాలిన పందయనిపించుకొనిన క్లైవు ఆలు మాటలు గుండెలకు నిబ్బరముగ పిస్తోలును గుఱిచూచి అప్రతిభుఁడాయెను. క్లైవు కథ అందఱికి విశదమే. పేడయూచలకు హిందుసీమ పెండిని ఉపయోగించిన ఈవ్యక్తి హిందూసీమకు చేసిన పనియేమైనను, ఇట్టిపని వీనిచేఁ జేయింప సమకట్టిన విధి వీని ఆయువును తన పిడికిలియందు నొక్కిపట్టెను. తొలుత తొలగిపోయిన గుండుదెబ్బలాటను కథ కంచె కరిగినపిదప, వీని గుండియలను వెల్లగించి వేయలేదా? నిరాశయందు మునిఁగి సింహ మొదలగువారిల్లే ఎన్ని ఘాతుకములకుఁ దలపడి ఎన్నితూరులు బోరలపడలేదు? బీసెంటుసతి తన పని ముగింపక ఘాతుకమునకు తలపడినంతన అంతయుఁ జూచుచున్న లోఁగలశక్తి ఆమె ఆయువును కబళింప నెంచిన గరళమును పాఱవేయించెను. నాఁడే ఇహజీవనమున పునర్జన్మమంది, బీసెంటుసతి ద్విగుణీకృతోత్సాహముతో కార్యరంగమున లంఘించెను.

బ్లేవట్‌స్కీ, ఆల్‌కాట్‌ల సఖ్యము చేకుఱినంతనే బీసెంటుయందలి అద్భుతశక్తి నిదురనుండి మేల్కాంచెను. మానవోద్ధరణమే ఈమె జీవనమందలి ప్రధానోద్దేశమాయెను. సూడానులోనను, ట్రాన్స్‌వాలులోనను, ఐర్లాండునందును, ఇండియాలోనను, రాజకీయములందును, ఆర్థికరంగములందును, సంఘసంస్కరణములందును, స్కౌట్ ఉద్యమమందును సుఖమును బడదన్ని, నిదురను లేపగొట్టి, జంకుగొంకు లెఱుఁగక తాను పూనినపనిని నెరవేర్చుటకై ఒక రంగమునుండి వేఱొక రంగమునకు ఒక యుద్ధభూమినుండి వేఱొక సమరాంగణమునకు కపిధ్వజము చేఁబూని ఢంగు ఢంగున నీమె తనస్యందనమును నడపినది. ఏ యుద్యమమునకుగాని కడంగువారిని తొలుత ముండ్లపొదలును, ఎత్తుకొండలును, దురభిప్రాయములును, దురూక్తులును ఎదుర్కొనును. బీసెంటుసతిని సవాలొనరించిన సిలుగులెన్నని కలవు.

1893 లో ఇండియాయందడుగిడినదాది బీసెంటుసతి విద్యాభివృద్ధికై విశేషముగా పాటుపడినది. నిమ్నజాతులకు చేయూతనిచ్చినది. పెక్కు పాఠశాలలను నెలకొలిపినది. కాశీనగరమున సెంట్రలు హిందూకాలేజికి శంకుస్థాపన మొనరించినది. స్వపరిపాలనమందును, పంచాయతు విధానమందును ప్రాచీనభారతీయులు చూపిన ప్రజ్ఞను వేనోళ్ళను నుగ్గడించి పల్లీయులపై మిక్కిలి మక్కువఁజూపినది. ఈమె New India ను తెఱచిచూచితిమేని, గ్రామ పునరుద్ధరణమున నీమెకుగల తీపి తెల్లమగును. తన యంతరంగ మిత్రుఁడు రంగనాథ మొదలియారు మంత్రిగానున్నపుడు ఈ సత్కార్యమునకై —పల్లె పునర్జీవనమునకై కొంతపైకము నీమె నిర్దిష్టము చేయించినది. ఏమో నాలుగు ఇంగ్లీషుముక్కలను నాలుకకు రాచుకొని హిందూమతమును తుడిచిపెట్ట నుంకించు మహాశయులులికిపడునట్లు, పవిత్ర సనాతనధర్మమందలి మహత్వమును గురుగంభీరస్వరమున భారతీయులకు ప్రబోధించినది. భగవాన్‌దాసు సాహాయ్యమున భగవద్గీతను అనువదించినది. సూరతు కాంగ్రెసులో, రెండుపక్షము లేర్పడి, మహాశయుల శిరసులపై కుర్చీలును, బల్లలును విరిగిపడినపుడీమె ఇరుపక్షముల వారిచే చేతులు కలిపించినది. Home Rule సంస్థాపనమున పాలకులచే "అమ్మో!" అనిపించి, నిర్బంధమునకు తలయొగ్గినది. 1917-లో కాంగ్రెసున కధ్యక్షురాలుగ నెన్నుకొనఁబడి, పదువాలు హయముల శకటమున మహారాజ్ఞిమాడ్కి, కలకత్తా మహానగర వీధులనుండి చని అవిరళసుమవృష్టినందినది. ఈమె యుద్యమమునుండి ఉత్సాహమును తనివార జుఱ్ఱిన గాంధి 1920లో తన పాంచజన్యమును ధ్వనింపఁజేసినంతనే ఈమె వెనుకంజవేసినది. Common wealth of India Bill నిర్మాణమున తన యద్భుతశక్తిని వ్యక్తీకరించి రాజకీయరంగములందు మీసములు పడి



శ్రీమతి కుముదవల్లి ఎడమవైపున ఆమె సోదరి.

మైసూరు రాష్ట్రీయున ఊర్గాం నివాసులగు శ్రీమాన్ ఎ. రామకృష్ణయ్యంగారి పుత్రికారత్నములు. సంస్థాన విద్వాంసులగు శ్రీయుత వీణసుబ్బన్న గారి శిష్యురాండ్రు. ఈ బాలికలు తమ గురువుగారిపేర నడచి సంగీతకళాశాలయందొక విద్యార్థి వేతనము నెలకొల్పుటకై మదరాసు, బెంగుళూరు మొదలగు మహానగరములందు సంగీతసభలను చేయుచున్నారు. గతనెలలో గానమందిరమందు సభచేసి చెన్నపురియందు పండిత పామరులను రంజింపచేసినారు. ఈ బాలికలకు శ్రీ ఎగ్మూరు జగన్నాథభక్త విలాససభవారు, స్వర్ణపతకములిచ్చి రసికుల ధన్యవాదములనందుకొనిరి.



కీర్తిశేషురాలగు

శ్రీ॥ కందుకూరి శ్రీ మహాలక్ష్మమ్మగారు

త్రిష్టువారిచే "ఓహో!" అనిపించుకొన్నది. ఈ బిల్లునందు స్త్రీయుల పునరుద్ధరణమునకై సముచితముగు వ్యవస్థఁగావించి తన సదయహృదయమును ప్రజాళికి జూపించినది. తదుపరి ఈమె తన సమయమును ప్రపంచమందంతటను దివ్యజ్ఞానప్రచారమునకై వెచ్చించినది. ప్రస్తుతజన్మమున తన పని ముగిసినదని వాకొని పరంజ్యోతిసమాత్రమే తలఁచుచు కొన్ని నెలలు మనియుండి, జ్ఞానవృద్ధయై, సీమంతినీచూడామణియై, పావనగుణసంశోభితయై, అనన్యసామాన్య ప్రజ్ఞాధురీణయై, తన 86వ ఏట నైహికారామమును వీడి, జగదీశునిగూడి దివ్యబృందావనమున (Vide: Sir Radhakrishnan's exposition of Mukthi) విహరింపసాగెను.

ఆజీవనము బీసెంటుసతికి గౌరవమును అగౌరవమును చేదోడువాదోడులాయెను! అద్భుతవక్త్రయని 1917 కాంగ్రెసులో వక్తలకు రాజైవరలిన సురేంద్రుఁడీమెను కొనియాడెను! 1920 కలకత్తాలోని స్టార్ థియేటర్‌లో నీమె యుపన్యసించుతఱి వంగీయులీమె నవమానపఱిచిరి. ఆయేటి స్పెషల్ కాంగ్రెసులో గాంధిగారు బ్రతిమాలుకొనువఱకు వంగవాసులీమెను మాట్లాడనిచ్చిరికారు. ధిషణాధురంధరుఁడగు అషుతోషముఖర్జీ మరణించిన పిదప, తొలిమారు కమలా యుపన్యాసము లొసగుటకై బీసెంటుసతి నాహ్వానించి, కలకత్తా విశ్వవిద్యాలయమువారు తమ్ము తాము గౌరవించుకొనిరి. ప్రపంచఖ్యాతిగన్న విద్వాంసు లెందఱో కలకత్తా సెనేటుహాలులో పలుమారు ఉపన్యసించి, వంగహృదయమును ప్రతిధ్వనింపఁజేసిరి! కాని బీసెంటుసతి కమలా ఉపన్యాసము లొసగుతఱి, ప్రాచీనవిశ్వవిద్యాలయములను గురించి ఆమె ఉపన్యసించుతఱి, వంగమాత మహోల్లాసమున నృత్యమొనరించినది! జడములై నిలిచిన సెనేటు స్తంభములు పట్టరాని ఆవేగమున,—పలుకవలవిగాని ఆనందమున,—తన్మయానందమున తమ్ము తాము మఱచినవి! వసుంధరపై మహావక్తలు పుట్టిరి, గిట్టిరి.—కాని బీసెంటుసతి కెనయగు వక్త లెవ్వరును అనునాతన యుగమున పుట్టియుండలేదు. తన వచోగాంభీర్యముచే, ప్రపంచమున కబ్బురమును గొలిపిన గ్లాడ్‌సన్, లాయడ్‌జార్జిలును, లాల్ మోహన సురేంద్రనాథులును, సరోజినీ బిపిన్ చంద్రులును, రాధాకృష్ణ శ్రీనివాసశాస్త్రిలును ఈయమకు నలువంకల బుడిబుడినడువులు నలుపు విజ్ఞానడింభకులై వరలిరి. పెద్దబొబ్బ పెట్టినంతనే, వక్తృత్వమనిగలచు శ్యామసుందర చక్రవర్తులబోలు వారికి బీసెంటుసతి ఉపన్యాసధోరణి చక్కని పాఠము చెప్పెడిది. నలువుర ప్రోలనిలిచి నల్వురను దాటనట్లును, నాలుగువేల జనులను సంబోధించుపట్ల నా సంఖ్య నతిక్రమింపనట్లును నీమె సభనుబట్టి తన కంఠస్వరమును మార్పఁజాలెడిది.

తొలితెడ్డున నల్లనసీటఁజొచ్చి మలితెడ్డునకు శైవలినీమధ్యమున చయ్యనదుముకు డింగీవలె, తొలిమాట కింపుకై ముందులకుచని, తరువాతి మాటకొలల యూపున నీమె ఉపన్యాసమహోదధి మధ్యమున నోలలాడెడిది! సభాంగణమున నీమె మాటలాడుతఱి తన్మయ నృత్యమొనరించు పరమహంసవలె తన్ను తాను మఱచెడిది! ఒక్కొకపరి నీమె హృదయతంత్రులుమ్రోగి, గంభీరరవములను దశదిశలఁ జిమ్మెడివి! పొంగి పొరలి భావధుని ఉబుకుతఱి, ఈమె అంగప్రత్యంగములు మహోద్వేగమున నుప్పొంగెడివి! కరువలి తాకుడున కదలికరళ్లు చివాలున నభోసీమకేరి, అల్లన దిగి, మరల గగనమును చుంబించులీల, నీమె పల్కులుత్తాల తరంగములై వేనవేల నూయెల నూపెడివి! అచేతనవస్తువు లీమె నుడువులు విని ఒకమాఱు చేతనలాభము నందెడివి! మృతజీవులుకూడ 'అబ్బో!' అని ఒకమాఱు తలయెత్తి చూచువారు! ఇట్టి యద్భుత వక్త ప్రస్తుతయుగమున, ప్రపంచమందేకడనైన మఱొకరు పుట్టియుండలేదు —యిఁక పుట్టవలెనన్న, ఆమెయే తిరిగిరావలెను! ప్రశంసించుటెట్లో యెఱుఁగని బెర్నార్డ్‌షా ధత్రాజువలె ఈయమను పొగడినాడు! తెరలుతెరలై జీవకళతో వెడలు నీమెపలుకులు వినుటకై ప్రపంచమందలి వేర్వేఱు జాతుల.

వారు విశ్లేషించుచుండువారు! సభాంగణమందే గాక, న్యాయస్థానములందుఁ గూడ నీమె వచోగాంభీర్యము వ్యక్తమాయెను! పెక్కుమారులు న్యాయవాదుల సాహాయ్యమపేక్షింపక తన కేసులను తాను కడు నేరుపున వాదించుకొనిన విదుషీమణి బీసెంటుసతి.

తమశక్తిని తాము గుఱుతించుట మహావ్యక్తుల లక్షణమని మార్లే వివేకానందులు వాకొనిరి. తన యద్భుతశక్తిని బీసెంటు సతి తాను గుర్తించినట్లు ఆమె యాత్మకథ తెలుపుచున్నది. ఇటీవల తన పత్రములందు "వీరాంగన" యని ఈమె సంతక మొనరించుచుండెడిదని జినరాజదాసు తెలుపుచుండెను. దేవుని కొమరుఁడనని ఏసు తెలుపుచుండువాడు. గురువునని తెలుపుకొనుచు బెర్నార్డ్ షా, పాంచాలీయులకు వ్రాసెను. ఆత్మశక్తిని, జగతియందలి తన కర్తవ్యమును గ్రహించి, బీసెంటుసతి ఈమాఱు భారతసీమయందుఁ బుట్టి, హిందూ జాత్యుద్ధరణమునకై పాటుపడుదునని వక్కాణించి పెంపుడు తల్లిబిడ్డలగల మమకారము చూపెను. తన అంత్యక్రియలు వైదిక ధర్మానుసారము కావలెననియు, తన యస్తికలు గంగాఝరిని జేరవలెననియుఁ దెలిపి సనాతన మతమందలి దృఢవిశ్వాసము నీమె వ్యక్తీకరించెను!

సెప్టెంబరు 21 తేదీని ఉదయ మెనిమిదిగంటలకు మధురమాల్యబంధురమైన నీమె శరీరము అడయారు ఆలయమునకు గొంపోఁబడినపుడు, ఇందుధరసుందరిని గొలువ నరిగిన పెండ్లికొమరిత యట్లీమె తోఁచినది! ధునీకూలమందలి సూర్యాశ్రమమందు చందనచితి నీమె చేరినపుడు కల్యాణవేదిక నధిష్ఠించినట్లు కన్పట్టినది!! కనులపండు వొనరించు చెట్లగుంపము లీశుభసమయమున పచ్చతోరణములై మురిసెను!! మని యున్నపుడు దురంత, దుర్దాంత, దుస్సహ, దుఃఖమును, దురూక్తులను సహించి నల్లే చితిపై నున్నుండె, ధూధూశబ్ద మొనరించుచు మీఁదిమీఁదికి వచ్చు అగ్నికీలల నీమె ప్రశాంతభావమున సాహ్వానించినది! రమ్యమైన అడయారు ఆరామ మీమెకు కడసారి వింజామరవీచెను!! సమీపస్థసముద్రమునుండి విజయశబ్దములుప్పొంగి దిగంతములను ప్రతిధ్వనింపఁ జేసెను!!! అనంతానందమునఁ దన సువర్ణమయూఖల సూర్యభగవానుఁ డీమె సుగంధజ్వాలకర్షూరి మొసఁగెను!!!!



## చమత్కృతి

తుమ్మలపల్లి వేంకటరత్నము పంతులుగారు

క్రొత్తనెత్తమ్మి పువ్వుపైఁ గూరుచున్న
చందమామపయిక్ దమస్సమితి వెడలె—
కలువమొగ్గలజత వెలిగ్రక్కుచుండె,
చాలమెఱుగైన మంచిముత్యాలచాలు—
ప్రకృతిశిశిరంబులైనట్టి పద్మకోశ
యుగముతెలవ్రాల్చె; వానిలోనుండియహహ
వెచ్చవెచ్చని యావిరివచ్చుచుండె—
చూచితే? యెంతలెంతలు చోద్యములు, క
నంగనయ్యెడినో? యయ్యనంగదేవు
దివ్యసామ్రాజ్యమందు; నే దేశమునకు
నేయుపద్రవమెపుడు ఘటిల్లఁగలదో?
చాలులెమ్మింకఁ జాలించు, సరసుఁడా! ప్ర
యాణసన్నాహమనిన భయమ్ముతోఁచె.
వగలాడి చరణలాక్షా
స్థగితలలాటమ్ముచూడు దర్పణమున; నీ
మొగమున్న దద్దమున్నది
మగడా! చాల్, తెలిసెనీదుమంచితనమ్ముల్.




# కీ॥ శే॥ కందుకూరి శ్రీ మహాలక్ష్మమ్మగారు

"పేదచేలను పండించు పెద్ద చెరువు।
కందుకూరి మహాలక్ష్మి కల్పతరువు॥"

—అ॥ నా॥ దాసు.

ధరణిని సస్యసమృద్ధఁగాఁజేయు మహానదులన్నియు నరుఁడెవఁడును జూడరాని భూధరకుహరంబులందు బుట్టి యావెనుకఁ దమ ప్రభావోన్నతి వెల్లి విరియఁ దేశదేశములందు బారునట్టులనే, మహాత్ములును బల్లెటూళ్లలోఁ బేదదంపతులకుఁబుట్టి కాలక్రమమునఁ బెరిగి దిగంతవిశ్రాంత యశోవిభవము గడించుచున్నారు.

ఉర్లా మనునది గంజాము మండలములో నొక చిన్న సంస్థానము. ఇది చిరకాలము నుండియు బ్రాహ్మణ ప్రాజాపత్యమునసే యలరారుచున్నది. దీనిని సంపాదించినవారు బుద్ధిరాజు బసవరాజుగారు. వీరు ఆరాధ్యులు, నియోగులు, భారద్వాజస గోత్రులు. వీరినుండి కాలక్రమమున వీరి దౌహిత్రులగు కందుకూరి బసవరాజుగారి కీసంస్థానము సంక్రమించినది. ఈ కందుకూరివారు హరితసగోత్రులు. శ్రీ బసవరాజుగారికి వెంకటవిశ్వనాథరావుగారను పుత్రుఁ డొకఁడుండెను.

గోదావరీమండలమున ఏనాం ప్రాంతము నొద్ద కాకులపాలెమను నొక చిన్నగ్రామమందు బుద్ధిరాజు సుందరశివరావుగారను సద్గృహస్థు డుండెను. శ్రీమతి సుబ్బమ్మ యను నామె అతని యిల్లాలు. వారు సామాన్యజీవనులే కాని గొప్ప స్థితిపరులు కారు. ఆ పుణ్యదంపతులకు వియ్యన్న, సుబ్బారావు, అన్నమరాజు, మూర్తిరాజు గారలు నలువురు కుమారులును ఈ శ్రీ మహాలక్ష్మమ్మయు నుదయించిరి.

శ్రీ కందుకూరి బసవరాజుగారు, బుద్ధిరాజువారి దౌహిత్రులై ఎస్టేటుకు హక్కుదారులై వెలసిరి కాఁబట్టి యా కుటుంబముపైఁ దమకుఁగల ప్రేమాభిమానములను విడనఁజాలక మన యీ శ్రీ మహాలక్ష్మమ్మగారు పల్లెటూరిపిల్లయైనను, పేద బాపనయ్య కూతురైనను బరిగణింపక, తన కుమారుఁడగు వెంకట విశ్వనాథరావు గారికి, ఆ శ్రీ మహాలక్ష్మమ్మగారినే చేసుకొనిరి. గంజాము విశాఖపట్టణము జిల్లాలయందు శ్రీమంతు లెందరెందరో తన పుత్రునకుఁ బిల్లనిత్తుమని ప్రాధేయపడుచుండినను 'ససేమిరా' యని యొక పేదపిల్లను దన కుమారునకుఁ బెండ్లిచేసిన బసవరాజుగారి ప్రేమాభిమానములు ప్రశంసాపాత్రములే కదా! అందును జమీందారులగు తాము స్వయముగా నా కుగ్రామమునకరిగి యా పేదబ్రాహ్మణునిఁ బ్రార్థించి కన్యను దెచ్చుట సామాన్యవిషయమాయనియు నీతరము వారికి దోచుట స్వాభావికమే! కాని యా తరమువారి తీరు వేరు—ఈతరమువారి తీరు వేరు. వైవాహికవిషయములయం దా

నాకు బసవరాజుగారివంటి యజమానులు అసంఖ్యాకులుండిరి. వారి గాథ లీనాటికినిఁ బల్లెటూళ్లలో ననుశ్రుతములై యున్నవి. అవియే యీనాటి మనకు నిజమైన నాయుస్సులు.

శ్రీ మహాలక్ష్మమ్మగారి జననము, విభవ సంవత్సర మాఘశుద్ధ చతుర్దశి. వివాహము యువసంవత్సర మాఘశుద్ధ పంచమినాడుర్లాము గ్రామములో సకల వైభవోపేతముగా జరిగినది.

బసవరాజుగారు లౌకిక ప్రతిభాశాలియని దొరతనమువారే మెచ్చుకొనియున్న సంగతులఁగూర్చి గంజాం డిస్ట్రిక్టు మాన్యూలునఁ జూడవచ్చును. అది యటులుండ నింక వారి పారమార్థికబుద్ధిఁ బరికింతము గాక. తమ తాలూకాలోఁ బ్రతి గ్రామమందు నొక మంచి కోనేరు త్రవ్వించిరి. దేవాదియందు దేవాలయప్రతిష్ఠజేసి అగ్రహారము గట్టించి యన్నసత్రముఁ బెట్టించిరి. రైళ్లు పడియున్న యీదినములలో మనకు వాటి విలువ తెలియకుండుట వింతకాదు. కాశీ, రామేశ్వర యాత్రికుల కవి ప్రాణరక్షకములై యుండినవి కదా! ఇవియన్నియు నొకయెత్తును వారి పండితాదరణ మొక్కటియు నొకయెత్తును!! ఉత్తరసర్కారులలో, నుర్లాము సంస్థానమున శ్రావణికి సత్కరింపఁబడని విద్వాంసుఁడుండెనా? "ఉర్లాము పద్దులోఁ" బడుట ఆనాటి పండితుల కొక యూనివర్సిటీ సర్టిఫికేటే యని నమ్మెదరు గాక.

సర్వవిధముల సంస్థాన మింతటి మహోన్నతదశయం దున్నపుడే, శ్రీ మహాలక్ష్మమ్మగారి భర్త గుఱ్ఱపుబండినుండి పడి, ప్రమాది సంవత్సర ఫాల్గున శుద్ధసప్తమినాడు, శివసాయుజ్యము నొందెను. అయ్యయ్యో! "సర్వత్ర సామగ్ర్యవిధా గుణానామ్ పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః" యను కవిరాజవాదము వేదమే కదా!!

ఆ కష్టకాలమున శ్రీ మహాలక్ష్మమ్మగారు మైనరుగానున్నందున 'ఎ స్టేటు' 'కోర్టాఫ్ వార్డ్సు'లో జేరినది. అంతటి నుండియు మన శ్రీ మహాలక్ష్మమ్మగారు, అన్నలయొద్ద సంస్కృతాంధ్రములును ప్రభుత్వనియమితయగు థామ్సను దొరసాని గారియొద్ద నాంగ్లేయభాషయు నభ్యసింప నారంభించిరి. ఈ సందర్భమున మనము, "ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యా" యనుట నిజమనవలసినదే! కాకయున్న నేడెనిమిదేండ్లలో నామె సంపాదించిన జ్ఞాన మప్పటి మండలాధికారుల ప్రశంసకుఁ బాత్రమై యుండదు గదా!

1889 సం॥ములో శ్రీయమ్మగారు సంస్థానాధిపత్యము జేబూనిరి. అంతటి నుండియు నుర్లాం రాజ్యలక్ష్మియొక్క గొప్పదనము మునుపటికంటె మూడంత లెక్కుడైనది. "Charity begins at home" అని యెఱిగి యున్న యీస్వామిని, తాలూకాలోఁగూడఁ దనకు సర్కారువారిచ్చిన సగములో నొక సగము సోదరులకిచ్చి మిగిలిన సగముతో జలాధారముల నన్నిటిని జక్కఁబరచి విశాలములైన సరుగుఁదోటలు వేయించినది. ఉర్లాము, చిన్నయూరైనను, దానిలో

నొక లోయర్ సెకండరీ పాఠశాలను బెట్టించి నాటయేబదిమంది పిల్లలకు మువ్పొద్దుల భోజనములు పెట్టించి ఉచితముగాఁ జదువు చెప్పింపఁ బూనినది: ఈబిడ్డలకు వారమున కొకతూరి తలయంట్లు!! పర్వదినముల పాటింపు! అవసరమైన యౌషధసేవలు!!

తన కడుపుననే కలిగియుండిన, నలుగురో యైదుగురో, కాకయున్నఁబదిమందియో, బిడ్డలు కలిగియుందురు కాని యీవిధమున వందలకొలఁది బిడ్డలు, నోరార 'అమ్మా'యని పిలచుచు చేతులఁజాచి చుట్టును మూఁగి, యాతల్లి యిచ్చు భక్ష్యముల నందుకొనుచుండునట్టి సౌభాగ్యగరిమ ఆ "యమ్మగారికే" పూర్వపుణ్యమునఁ గాక యూరక కల్గునా!! ఒకనాఁడు ప్రస్తావవశమున నామిత్రుఁ డొకఁడు ఆ "యమ్మగారి" జన్మదినోత్సవ దినములలో నడచుచుండిన వేడుకలలో నతి ముఖ్యమగు విద్యార్థి జనసంతర్పణమును దలఁచి వలవల యేడిచినాఁడు. అతఁ డొకఁడేకాదు! ఆ "యమ్మగారి"నిఁ దలఁచుకొని యేడుచువారు వందలకొలదిగ నున్నారు.

సంవత్సరమునకు రెండుమారులు వికలాంగులకుఁ గడుపారఁ గూడుపెట్టి, యొడలినిండ గుడ్డగట్టించిన యాదయామయి నేటికినిఁ దత్స్థానములయందు వృద్ధదంపతులచేఁ గీర్తింపఁబడుచున్నది కదా!

ఆయమ పెట్టించిన వేదపాఠశాలయందును సంస్కృతపాఠశాలయందును జదువుకొన్నవారు నేఁడు జగత్ప్రసిద్ధులై యున్నారు. "అమ్మగారు" కార్తికమాసములయందుఁ జేయుచుండిన యారాధ్యసమారాధనము నిరుపమానము గదా!

"అమ్మగారి" ముఖావలోకన మాత్రమున "ఈమె శరీరముగొన్న శాన్తి—సత్య శౌచదయాభిమానములకుఁ దావు—ఈవులకు వేల్పుటావు, నీతికిఠావు" అని వెంటనే తెలియ వచ్చెడిది! కష్టసుఖములను వినుటయందామె కాపులకుఁ గన్నతల్లియే! ఇఁకఁ గన్నెఱ్ఱజేసి చూచుట యామెకుఁ గలలోని వార్త.

సర్వవిధముల బసవరాజుగారి కాలము నాటికంటెఁ దనకాలమునాఁడు సంస్థానపుఁ బ్రఖ్యాతి నభివృద్ధిజేయుచు నెన్నఁడు గాని ఋణము సేయక సమస్త దానధర్మములు సలిపి తీర్థయాత్రలఁజేసి సకలజనమాన్యయై పదివేలరూకలు నగదును పదునేను వేల రూప్యముల విలువయగు అలంకారములును ఆరు వందల గరిశెలధాన్యమును నిలువచేసి 1908సం॥ డిసెంబరు నెల తే 8 దీని యా శ్రీమహాలక్ష్మి కైలాససీమ నలంకరింపఁబోయినది.

సోదరీమణులారా! ఈశ్వరానుగ్రహము వల్లనే నీసచ్చరిత్రమును మీయెదుటఁ బెట్టఁ గల్గితిని. ఇంక నిట్టి యుత్కృష్టచరిత లెంత మంది యున్నారో కదా!

శ్రీమహాలక్ష్మమ్మగారి తరువాత నిప్పు డుర్గాముసంస్థానము, దేవాది, ఉర్గామునను రెండుభాగములుగా విభజింపఁబడి శ్రీబాలసూర్యప్రసాదరావు బహద్దరుగారును శ్రీలక్ష్మీప్రసాదరావు బహద్దరుగారునను సోదరులచేఁ బాలింపఁబడుచున్నది. శ్రీమంతులగు నీయిరువురుఁగూడ విద్యాప్రియులై యశోభాగులై వెలయుచున్నారు.

# రాజా రామమోహనరాయ్

శ్రీమతి చుండూరి రత్నమ్మగారు

## విద్యాభ్యాసము—ఉద్యోగము

రామమోహనుని తల్లిదండ్రులు పూర్వాచార పరాయణులు. శక్తిపూజా ధురంధరులు. వంగదేశమున కాళికాదేవి నారాధించుట సాంప్రదాయమై యున్నది. ఈయన 1774 సంవత్సరమున రాధానగరమున నొక బ్రాహ్మణ వంశమున జన్మించెను. అప్పటి కాలములో పార్శి అరబ్బి భాషలు రాజభాష లగుట వల్ల రామమోహనుని తండ్రి యీభాషల నాయనకు నేర్పించెను. సంస్కృతముగూడా రామమోహనుడు బాగుగా నేర్చుకొనెను. పార్శి అరబ్బి భాషలు నేర్చుట వలనను ఖురాన్ మున్నగు మహమ్మదీయ మతగ్రంథముల జదువుట వలనను రామమోహనునకు విగ్రహారాధనయందు నమ్మకము పోవుటచేతను, శక్తిపూజ చేయుచున్న తండ్రికిని ఈయనకును సంఘర్షణ ప్రారంభమయ్యెను. క్రమక్రమముగా యిది వృద్ధియగుట వలన రామమోహనుడు స్వగృహమును వీడి పరదేశముల సంచారము చేయవలసి వచ్చెను. ఈ సందర్భములో టిబెట్టు, నేపాళము మొదలగు దేశములకేగి అచ్చట బౌద్ధవాఙ్మయమునుగూడా పరిశోధించి స్వదేశమును చేరెను. పిమ్మట ఈయన ఆంగ్లేయభాషను నేర్చి అందు గొప్పపాండిత్యమునుగూడ సంపాదించెను. దొరతనము కొలువునందు చేరి అప్పటికాలపు సిరస్తాదారు ఉద్యోగమును చేయుచుండెను. ఈఉద్యోగ సందర్భములో తాబేదారులు వయి అధికారులవద్దకు వెళ్లినపుడు చేతులుకట్టుకుని నిలుచుండుట కలదు. తన్ను సమానముగా చూచిననే గాని ఈ ఉద్యోగమున నేనుండనని రామమోహనుడు స్పష్టముగా చెప్పి తన ఆత్మగౌరవమును వెల్లడించెను. కలక్టరు వగయిరా పెద్దఅధికారులు గూడ రామమోహనుని గౌరవించుచుండిరి.

## సహగమనము శిశుహత్యలు

ఆకాలమున భర్త చనిపోయిన వెంటనే జీవములతోనున్న భార్యను బలాత్కారముగా భర్తచితి పయిని పడద్రోసి కాల్చి వేసెడువారు. దేశము యొక్క నలువయిపులనుండియు యీ ఆహాకారములు వినవచ్చుచుండెను. తల్లిదండ్రు లిద్దరును చనిపోవుట వలన బిడ్డలు అనాథలయి దిక్కులేక అల్లాడుచుండిరి. ఈమహాఘోరమును చూచి రామమోహనుడు అప్పటి గవర్నరుజనరలుగానున్న లార్డు విలియంబెంటిక్కు ప్రభువుతో పలుమారులు విన్నవించెను. పండితులతోను, పెక్కుమంది ప్రభువులతోను, వాదప్రతివాదములుసలిపి, ఇట్టి అమానుష పద్ధతికి శాస్త్రములయందెచ్చటను ఆధారములేదని స్పష్టముగా వాదించుచుండెను. తుట్టతుదకు 1829 సంవత్సరము డిశంబరు 4-వ తేదిని, ఇండియా గవర్నరు జనరలు లార్డు బెంటిక్కు ప్రభువు యీసహగమన దురాచారమును మాన్పునట్టి చట్టమును రామమోహనుని కృషివలన చేసెను. ఈ దినము భారతదేశచరిత్రలో అత్యంతప్రాముఖ్యమయినది.

ఆకాలముననే, మన రామమోహనుడు నరబలులు, పసిబిడ్డల గంగలో పారవేయుట మున్నగు పెక్కు దురాచారములను తన కృషిచే పూర్తిగా మాన్పించెను.

## బ్రహ్మసమాజ మతము

హిందూశాస్త్రములలో ఏకేశ్వరారాధనను గురించి స్పష్టముగా చెప్పబడినప్పటికిని హిందువులు బహుదేవతారాధనపరులయి విగ్రహముల పూజించుట కలవాటుపడిరి. ఈ పూజించుటలోగూడ భిన్నభిన్న మతములు, వాదనలు, బయలుదేరినవి. ఇట్టి భిన్నభిన్న మతములు మన హిందూదేశములో 4000 గలవని తెలియుచున్నవి.

క్రైస్తవ, మహమ్మదీయ హిందూశాస్త్రములలో దేవుడొక్కడని చెప్పబడియుండ భిన్నభిన్న వాదములు చేయుట కేవలము విరుద్ధమని తెలుపుచు, సర్వ

మానవులును, జాతి మత కుల వివక్షతలేక ఏకేశ్వరుని ఒక్క మందిరముననే అందరును కలిసి, ఆరాధించుటకు, ఉపాసన చేయుటకు, తగిన అవకాశము గలదని నమ్మి 1815-వ సంవత్సరములో కలకత్తా నగరమున ఆత్మీయసభ నొకదానిని స్థాపించెను. రామమోహనునిచే స్థాపింపబడిన ఈ ఆత్మీయసభయే క్రమక్రమముగా బ్రహ్మసమాజముక్రింద మారి అనేకవేల విద్వాంసులను ఆకర్షించెను.

## స్త్రీ స్వాతంత్ర్యము

రామమోహనుడు స్త్రీస్వాతంత్ర్యమును గూర్చి ఈవిధమున జెప్పియుండెను. "స్త్రీలకు సంపూర్ణ అవకాశము లివ్వుడు. వారియందు మహత్తరమయిన శక్తులు గలవు. వారు ప్రపంచ కళ్యాణమునకయి పురుషులతో సమానముగ పాటుబడెదరు. పూర్వము గార్గి, మైత్రేయి, లీలావతి, భానుమతి, మున్నగు స్త్రీలవలెనే గొప్పశక్తులను ప్రదర్శించెదరు. వారు ఉన్నతస్థితికి వచ్చుటకు మీ రవకాశము లియ్యక అణచియుంచి, వారు దుర్బలులనియు పిరికివాండ్రనియు సాకులు చెప్పెదురు. ఇది స్త్రీలపయి మోపు కల్పితనిందగాని మరియొకటిగాదు. వారికి భక్తి శ్రద్ధలు తక్కువ యని పురుషు లనెదరు. ఇది మహా ఘోరమును, విపరీతమును అగు అపవాదము. బంగాళా దేశములో కులీనబ్రాహ్మణులు భార్యలవలననే తమ జీవితములను గడుపుకొనుచుందురు. ప్రథమమున వివాహముచేసికొన్న భార్యను యింటనుంచికొని, తక్కిన భార్యలయొద్దకు సంచారము వెళ్ళుటయు, ఎక్కువ సొమ్మిచ్చిన మామగారింట ఎక్కువ దినములుండుటయు, తమబిడ్డలను వారిసంతతిని కాపాడెడు భారము మామగారిమీదనే వైచుటయు ఈదేశములో గలవు. వీటినన్నిటిని స్త్రీలు సహించుట లేదా? ఒకొక్కప్పుడు పురుషుడామెను పశువుకంటెను నీచముగా చూచుచుండును. స్త్రీలయొక్క ఓర్పునకును, భక్తికిని యింతకన్నను సాదృశ్యము లేమి యుండవలెను?" అని రామమోహనుడు ప్రబోధించుచుండెను.

## ఇంగ్లాండు ప్రయాణము.

పూర్వాచారపరాయణు లనేకులు సహగమన నిషేధ శాసనమును రద్దుచేయించవలెనని తీవ్రమయిన ఆందోళన సల్పనారంభించిరి. సభలుచేసి వ్యతిరేకముగా తీర్మానములు చేయుచు, గవర్నరు జనరలుగారివద్దకు విజ్ఞప్తులను బంపుచు, దేశమంతట అలజడి కలుగజేయుచుండిరి. రామమోహనుడు గూడా, సహగమనమును రద్దుపరచినందులకు 300 మందిచేత దస్కతులు చేయించి, తమ కృతజ్ఞతను ప్రభుత్వమునకు వెల్లడించెను. పూర్వాచారులును 800 మందిచేత దస్కతులు చేయించి విజ్ఞాపనను పంపగా దీనిని రద్దుచేయుటకు నాకు అవకాశము లేదనియు, బ్రిటిష్‌రాజాకే విన్నవించవలెననియు ప్రత్యుత్తరమిచ్చెను. దీనిని బట్టి ఒక రాయబారమును పార్లమెంటుసభకు పంపుటకు నిశ్చయించి, చిడీ యను దొరను తమ ప్రతినిధిగా సీమదేశమునకు పంపుచుండిరి. దీనిని బట్టి రామమోహనుడు గూడను తన వాదమును పార్లమెంటు సభయెదుట తెలియపరచి, ఈశాసనమును రద్దుకాకుండునట్లు కృషిసల్ప నిశ్చయించెను. ఈస్టిండియాకంపెనివారి కవులు 1833-వ సంవత్సరముతో అంతమగును. దీనిని మరల పునరుద్ధారణచేయుటకు పార్లమెంటు మహాసభ సమావేశమగును. ఈసందర్భములో భారతదేశ రాజకీయ విషయములు తత్సంబంధమగు అనేక మార్పులు పార్లమెంటుసభలో చర్చకురానైయున్నవి. అందుచేతను రామమోహనుడు ఇంగ్లండు వెళ్లుటకు నిశ్చయించి 1830-వ సంవత్సరములో బయలుదేరెను. ఢిల్లీ పాదుషాయగు రెండవ అక్బరు తన కష్టసుఖములను పార్లమెంటువారి యెదుట నివేదించుటకు, రామమోహనరాయునకు రాజాయను బిరుదునిచ్చి తన ప్రతినిధిగా గూడా యేర్పాటుచేసెను.

రామమోహనుడు ఇంగ్లాండుకు బయలుదేరి వెళ్లుచుండగా నేటాలువద్ద ఫ్రెంచి స్టీమరుపయిని ఫ్రెంచి స్వాతంత్ర్యోత్సవ పతాకమును గాంచి, ఆనంద భరితుడై తన దేశమునకు గూడా స్వరాజ్య భాగ్యమెప్పుడు గలుగునా యని యోచింపదొడగెను.

సీమదేశమును జేరి అచ్చట వివిధ రాజకీయ వేత్తలతోడను, మత గురువులతోడను, పత్రికాధిపతులతోడను, ఐరోపాదేశమున గల పెక్కుమంది ప్రముఖులతోడను పరిచయము చేసికొని భారతదేశము యొక్క ప్రతిభను వారికి వెల్లడించెను. వీరందరును ఈ మహనీయుని లోకజ్ఞానమును, ఉన్నతాదర్శములను, విశాలభావములను జూచి, ఆశ్చర్యపడిరి. రామమోహనునిచుట్టు పండలకొలది పాశ్చాత్యవిద్వాంసులును, మతగురువులును, స్త్రీలును, చేరుచుండిరి. భారతరాజ్యాంగవిధానమును గురించి పార్లమెంటు సభలో చర్చకు వచ్చినపుడు, అనేక ఉత్కృష్ట విషయములను రామమోహనుడు వెల్లడించెను. పార్లమెంటు సభ్యులందరును రామమోహనుని రాజకీయ పరిజ్ఞానమునకు ఆశ్చర్యపడిరి. ఈవిధముగా నిరంతర కృషి చేసి, తాను సంకల్పించిన కార్యభారమంతయు నెరవేర్చుకొని భారతదేశమునకు తిరిగి రానున్న తరుణమున 1833 సంవత్సరము సెప్టెంబరు 27 తేదిని బ్రిష్టలు నగరమున తన బంధుమిత్రాదులు, తన దేశీయులులేని అన్యదేశమున భారతీయుల దురదృష్టమున ఈశ్వర సాన్నిధ్యమున కరిగెను. ఈమహనీయుని అచ్చటనే సమాధి చేసి పిమ్మట అచ్చట నొక మందిరమును ఆయన భక్తులు నిర్మించిరి.

---

## ఆంధ్రలక్ష్మి

శ్రీమతి కుడితిపూడి అచ్చమాంబగారు

కాకతీయనృపశిఖామణి ఘనభుజాదండాల స్థైర్యాన తాండవించి
పల్నాటివీరుల పౌరుషరక్తతరంగాల చెదరక ప్రతిఫలించి
బొబ్బిలిబెబ్బుల్ల బొచ్చరింతలగూడి దిశలుమార్మ్రోగ ప్రతిధ్వనించి
విజయనగరరాజ వివిధవిజయకేతనంబుల హొయలుతో నాట్యమాడి

పగలకెల్లజే ప్రక్కలో బల్లెమగుచు
ఎల్లరాజ్యంబులకు నొరగల్లుగా ను
తింప తిరమైన పేరుప్రతిష్ఠగన్న
ఆంధ్రసామ్రాజ్యలక్ష్మి! జోహారులివిగో.

తెలుగు కైతనుదారితీసి "ఆదికవి"యన్నామంబువడసె నన్నయ్యగారు
తెలుగు కైతనుదిద్దితీర్చి బల్ మేల్వన్నెచిన్నెలు చెక్కె తిక్కన్నగారు
తెలుగు కైతకు క్రొత్తతెన్నులనిండించి పన్నాణమొదివె పెద్దన్నగారు
స్వకపోలకల్పనల్ జాలువారంగ మార్దవము చేకూర్చె సూరన్నగారు

ముద్దుముచ్చటలొలుకు నపూర్వకృతుల
తెలుగు కైతకు సొబగులచిలికినారు
ఇట్టికవికుమారులతో రహించుచున్న
ఆంధ్రసామ్రాజ్యలక్ష్మి జోహారులివిగో.

# వనితాలోకము



శ్రీమతి సుశీలాదేవి

శ్రీయుత ద్వారకాప్రసాదసింగుగారి పుత్రిక. కాన్పూరు బాలికాపాఠశాలయందు సంగీతమునకుగాను ప్రత్యేకబహుమానమునొందిన బాలికామణి.



శ్రీమతి బొడ్డపాటి సీతాబాయమ్మగారు



"అమ్మాయి యానందం"

శ్రీయుత పంతుల జగన్నాధరావుగారు)



శ్రీమతి కె. డి. రుక్మిణిఅమ్మగారు
బి. ఎ. యల్. టి.,

శ్రీ మైసూరు మహారాణివారి మహిళా కళాశాల కీయమ అధ్యక్షురాలై యుండెను. ప్రస్తుతమున మైసూరు యూనివర్సిటీ సెనెటుసభలో ప్రభుత్వసభ్యురాలుగా నెన్నుకొనబడెను.



శ్రీయుత ఆకుండి వెంకటశాస్త్రిగారి
ఛాయాచిత్రకౌశలము

# స్వర్గీయ అన్నపూర్ణాదేవి

స్వర్గీయ శ్రీమతి మాగంటి అన్నపూర్ణా దేవిగారియొక్కయు శ్రీ అన్నపూర్ణాదేవి జాతీయ బాలికా పాఠశాల యొక్కయు షష్ఠమ వార్షికోత్సవము అక్టోబరు రెండవ తేదిని ఏలూరుపురమున జరిగినవి. గుంటూరు జిల్లాబోర్డు అధ్యక్షులును, శాసనసభాసభ్యులును, సంపన్న కమ్మకులస్థులును నగు శ్రీయుత జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి గారధ్యక్షత వహించిరి. ఉదయమున నామె సమాధివద్ద విద్యాలయ బాలికలును, శ్రీమతులు గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు అట్లూరి వేంకట సీతమ్మగారు మొదలగు వారలును ప్రార్థనలు సలిపిరి. మధ్యాహ్నము గ్రంథాలయ భవనమున బాలికల ప్రార్థనము అధ్యక్షునకు స్వాగతపత్ర పఠనము జరిగిన పిమ్మట శ్రీమతి లింగం అన్నపూర్ణాదేవి గారు హరిజనోద్ధరణమును గూర్చి హిందీ భాషలో ధారాళముగ నుపన్యసించిరి. హరిజన దేవాలయ ప్రవేశనిరసనము, శారదా కోటు మొదలగు వానిని గూర్చిన ప్రహసనములు జరిగెను. శ్రీమతి మద్దుల దమయంతీ దేవిగారు శ్రీ అన్నపూర్ణాదేవిగారి జీవనమునుగూర్చి ఉపన్యసించెను. శ్రీయుత అయ్యదేవర కాళేశ్వరరావుగారు "ఆసియా ఖండపు వీరాంగనల"ను గూర్చి యుపన్యసించుచు హిందూదేశపునారీమణులు త్యాగము, విజ్ఞానము, పౌరుషము, మానము, శీలము మొదలగు గుణములలో ప్రపంచములోనే దేశపుస్త్రీలకును తీసిపోరనియు అన్నపూర్ణాదేవివంటి వారే అందుకు నిదర్శనము లనియు తెలిపిరి. శ్రీయుత దోమా వేంకటస్వామి గుప్తగారు "అన్నపూర్ణాదేవిగారి భాషా సేవ"ను గూర్చి యుపన్యసించిరి. శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు 'భారత దేశమునందు స్త్రీలస్థానమును గూర్చి యుపన్యసించుచు పురాణకాలమునందు స్త్రీలగ్రస్థానము వహించిరనియు; మధ్యయుగమున నధోగతికి వచ్చిరనియు; నవీనయుగమున మెట్టవేదాంతములు, మూర్ఖవిశ్వాసములు, రామకోటులు వ్రాయుటయందు కాలము వ్యర్థముపుచ్చుటలు మాని సాంఘికవిషయములను గూర్చి ఆలోచించిన తమ తొంటి గౌరవస్థానము నలంకరించగలరనియు చెప్పెను. శ్రీమతి దామెర్ల కమలారత్నమ్మగారు "అధునికనారి"ని గూర్చియు, రాయుడు గంగయ్యగారు అన్నపూర్ణాదేవిగారు చేసిన హరిజనసేవను గూర్చియు ఉపన్యసించిరి. అధ్యక్షుని అంత్యోపన్యాసముతో సభ ముగిసెను.

అన్నపూర్ణాదేవిగారి యెడల ఆంధ్రదేశస్థులకు గల గౌరవము ఏడాదికేడాదికిని హెచ్చుచున్నదనుటకు ఆమె వార్షికోత్సవ

సందర్భమునకు నెచ్చువుంది మహనీయు లరు దెంచుచుండుటయు ఆమె పేరట స్థాపించ బడిన పాఠశాల శుక్లపక్షచంద్రుని మాడ్కి దినదిన ప్రవర్థమానమగు చుండుటయే నిదర్శనములు. 2 వ తేది సభకు అయిదారువందల మంది పురుషులును, రెండుమూడువందల మంది స్త్రీలును విచ్చేసిరి. పాఠశాలయో, నూరుగురు బాలికలతోను ఆరుగురుపాధ్యాయులతోను జరుగుచున్నది. బాలికలకు వసతి గృహము నిర్మించు ఏర్పాటులు జరుగుచున్నవి.

అన్నపూర్ణాదేవిగారి పేరుగా ఆంధ్రదేశమున చిరకాల విద్యాసంస్థ నిలువగలదు. ఆమె తన భర్తపేర వ్రాసినలేఖ లామెసౌశీల్యమును, సదాశయములను, ఆమె జీవించి పని చేయుచుండిననాటి దేశపరిస్థితులను సుందరముగ చాటకమానవు. వానిపైని శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు వ్రాసిన ప్రశంస వేరొకచో ముద్రించబడియున్నది.

శ్రీమతి అన్నపూర్ణాదేవిగారిని చిరకాలమునరకు తలపించగలవివి రెండును మాత్రమేకావు. ఆమె ముద్దుల కూతురు చిరంజీవి ఝాన్సీ విద్యాసక్తియందును దేశాభిమానమునందును, సేవానిరతియందును తల్లిని మరపించగల యుత్తమురాలు కావలెనని ఆంధ్రదేశ మాసించుచున్నది. పువ్వుపుట్టగనే పరిమళము వెలయునట్లు చిట్టిఝాన్సీకి వచ్చీ రాని జ్ఞానము నాటినుండియే ఉత్తమ బుద్ధు లుదయించుచున్నవి. ఈమె యారేండ్ల ప్రాయమున ననగా 9-2-33 తేదిని యరవాడ జైలులోనున్న గాంధిమహాత్మునకు వ్రాసిన లేఖయు మహాత్ముడు వ్రాసిన ప్రత్యుత్తరమును ముద్దులు మురిపెములు గురియుచు నెల్లరకు నానందమును గూర్చును. ఆలేఖ లిదిగువ ప్రకటింపఁబడుచున్నవి. మరియు హరిజనోద్ధరణమును గూర్చి ఆమె 17-5-33 తేది రాత్రి యేడుగంటలకు ఒకపాట వ్రాసినదట: అదియు ఇందు ప్రకటింపఁబడినది. ఆనాటి కామె వయస్సు 6 సంవత్సరముల 2 మాసముల 17 దినములు. పరమేశ్వరు డీమెకు దీర్ఘాయు రారోగ్యాదు లొసంగును గాక!

ఝాన్సీ లేఖ

ఏలూరు,
9-2-33.

శ్రీయుత గాంధీదాదాగారికి ముద్దులు. అక్కడ మీరు బాగున్నారా? రెండోతరగతి చదువుచున్నాను. మీ ఉత్తరము అందినది. స్కూలు వృద్ధిలోనికి వస్తోన్నది. బొమ్మలు పెట్టుకున్నప్పుడు హరిజనుల పిల్లలను పిలిచాను. పాటలు పాడించాను. పసుపు, కుంకుమ, పండ్లు, అటుకులు, శనగపప్పు పంచిపెట్టాను. మీరు చెప్పిన ప్రకారము హరిజనసేవ నాన్న చేస్తున్నారు. అమ్మస్కూలుకు నాకు ఆశీర్వాదము కావలెను. మీ వుత్తరమున కెదురు చూస్తున్నాను. తాత, అమ్మమ్మ మీకు నమస్కారములు. ఛాగల్లుఆశ్రమం సుందరమ్మగారు మీకు నమస్కారములు చెప్పుమన్నారు. దయయుంచ గోరుచున్నాను.

ఇట్లు,
మీ మనుమరాలు,
ముద్దుల ఝాన్సీ.

మహాత్ముని జవాబు

ఎరవాడ సెంట్రల్ జైల్,
14-2-?3.

నీవు పంపిన వుత్తరమును, ముద్దులను అందినవి. ఉత్తరమును నీవేవ్రాసి నాకు అర్థము చెప్పవలెను. నీవింకను బాగుగను, పిరాతోను వ్రాయవలెను. నేను నీదస్తూరీ తెలుసుకొనలేక పోయినను బాగుగ లేదని మాత్రము తెలియుచున్నది. నీవు వ్రాత నేర్చుకొనుటకు ప్రథమమున నిలువుగీతలు, సున్నలు, ముక్కోణములు, చతురములు మొదలగువాని సులభముగా వ్రాయ నేర్చుకొనవలెను. ఇకను ఆకులు, పుష్పములు, పాత్రలు, పక్షులు మొదలగు వ్రాయుట నేర్చుకొనవలెను. ఏలనన, అప్పుడు చూచినవస్తువులను సరిగా వ్రాయుట అలవడును. అక్షరములను వ్రాయుటయు అటువంటిదే. నీవు హరిజన బాలికలను ప్రేమించుచుండుట వారితో స్నేహము చేయుచుండుట ముదావహము. తాతగారిని, అవ్వగారిని, సుందరమ్మగారిని అడిగినానని చెప్పుము.

ప్రేమతో బాపు

[పైలేఖతోనే ఆమె మాతామహి శ్రీమతి కలగర పిచ్చమ్మగారికిని మహాత్ముడీ దిగువజాబును వ్రాసెను.]

ప్రియసోదరీ,

ఉత్తరము వ్రాసినందులకు వందనములు. అన్నపూర్ణమ్మలు విషయమును ఝాన్సీ చదువుచున్న విషయమును, గమనించితిని. పాఠశాల ఎల్లప్పుడును నాయాశీర్వాద పాత్రమే. ఇందుతో వ్రాసినజాబును ఝాన్సీకి తెలిపి చెప్పుము.

ఇట్లు,
ఎమ్. కే. గాంధి.

—:o:—

## ఝాన్సీ రచించిన పాట

మనగాంధిదేవుని కర్మయోగిని మరువకను మదిగొల్వరా॥
ఆరుకోటులు భారతావని కూడులేకున్నారురా
హైందవులు హరిజనులు అవనిలో కూడులేకున్నారురా ॥మన॥
హిందుదేశపు ప్రజలువారన అంటుబడుతున్నారురా
పంపులొద్దను గుడులదగ్గర పారగొడుతున్నారురా ॥మన॥
మాలవీయుని మదినిదలచియు మాలతనమును బాపరా
పాపమెల్లను బాయునట్టుల గాంధిదేవునిగొల్వరా ॥మన॥

## పతిభక్తి

శ్రీమతి పీరుభొట్ల రామలక్ష్మమ్మగారు

లలనయొండల్త్రిమూర్తుల పాపలగజేసి లీలగాజోలి నుయ్యాలలూపె,
పతియోర్తు తనభర్తచనిపోవునుభీతి అరుణోదయంబున కడ్డువెట్టె,
పొలతివేరొకతె తన్వలచివచ్చుకిరాతు శాపానలమున భస్మంబుచేసె,
సుదతికొండొక్కతె సుదెతాల్పు మెప్పించి జీవితేశుసజీవు జేసుకొనియె,
భువిని ఈమాడ్కిసోదరీ! పూర్వసతులు కీర్తనీయముగాను సుత్కృష్టమైన
సంగతులజూపిరన్న నాశ్చర్యమేమిటి? వారికింగల్గుపతిభక్తి వలనగాదె!

# అన్నపూర్ణాదేవి లేఖలు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

ఆంధ్రవాఙ్మయములో "అన్నపూర్ణాదేవి లేఖలు" ఒక అపూర్వగ్రంథము. ఆంధ్రభాషాలలామ కిది క్రొంగ్రొత్తసొమ్ము. శ్రీయుత మాగంటి బాపినీడుగారు తమ సతీమణియగు అన్నపూర్ణాదేవిగారు వివాహమునకు పూర్వమునందును పరమునందును, తాను అమెరికాయందు ఉన్నతవిద్య నభ్యసించు నప్పుడును అంతకు పూర్వము దేశములో అచ్చటచ్చట చదువుకొను చున్నప్పుడును తమకు వ్రాసిన లేఖలను గ్రంథరూపమున ప్రచురించినారు. అరటిచెట్టుయొక్క పట్టలన్నియు గుమికూడి మ్రానుగా నేర్పడినట్లు స్వర్గీయ అన్నపూర్ణాదేవిగారి లేఖలన్నియు గూడి యిట్లు గ్రంథరూపమును దాల్చినవి. కాని నిక్కమున కివి అన్నపూర్ణ స్వహస్త లిఖిత లేఖలు.

అన్నపూర్ణాదేవి విరకులమని విఖ్యాతిగన్న కమ్మకులమున సంఘసంస్కార ప్రియులగు జననీజనకులకు జన్మించినది. దేశభక్తి భరితమగు వంగవాతావరణమునందు, స్త్రీల విద్యాస్వాతంత్ర్యములనాశించెడి బ్రాహ్మల సాంగత్యమున, బ్రాహ్మపాఠశాలయందు కలకత్తాలో విద్య నభ్యసించినది. ఉన్నత విద్య నభ్యసించి వివిధదేశ హితైక కార్యములలో పాల్గొనెడి వంగబ్రాహ్మయువతుల సాంగత్యమున దైవసేవ, దేశసేవ, మానవసేవ, సాహిత్యసేవ మున్నగు ఉత్కృష్టధర్మములను అలవర్చుకొన్నది. వయోరూప విద్యావిశేషంబుల అనురూపవరుడగు బాపినీడు గారిని భర్తగా బడసినది. ఈ వివిధ దోహదములచే అన్నపూర్ణాదేవి మానసక్షేత్రమున నుదయించిన వివిధ భావాంకురములు అల్పప్రాయముననే పెద్దపెరిగినవి. కాన అన్నపూర్ణాదేవి లేఖలు భర్తకు వ్రాసినవేయైనను సామాన్య యువతీయువకుల సల్లాపములుగా నుండక వివిధవిషయములతో నిండియున్నవి.

అన్నపూర్ణాదేవి లేఖలు చదివినవారికి ముఖ్యముగా మూడు ఉత్తమగుణములు జటయల్లినట్లు ఆమెమానసమున నల్లుకొనియుండెనని విదితమగును. (౧) ఉన్నతవిద్యాభిలాష (౨) ధనసేకరణాసక్తి (౩) దేశభక్తి. ఈ గుణత్రయము దేవియం దొక దానికంటె యొకటి యధికముగా నున్నట్లు గోచరించును. కాని వీనిలో నేది యధికమని ప్రశ్నించినచో దేశభక్తియే యధికమనవలయును. ఏలనన, అన్నపూర్ణ ఉన్నతవిద్య నభిలషించెను. ఎందుకొఱకు? దేశసేవ చేయు నిమిత్తమే. ధనము కోరెను, ఎందుకొఱకు? దేశశ్రేయమునకు వినియోగించుకొఱకే. కాన మాతృదేశభక్తి యామెయందు నిరుపమానమని విదితమగుచున్నది. మఱియు దేశభక్తుల కుండెడి త్యాగము, సేవ, దీక్ష, నిర్భయత యను నాల్గుఉత్తమగుణములు దేవియందు మూర్తీభవించియున్నట్లు ఆమె లేఖలు చెప్పకనే చెప్పుచున్నవి. అన్నపూర్ణను చక్కగా నెఱుగని వారును నెఱిగిన వారును గూడ ఆమెను గూర్చి జరుగుచున్న ఉత్సవాదిక ప్రచారములు కడుపుతీపిచే తల్లిదండ్రు

లును, అనురాగాతిశయముచే భర్తయు, గావించుచున్న ఆడంబరమని తలంచుచుండుట గలదు. కాని నేను దేవియొక్క స్వహస్త లిఖిత లేఖలు ప్రచురింపబడుటచే ఆమె దేశభక్తి దబ్బరగాదని తెలిసికొనుటకు వీలైనది.

అయినను స్త్రీల దృష్టితో చూచినచో ఈ లేఖలను ప్రచురించుటయందు భర్తయొక్క యుపచార మెంతగలదో అపచార మంతగలదని చెప్పకతప్పదు. ఏలనన? తమ సతీపతుల యిరువురి డెందములలోనే గుప్తధనముగా నుండగలవను నిండునమ్మకముతో అన్నపూర్ణ వ్రాసికొనిన జాబులివి. కాన విదుషియు, రసజ్ఞయు, దేశసేవాతత్పరయు, స్వాతంత్ర్యభావ ప్రపూర్ణయు, ఎలప్రాయంపు నవనాగరికపు యువతియునగు నన్నపూర్ణాదేవి వివిధసందర్భములలో వివిధసంబోధనలతో వివిధపోకడలలో భర్తకు జాబులు వ్రాసినది. మఱి 'కార్యేషు దాసి కరణేషు మంత్రీ... షట్కర్మయుక్తా కులధర్మపత్నీ' అను ఆర్యనీతిని అనుష్ఠించెడి యిల్లాలుగదా. పరదేశములోనున్న భర్తకు నెన్ని విషయములు తెలుపవలసి యుండును? ఎన్ని గృహచ్ఛిద్రములు వినరింపవలసియుండును! ఎన్ని మనోవ్యథలు వెల్లడింపవలసియుండును! ఎన్ని కోరికలు తెలియజేయవలసియుండును! ఎన్ని రీతుల మందలింపవలసియుండును! మఱియు ఆరితేరని చిన్న పిల్లగదా. చిన్నతనమునుండియు పెరిగిన మామగదా. ఆ దుడుకు, ఆ వడి, ఆ చనువు! లేఖలలో కనుపడక దాగునా? కాని యివి యన్నియు వీధిని బెట్టదగినవా? కాన యిట్టి గోప్యధనమును ఈవిధముగా తన అనుజ్ఞలేకుండ ఆంధ్రుల చేతి కందించినందులకు స్వర్గీయ అన్నపూర్ణ పెనిమిటిని ఆమోదించి అభినందించుచున్నదో! లేక కోపలజ్జావిస్మయంబులు ముప్పిరిగొన అరుణలేఖలు పొడిచిన వాలుగన్నుల జూచుచున్నదో! అన్నపూర్ణకు వయస్సు కొంచెము. అనుభవము కొలది. కార్యాసక్తి మెండు. భావోద్రేక మత్యధికము. దేశభక్తి కొండంత. ఆరోగ్యము పూజ్యము. కాన సంకుచిత స్థలమున బడిన బీజము మొలకెత్తి పెద్దపెరిగి వేరుతన్నగనే స్థలమును భేదిల్లచేయునట్లు అన్నపూర్ణ చిన్న హృదయములో నాటుకొనిన మహోన్నత భావములు ఆమె హృదయమును భేదిల్లజేసినవి. అన్నపూర్ణయందు యీభావతీవ్రతయే లేకున్న అకాల మృత్యువువాత బడకుండెడి దనుటకు సందియము లేదు. విధి అన్యథా ఉన్నది. తల్లిదండ్రుల కడుపుననే గాక ఆంధ్రజనని గర్భమునను చిచ్చిడి స్వర్గమున కుద్గమించినది. అన్నపూర్ణ అన్ని విధముల సుగంధకుసుమమే గాని అన్ని రేకులు విచ్చలేదు. తావులు వెదజల్లలేదు. అరవిరి మొగ్గగనే వాడిపోయినది. పరువము రాకమునుపే కోసి పండవేసిన పండువలె అల్పప్రాయముననే అన్నియుచేసి అంతరించినది. ఆంధ్రజనని అభాగ్య, ఆసేవావ్రత సేవ చిర

కాలమందుకొను భాగ్యమునకు నోచికొన లేదు!

సాధారణముగా వ్రాసిన జాబులేయైనను చక్కని గ్రాంథికశైలిలో నొప్పి లేఖలన్నియు నవలవలె చదువ నింపుగొల్పుచున్నవి. పరిశిష్టమున ప్రకటింపబడిన రాజుగారికి వ్రాసిన లేఖలు దేవియొక్క దైవభక్తిని వైరాగ్య చింతను విశదీకరించుచు గ్రంథమున కంతయు శోభను గూర్చుచున్నవి. ఇందు దేవి చరిత్రము పొందుపరుపకపోవుట యొకలోపము. అందువలనరూపములేని యే అశరీరవాణియో పలికినటులున్నది. మఱియు కల్పితలేఖల బురుడించుచున్నవి. ఈ లేఖలను స్త్రీలెల్లరు చదువదలంతురు. ఇందువలన రెండు లాభములు. దేవి సచ్చరిత్రము తెలియును. దీని విక్రయలాభము దేవిపేర నెలకొల్పబడిన విద్యాలయమునకు చెందును. ఆంధ్ర సోదరీమణులు ఆదరింతురు గాక.

---

# వెడలెనామె

వఝ్ఝల వేంకటేశ్వరకవిగారు బి.ఏ.

వెనుదిరిగియుల్లి చూచుచు వెడలనామె
వడిగ ననువీడి నాదృష్టిపథమువీడి;
అశ్రుబిందుసంసిక్తమ్ము లౌ విలోక
నమ్ములంకితమ్ములు నామనమ్మునందు.

నిన్నరాతిరి యాచెలి నీలికురుల
నలరిన గులాబిపూలరేకులు విడివడి
తద్వియోగానుగతవిషాదమున వాడి
సన్నగిల్లిన పీశూన్యశయ్యమీఁద.

ఆమెకోమలదరహాస మామెనయన
మోహనవిలాస మామెమనోహరాంగ
యౌవనవికాసము కొఱంతయైన యీగృ
హంబు కళఁబాసి శూన్యమై యమరునేఁడు.

ఆమె యిటునటునడయాడ నవతరించు
చీరకుచ్చెళ్ల సడిగాని చేతికంక
ణములధ్వనిగాని పదనూపురములరవము
గాని వినరాదు శ్రవణయోగ్యముగనేఁడు.

ఆలతాంగి పెంచిన గులాబీలుకూడ
నావలెఁగృశించు విరహసంతాపకలన;
ఆమెనీలంపుఁగురుల నెయ్యమ్ము లేక
స్రిదఁలు శుష్కమ్ములైన యాపిరులుకూడ.

ఈవిలోచనయుగళికి నీపెదవుల
కీకరమ్ముల కిపు డేదియో కొఱంత;
ఆమనోజ్ఞత కనిపింప దాయమృతము
దొరక దా ప్రియబంధంబు దూరమింక.

# స్త్రీజన ప్రాశస్త్యము

30-9-33 తేది శనివారమునాడు చెన్నపురి ఏకామ్రేశ్వరాగ్రహారమునందలి 'గోవర్ధనభవనమున' శ్రీ పురీమఠం జగద్గురు శ్రీ శ్రీ భారతీ కృష్ణతీర్థస్వాములవా రిట్లుపన్యసించిరి.

'యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః' అని మనుస్మృతియందు చెప్పబడియున్నది. స్త్రీలు పూజింపబడు ఏగృహమునందైనను ఏదేశమునందైనను దేవతలు వసియించుచుందురని దానితాత్పర్యము. మన ధర్మశాస్త్రము లందును, మత గ్రంథములందును, ఋషులు స్త్రీలకు చాల గౌరవము నొసంగియే యున్నారు. ఇట్లుండియు మనదేశములోని స్త్రీలకు స్వాతంత్ర్యము లేదనియు వారిస్వాతంత్ర్యమునకు పురుషు లడ్డుతగులుచుందురనియు, ఖండాంతరవాసు లందురు. వారి నననేల, మనలోనే ఖండాంతరవాసుల సాంగత్య మెక్కుడుగా గలవారి కీయభిప్రాయము మెండుగానున్నది. ఇక సంఘసంస్కర్తల విషయమును గురించి తెలుప నక్కరయేలేదు. పాశ్చాత్య దేశములలోని సంఘసంస్కర్తలు జాతిమతములను వేఱుచేయుటకై యూజినిక్సయిన్సు మున్నగువానిని కనిపెట్టి శ్రమ పడుచున్నారు. మనదేశములోని సంఘసంస్కర్తలు జాతిమతముల నొక్కటిగాజేయ తహతహ పడుచున్నారు. స్త్రీలను విశేషముగా గౌరవించు పాశ్చాత్యుల ధర్మములను మనము కొంత విచారింపవలసి యున్నది.

## స్త్రీసృష్టి—బైబిలు

జనిసస్సు పాశ్చాత్య మతగ్రంథములందు మొదటిది. ఈశ్వరు డాఱుదినములు సృష్టివ్యాపారమును జరిపినట్లు దానిలో నున్నది. ఆరవదినమున మనుష్యసృష్టి జరిగినట్లు ఆ గ్రంథమున జెప్పబడియున్నది. ఏడవనాడు విశ్రాంతికొఱకై ఈశ్వరుడు సృష్టికార్యమును మానివేసినాడట. ఆ పద్ధతిప్రకారమే యిపుడు మన దేశమునందుగల సమస్త కార్యాలయము లందును, ఇతర సంస్థలందును ఆదివారము సెలవుదినమైనది. ఈశ్వరునిచే సృష్టింపబడిన పురుషులలో ఆదము మొదటివాడు. స్త్రీలు ఈశ్వరునిచే సృష్టింపబడినట్లా గ్రంథమున లేదు. ఏదోయొక యెముకనుండి స్త్రీజాతి సృష్టింపబడినదని యాపుస్తకమున గలదు. వీరు స్త్రీలను గౌరవించువారట. తక్కినవారు స్త్రీలను క్రిందుపరచువారట. ఇక మనగ్రంథములం దీవిషయమును గుఱించి విచారించుచో నెన్నియేని యాధారములు కన్పించుచుండును. ఈశ్వరుడు శక్తితో గూడియే సృష్టికార్యమునకు గడంగెనని మనగ్రంథములం దనేక ప్రమాణము లున్నవి.

'శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం' అని మనకు ప్రమాణము కలదు. శివశక్తియే మన శరీరబలము. దానినే మనము మహాకాళియని చెప్పుదుము. విష్ణుశక్తియే ధనబలము. దానినే మనము మహాలక్ష్మియని చెప్పుదుము. బ్రహ్మశక్తియే బుద్ధిబలము. దానినే మనము సరస్వతి యందుము. వీరే మహాకాళీ, మహాలక్ష్మి, మహాసరస్వతులు. వీరినే మనము నవరాత్రములందు పూజించుచున్నాము. వీరే త్రిశక్తులు. వీరు లేనిచో బ్రహ్మ విష్ణ్వీశులును నిర్వీర్యులే. కాబట్టియే మనపురాణములం దెందుజూచినను త్రిమూర్తులు పార్వతీ పరమేశ్వరులుగను, సరస్వతీ బ్రహ్మలుగను, లక్ష్మీనారాయణులుగను వర్ణింపబడుచుందురు. శక్తివిరహితముగ వీరుండునట్లు మన గ్రంథములందు వేనిలో గాని కాన్పించదు. శ్రీమదాది శంకర భగవత్పాదులు మండనమిశ్రునితో వాదము చేయవలసి వచ్చినది. ఆశ్రమములలో గార్హస్థ్యమే మోక్షప్రదమైనదని మండన మిశ్రులమతము. అది కాదు, సన్న్యాసమె మోక్షప్రదమయినదని శంకరుల మతము. ఈవాదములో ఎవరు ఓడిపోవుదురో వారు వారి యాశ్రమములకు వ్యతిరిక్తమగు నాశ్రమమును స్వీకరింపవలసినట్లు మొదట ప్రతిజ్ఞ కలదు. అనగా శంకరు డోడినచో గార్హస్థ్యమును స్వీకరింపవలసినట్లును, మండనమిశ్రు డోడినచో సన్న్యాసమును

స్వీకరింపవలసినట్లును వారి ప్రతిజ్ఞయొక్క భావము. ఆ వాదమునకు ఉభయ భారతి యను దేవి (మండన మిశ్రుని భార్య) తీర్పరిగా నుండినది. ఇంతకన్న స్త్రీల నింకెట్లు గౌరవింపవలయునో తెలియజాలము. మండనమిశ్రు డోడెనని తెలిసికొని ఉభయభారతి తన భర్త 'యతు లిరువురును భిక్షకు దయచేయవచ్చు' నని పరిహాసరూపముగా నుడివినది.

### పురుషులు గృహకృత్యముల కనర్హులు.

వలయుచో నింకను నెన్నియో నిదర్శనములను జూపవచ్చును. మన మాచరించు సువాసినీపూజలు కన్యకాపూజలు మున్నగునవి స్త్రీజన ప్రశస్తిని దెల్పుటలేదా? అంతేకాక, తద్గర్భధారణాది విషయములందు స్త్రీకిగాక పురుషున కట్టి యర్హత లేదను అంశము నెల్ల రెఱింగియే యున్నారు. గర్భధారణ విషయ మటుండనిచ్చి శిశుపోషణవిధాన మంతకంటె కష్టతరమైనదియు సుకుమారమయినదియు నగును. ఇట్టి లలితవ్యాపారమునకు పురుషు డేమాత్రమును పనికిరాడు. 'ఆడుదాని చేతియర్థము మగవాని చేతి బిడ్డయును అభివృద్ధి గాంచనేర'దని మనకు సామెతయును గలదుగదా? స్వభావముచేతనే పురుషుడు మోటుతనముగలవాడు. స్త్రీ లలితస్వభావము గలది. కావుననే ఆస్పత్రులందు తరచుగా స్త్రీలే నర్సులుగా నుందురు. స్త్రీల కింతటి గౌరవముండినను 'పురుషుడు' శాస్త్రముల నన్నింటిని తన కనుకూలముగ వ్రాసికొనెనని పాశ్చాత్య సంపర్కముగల మనవా రనుచుందురు. ఇది వారి యవివేకముగ దలంపవలయునే కాని వేఱుకాదు. పాశ్చాత్య స్త్రీలకు పేర్లు గూడ స్వతంత్రముగ నుండవు. పెండ్లి యగువఱకు తండ్రిపేరు. తర్వాత భర్తపేరు. ఇదియా స్త్రీకి స్వాతంత్ర్య మొసగినందులకు గుఱుతు? వారి గాలి సోకుటవలన మనలో గొందఱు సావిత్రి, రుక్మిణి, దుర్గ మున్నగు సుందరతరనామములను పలుక నిచ్చగింపక భర్తనామములను ధరించికొనుచున్నారు. పాశ్చాత్య స్త్రీలకు గృహవ్యాపారములందంతగా జోక్యములేదు. వారి స్త్రీలకు తాముగన్న బిడ్డలను నొకప్పుడు తెలియకపోవుట కలదు. ఇందులకు లేడీహామిల్టను అనునామెకు ఆమె కుమారునికి జరిగిన సంవాదమును తార్కాణముగా గ్రహింపవచ్చును. ఈ సంవాదము ఆంగ్ల భాషాపరిచితి గల్గినవారి కందరకును సువిదితమే కాన, దాని నే నిట నుడువను.

### ఉత్తమస్త్రీలు భర్తలనుగూడ నుద్ధరింతురు.

బుద్ధియనుసారథి యింద్రియములను అశ్వములను నడపునట్లు స్త్రీ ధర్మాధర్మములను నిర్ణయించి మహాపాపియగు భర్తను సయితము తనతోడ స్వర్గమునకు గొంపోవునని మన శాస్త్రపురాణములందంతటను గలదు. స్త్రీజన్మ మత్యుత్తమ మయినది. స్త్రీలేనిచో సృష్టికార్యమే మునిగిపోవును. హనుమంతుడు లంకను దహించినపుడు ఆ దహనమువలన సీతాదేవికి ఆపద కలుగలేదాయని యొకడు ప్రశ్నించెను. అగ్ని అగ్నిని దహింపనేరదని హనుమంతునకు నమ్మకము గలదని యతడు ప్రత్యుత్తరమిచ్చెను. దీనిభావములను మీరే తెలుసికొనుడు. పతివ్రతలగు స్త్రీలవలన కడతేరిన పురుషులను మన గ్రంథములందు మనము విరివిగ గనుగొనవచ్చును. ధృతరాష్ట్రుని దురవస్థ జూచి యోర్వలేక గాంధారి తానును కన్నులను మూసికొనలేదా? మగడు చచ్చుచో తానును జావ నిచ్చగించినదికదా సావిత్రి. ఇటువంటి యుత్తమత్వమును స్త్రీలయందు ప్రతిపాదించి గ్రంథములలో వ్రాసినవారు పురుషులుకారా? స్త్రీలు అన్నవస్త్రములకై యిల్లిల్లు దేవులాడ రాదనియు, వారు గృహమునందేయుండి పురుషులచే గౌరవింపబడవలయు ననియు నెంచి "పితారక్షతి కౌమారే భర్తారక్షతి యౌవనే, పుత్రోరక్షతి వార్ధక్యే న స్త్రీస్వాతంత్ర్య మర్హతి" అని మనవారు చెప్పిరి. అంతియకాని యిప్పటివారూహించునట్లు మనవారు స్త్రీల నగౌరవపరచిరని యూహించుట కింతమాత్రమును మన గ్రంథములందాధారములు కానరావని గట్టిగ చెప్పవచ్చును.

ఇక పురుష లక్షణములును వారు స్త్రీలయెడల మెలగవలసిన విధానమును తర్వాత శనివారము నాటికి నుడువుదునని, శ్రీవారు తమ యుపన్యాసమును ముగించిరి.

విద్వాన్ తూళ్లా విశ్వనాథశాస్త్రి,
ఆంధ్రోపన్యాసకుడు, పచ్చయప్ప కళాశాల.

(ఆంధ్రపత్రిక)

# వనితాలోకము



శ్రీమతి లీలావతి మున్షీ సతి. బొంబాయి

గతమాసమున సతారా నగరమున స్వదేశవస్తు ప్రదర్శనముగావించి హిందూదేశము నిత్యనైమిత్తికోపయోగములగు స్వల్పవస్తువులకై కూడ పరదేశములపై నాధారపడియుండుట మిక్కిలి విచారకరమనియు నిరుద్యోగ సమస్యలోకమంతటిని గలవరపరచుచున్నది యటులుండ భరతఖండమున కేవలము దుర్భరముగా నున్నదనియు ఇట్టియిక్కట్టు సమయమున విద్యావంతులు దీక్షతో నిత్యావసరములగు వస్తువులను తయారుచేయ బూనుట పరమకర్తవ్యమనియు, సామాన్యనగరములయందునుగూడ జనసామాన్యమునకునలయు వస్తువులను విక్రయించుటకు స్వదేశవస్తు విక్రయశాలల నెలకొల్పవలెననియు శ్రోతలచిత్తములు కరగునట్లుద్బోధించెను.



శ్రీమతి దమయన్తిబాలి, బి. ఎ.

హరిజనోద్ధరణమునందు హాయివిసుగులులేక పాటుపడుచున్న దయామతి పంజాబులో రానున్న శాసనసభా సభ్యత్వమున కభ్యర్థినియై నిలచినది.



శ్రీమతి రామేశ్వరదేవీమిత్రగారు

ఉత్తమ వ్యాసరచనకై, అప్పర్ ప్రావిన్సస పబ్లిసిటీ డిపార్టుమెంటువారిచే లేడీహైయ్‌లీ సువర్ణపతకము బహూకరింపఁబడినారు.



శ్రీమతి ఆరుముగ మొదలార్
సతీమణిగారు

కరైక్కుడిలో నూతనముగఁ ప్రతిష్ఠింపఁబడిన స్త్రీల క్లబ్బున కీయమ ప్రెసిడెంటుగా ఎన్నుకోఁబడినది.



శ్రీమతి డి. సక్కుమ్మగారు

కూర్గులో కాఫీవ్యవసాయము చేయుటయందు ప్రసిద్ధినొందినారు. మరియు మైసూరు స్టేట్ ఎసెంబ్లీయందు సభ్యురాలు.

మైసూరు స్త్రీవిద్యాసంస్థయందు ఎడ్వైజరీ కమిటీలో ప్రభుత్వ నియమిత సభ్యురాలు.



శ్రీమతి డా॥ యు. అభయాంబాళ్,
యం. యె., పిహెచ్. డి., (లండన్)

మైసూరు యూనివర్సిటీ ఎకాడమిక్ కౌన్సిలులో సభ్యురాలుగా ఎన్నుకోఁబడెను.



శ్రీమతి పి. కృష్ణమేనన్ సతీమణిగారు

కూనూరున భారత మహిళాసమాజమునకు అధ్యక్షురాలుగా ఎన్నుకోఁబడినవారు.

# రత్నచ్యుతి

కోలుకొండ భద్రయ్యగారు

అదంతా భయంకరారణ్యప్రదేశం. విరియబూసిన మల్లెపూలవాసన యెల్లదిక్కుల నలుముకుంది. మందమారుత మల్లనల్లనవీస్తోంది. ఆ ప్రకృతి శోభంతా "నా పిచ్చి" నినుమడించింది.

నే నాదారి నాత్రంతో బోతున్నాను. దవుదవ్వులనేదో యపూర్వకాంతి పుంజము, కళ్ళు మిరుమిట్లు గొల్పునట్లు నాకు దృగ్గోచరమయ్యింది. అది విద్యుల్లతల నీనుతోంది. ఆ సోయగమంతా దానినుండే బహిర్గత మవుతోంది కాబోలని తలచాను. నేను పట్టరాని తమకంతో నచ్చటికి పరుగెత్తాను. సఫలీకృత జన్ముడనని సంతసించాను. వివశాంగాలతో దానిని చేతబట్టినాను.

నా స్పర్శకు ప్రకృతంతా పులకితమయ్యింది. సమీపముననున్న "బొండు మల్లియ" యొకటి నన్నుజూచి తెల్లగా నవ్వింది. దానినిబట్టి నా శిథిలహృదయానికి గట్టిగ అదుముకున్నాను. దానిశీతలతకు నా హృదయాగ్ని చల్లారింది. దానిని నాముకుళిత నేత్రపద్మాలకు అద్దుకున్నాను. దాని సుఖస్పర్శకు అవి వికసించాయి. దానిని నా పేరాసచే మాటిమాటికి చుంబనం జేసినాను. దాని కాంతి ప్రసారముచే నా యధరము అరుణిమ దాల్చింది. దాని యద్వితీయ తేజములో విలీనములైన నా కండ్లు—ఇతర వస్తువులయెడ గ్రుడ్డివైనాయి. దానిచేత, నే నన్నిటా 'ఆనందామృతమే' పానము చేసినాను. దాని సన్నిధానము వల్లనే సృష్టిలో నేను 'శాంతి సుఖముల' రుచిచూడగలిగాను.

కొన్ని దివారాత్రాలిట్లే దాని 'తమకం' లో నామేను మరచి పయనించాను. తనవలపులో నన్నుముంచి నా "కైతవరత్న" మెట్లో జారిపోయింది. ఇక నాయూహాప్రవాహ మాగిపోయింది. నా చింతావాహిని పొంగి పొరలిపోయింది. నా మనోవ్యథ నణచుకోలేక చావు బ్రదుకులమధ్య తూగాడుతున్నాను. సౌందర్యరాశియగు ప్రకృతి నాకు తిరిగీ దుఃఖరూపమై పొడగట్టింది.

నిరంతరాకులితాంతరంగంతో వెదకుచున్నాను. కాలపూరుషుడు నా కనులకు "వియోగాంధత" నిచ్చాడు. పూర్వవృత్తాంత సంస్మరణమున నే నిపు డున్మాదుడనైనాను. అది నయ్యది లభించినచోట నేనిపుడు నిలచి నిరీక్షిస్తున్నాను.

ఓం శాంతి శ్శాంతిః

# బిడ్డలఁబెంచుటయందలి మంచిచెడుగులు

యల్. వి. ప్రసాదరావుగారు.

'మొలకను యెట్లువంచిన, చెట్టు అట్లువంగును.'

బిడ్డలను వారువారు వికాసమునుపొంది అభివృద్ధి చెందవలసిన మార్గమునఁ బోనిచ్చుటలో వారివారి తలిదండ్రు లుపయోగించు పద్ధతులలో భేదముండును. కాని సామాన్యముగ తలిదండ్రు లందరును తమబిడ్డలు బాగుపడవలయుననియు,గొప్ప ఆదర్శపురుషులుగను, స్త్రీలుగను కావలయు ననెడు కుతూహలము విశేషముగ గలవారుగ నుందురు. అయినప్పటికిని వారిని పెంచుటలో తాముపయోగించుచున్న పద్ధతులచేత తమ బిడ్డలయెడ నీ తలిదండ్రులు గొప్ప యపరాధమును చేయుచున్నారు. నిజమున కీయపరాధమును తమకు తెలియకనే వీరొనర్చుచున్నారు.

ఈ పద్ధతులు ఏ ఫలితములఁ గలిగింప నుద్దేశింపబడి వాడబడుచున్నవో యా ఫలితములను గలుగఁజేయుటలేదు సరిగదా బిడ్డల భావిసౌఖ్యమునందును, విజయమునందును యీ పద్ధతులు తొలగింప వీలులేని హానిని కలిగించుచున్నవి.

తలిదండ్రులే బిడ్డకు మొదటి గురువులు. తల్లియొడి యందాడుకొను స్థితియందే బిడ్డ ప్రథమపాఠముల నేర్చుకొనుచున్నది. అమెరికా దేశమునందలి గొప్పవాఁడగు అబ్రహాము లింకను (Abraham Lincoln) మహాశయుఁడు ఒకప్పు డీవిధముగ చెప్పెను: "నే నిప్పుడున్న స్థితికిని, భావికాలమునందు పొందనున్న స్థితికిని నా తల్లియే కారణము." లింకను కాలమునకు పూర్వమందును పరమందును ఉండియున్న మహాశయులందరును ఈ విధముననే తమ జీవితములందలి యౌన్నత్యమునకుఁ దమపితరులే కారణమని నుడివియున్నారు. వారి పలుకులందలి సత్యమును గ్రహింపుడు!

సర్వదా మనకడ్డువచ్చు గొప్పచిక్కు ఏమన మనము "బిడ్డలను పెంచుట" యను విషయమై యొకప్పుడైనను నిజమైన శాస్త్రజ్ఞానముతో విచారించియుండక పోవుటయే. బిడ్డలయొక్క అవిధేయతకు కారణమును గుఱించికాని, వారియందగుపడుపట్టుదల (పెంకితనము అనగా వారి యిష్టప్రకారమే చేయ నెంచుట)కు గలకారణమును గుఱించికాని, అసత్యమాడుటకు కారణమును గుఱించికాని తలిదండ్రులమగు మనము ఎప్పుడును దీర్ఘముగ నాలోచించము. ఇంతియగాక తగుమార్గమున మొదటనే తొలగింప బడని యెడల మున్ముందు దుఃఖకరమైన ఫలితములను గలిగించు నితరచిహ్నముల యొక్క కారణమునుగురించి మనమెప్పుడును వెదకియుండలేదు. ఇట్టి తప్పునకు గల మూలకారణమును సూక్ష్మదృష్టితో నాలోచించి యాకారణమును సరియగు మార్గమునఁ దొలగించుటకు మారుగ బిడ్డలు దుష్టప్రకృతిని (స్వభావమును) గనబరచినప్పుడెల్లను వారిని మనము కఠినముగా శిక్షింతుము; లేదా వారియిష్టము వచ్చినట్లు పోవుటకు వారిని వదలి వేయుచున్నాము. ఫలితమేమన బిడ్డకు సహాయ పడుటకు మారుగా మనము వారికి నిజముగా తొలగింప వీలులేని చెరుపును చేయుచున్నాము. ఇట్టి చిక్కులకు మూలమును గ్రహించి దానిని తొలగింప యత్నించుటే మనము చేయవలసిన పని.

'భయము పెట్టుటగాదు, నమ్మికను గల్గించుట' ఇదే బిడ్డలఁ లోబఱచుకొని వారియందు విధేయతను అలవరచుటకు మూలసూత్రము.

మానసిక శాస్త్రమునందు నూతనముగా కనిపెట్టబడి బిడ్డలస్వభావమునకు సంబంధించిన సిద్ధాంతములను తెలిసికొనఁజాలక చాలమంది తలిదండ్రులును ఉపాధ్యాయులును కొన్ని సందిగ్ధ సందర్భములందు అణగద్రొక్కుటచేతను, భయపెట్టుటచేతనుమాత్రమే తప్ప మఱొక విధమున తమ యధీన మందుంచబడిన బిడ్డలు లోబడరని తలంతురు. ఇది యొకపొరపాటు అభిప్రాయము.

ఇట్టివారు తమ బిడ్డలయొక్క చెడు అభ్యాసములకు తామే కారణమను సంగతిని మఱచియుందురు. బిడ్డలకు సంబంధించిన ప్రతివిషయము నందును జోక్యము కలుగఁజేసికొనుట చేతను, పలుమారు కోపపడుటచే గలిగిన గుండె దిగులువల్లను, తమ బిడ్డలు పాడైపోయిన పిదప అదేమార్గమని తలచి పెద్దలు వారిని కఠినముగ శిక్షింప నారంభింతురు. సంతానము వలని

సౌఖ్యమును,) ఆనందమును, ముక్తిని గాంచదలచిన తలిదండ్రులు తమ బిడ్డలు తమకు విధేయులైయుండుటకు తమతమ స్వభావములను లోబఱచుకొని ప్రతి స్వల్పవిషయమునందును కోపప్రకృతిని వ్యక్తీకరింపక తమ చిన్నబిడ్డలకు తమయందొకవిధమగు నమ్మకము జనించునట్లు ప్రవర్తించుటయే సరియగు మార్గమని నేటి నాగరిక ప్రపంచముచే కనిపెట్టబడి యాచరణ యందుంచ బడుచున్న విధానము.

ఈ నూతన విధానము వలన అవిధేయులైన బిడ్డలు విధేయులై చెప్పినమాటను వినువారగుచున్నారు. వారియందు సహజముగ కల్పడు లజ్జ (లేక సభాపిఱికితనము) అసూయ, భయము, దాంబికము బడాయి మున్నగు దుర్గుణములు పోగొట్టబడుచున్నవి. వీని స్థానమున మనోధైర్యము, త్యాగబుద్ధి, సాహసము, నిరాడంబరత్వము మున్నగు సుగుణములు నెలకొల్ప బడుచున్నవి. ఈ పద్ధతి యింతటితో నూరుకొనుట లేదు: బిడ్డలఁ బెంచు భాగ్యముగల పితరులందఱి చేతను సహజముగ వాంఛింప బడునట్లు తమ బిడ్డల యందు ఉన్నతా దర్శములను గలిగించి వారియొక్క నడవడిని చక్క బఱచుచున్నది.

ప్రస్తుతకాలమున పాఠశాలలందు శారీరకశిక్ష (శరీరముపై దెబ్బలుకొట్టుట) కఠోరముగ కేకలువేసి ఆజ్ఞలనిచ్చుట, గదితరములగు కోదండము వేయించుట మున్నగు పూర్వకాలపు విద్యాలయములందలి శిక్షావిధానముల కింతమాత్రమును చోటులేదు. బిడ్డలు బానిసలవలెను, మృగములవలెను మానవబంధక మిత్రులవలెను, విజ్ఞాన వ్యాపింపనుటకు సహాయము నపేక్షించుచున్న లేదిగలవలెను జూడబడుచున్నారు. సహాయము చేయబడుచున్నారు గాని శిక్షింపబడుట లేదు. ఫలితము లత్యాశ్చర్యజనకములుగా నున్నవి.

సాధారణముగ బిడ్డలబెంచుట యొక కష్టమైన సమస్యయని తలిదండ్రులు గొందఱు పలుకుచుండుట మనము గనుచుందుము. పితరులు బిడ్డలతోబాటు వారి నమ్మకయందును, ఆనందమునందును, ఆటపాటలయందును పాల్గొనుచు వారి విశ్వాసమును సంపాదింప గల్గినయెడల కష్టముగ నుండుటకు మారుగ నీ 'బిడ్డలను పెంచుట' యొక యపూర్వ సుఖసాధనముగ మారగలదు. గానవిద్యయందలి మాధుర్యము గానకళాభిమానునకు మాత్రమే యెట్లు గోచరించుచున్నదో అదేవిధమున బిడ్డల యుత్సాహమును, మనము 'అల్లరి' యని పిలుచు వారియొక్క చుఱుకుదనమును, ఆటవస్తువులు మున్నగువానిని విఱుగగొట్టుట, ఊడదీయుట, పాడుచేయుట మున్నగు పనులయందు వారు చూపు పదార్థ సంయోగవియోగ నిర్మాణవిజ్ఞానమును అర్థము చేసికొనుటకు బిడ్డలకే గాని తదితరులకు వీలుగాదు. ఆకారణమున బిడ్డయొక్క అంతర్యమును (ఇంగితమును లేక ఉద్దేశ్యమును) గ్రహించుటకు పెద్దలమగు మనము మనయందలి యసూయాది దురహంకారములను మాలిన్యమును తీసివైచి అప్పటికప్పుడైనను బిడ్డలమైపోయి విశుద్ధనైర్మల్యమున నుండుట ముఖ్యావశ్యకము. ఇట్లగుటచే బిడ్డయొక్క గౌరవమునకుఁ గూడ మనము పాత్రులముగానగుదుము. ఇట్టి పద్ధతి ప్రాతవిద్యాభ్యసన పద్ధతులకు గగనకుసుమమువంటిది.

ప్రస్తుతమందును, రానున్న కాలమునందును గర్వించుట కెట్టి నూతనోన్నత మార్గము! సర్వకార్యములందును నేర్పును, కోమలత్వమును గనబఱచుచు బిడ్డను సహజముగు సాహసానందోత్సాహములతో నిండియుండు బాలబాలికలను—సర్వవిధముల పరిపూర్ణులగు చిన్నపురుషులను, స్త్రీలను—గలిగియుండుట.

పైకి క్రొత్తగా కనుపించినను యీ నవీనోద్దేశములను, సాధనములను వాడుకలోనికి తెచ్చుట పూర్వకాలపు పద్ధతికంటెను తక్కువకాలమును తీసికొనును. మానవస్వభావ శాస్త్రజ్ఞానమువలన శిశుమానసిక శాస్త్రవేత్తలచే కనిపెట్టబడిన ఈవిధులను వెంటనే ఫలితముల నిచ్చునట్లు యిప్పటినుండియైనను వాడుకలోనికి తెచ్చినయెడల వీనియొక్క మేలును మనము గ్రహింపగల్గుదుము. వీటిని ఉపయోగమునందు బెట్టుటకు అల్పకాలమును, స్వల్పశ్రమయును మాత్రమే ఆవశ్యకము.

తుదివాక్య మొకటిగలదు. బిడ్డలయొక్క నడవడి వారి జీవితమందలి మొదటి కొద్దివత్సరములలో పూర్తిగా తలిదండ్రులమీద నాధారపడియుండునే గాని బిడ్డలమీద నే యాధారపడియుండదు. అనగా బిడ్డ కంకను స్వతంత్ర వ్యక్తిత్వము ఏర్పడియుండదన్నమాట. కావున అట్టి యల్పప్రాయమున ఈపై పద్ధతుల వాడుట నిష్ప్రయోజనమగును. అందుచే ఈయొక్క విషయమును పాఠకులు గమనింతురుగాక!

# కీ॥ శే॥ దాసు భారతమ్మగారు

భారతమ్మగారి తండ్రి బొడ్డపాటి తిరుమలరావు పంతులుగారు, గుడివాడ తాలూకా బొడ్డపాటి కాపురస్థులు, నియోగులు, మెడికల్ సర్వీసు ప్యాస్ చేసి గవర్నమెంటు డాక్టరుగా పని చేయుచుండిరి. అటుతర్వాత సీమకు వెళ్లి పెద్దపరీక్షలందు కృతార్థులై వచ్చి చెన్నపట్టణమందలి పెద్దాసుపత్రియం దొక పెద్ద డాక్టరుగా నున్నారు. ముక్కు నోరు కన్నులు యివి బాగుచేయుచుందురు. పెద్దఆపరేషనులు కూడ చేయుదురు. ఈ చదువు, వీరి వైద్యము, పెద్దజీతము, సంతానము, వీరి సౌమ్యత, అన్నియు నొకదానికొకటి తోడై మిగుల శోభిల్లుచుండును.

బందరు కాపురస్థులగు చిట్టూరి పేర్రాజుగారి కుమార్తె యీ తిరుమలరావుగారి భార్య. వీరి తొలికాన్పు యీ భారతమ్మ. ఈమె యనంతరము కలిగిన వారిలో భవానీశంకరరావు అను కుఱ్ఱవాడు మగపిల్లలలో పెద్ద. కాని యాతడు యఫ్. ఏ. ప్యాసయి మద్రాసు యింజనీరింగు కాలేజిలో ప్రవేశించి గతసంవత్సరము జులై నెలలో ఆకస్మికముగ మరణించెను. శ్రీమతి భారతీదేవిని దాసు విష్ణురావు పంతులుగారి కుమారులు ప్రద్యుమ్ననారాయణరావు(అడ్వకేటు) గారి కిచ్చి వివాహము చేసిరి.

భారతమ్మ కాశీయందు రెండు నెలలుండి (S. S. L. C.) కొంతచదువు శ్రమపడిపూర్తి

యద్దనపూడి లక్ష్మీనరసింహంగారు

చేసి రెండవక్లాసుయందు తీర్ణురాలయినది.

మరుసటి వత్సరమునుండి F. A. చదువ నుద్యమించి ఆంధ్ర విశ్వవిద్యాలయమున నదియు మొదటి క్లాసునందు కడతేర, బ్రదికి యుండిన నెంతో విద్యాధికురాలై, యెంతో లోకోపకారిణియై, ఫలింప వలసియుండ యిరువదేండ్లయిన నిండని లేబ్రాయములోనే గర్భధారణము, పిదప మూడు నాలుగుసార్లు తీక్ష్ణమగు కడుపునొప్పి, అయిదవమాసమందా నొప్పిని గుఱించి వైద్యాన్వేషణ, మద్రాసులో గర్భపు లోభాగము పరీక్షింపించుట, కణుతులున్నట్లు భావించి ఆపరేషన్ అనుకొనుట, సర్వసహాయములుగల తండ్రిగారుండియు విశాఖపట్టణముజేరి 1-6-33 తేదీన ఆపరేషన్ నిమిత్తము సంసిద్ధురాలగుట క్రొత్త యింజెక్షను కడుపునకు గావించుట, దానితోడనే ప్రాణమెక్కడిదక్కడ యాగిపోవుట—యిదివిని యెవ్వరి గుండె నీరు కాకుండును! ఆమందు వేయింటికొకరి కీప్రాప్తి గలిగించునట. ఆవేఁమన నెంబరీమెది కాబోలు!

బంగారుకు మాణిక్యము పొదిపినట్లేగాక, సువాసనయు నిడినట్లొనగూర్చిన యీ దాంపత్యముపై నంతలో దైవమునకు నిరసన గలుగవలెనా? ఆ తలిదండ్రులు, ఆ భర్త, ఆ బంధులోకము—వీరి యార్తనాదముల కంతున్నదా.?

# ఊర్మిళా విరహములు

బండా కనకలింగేశ్వరరావుగారు బి.ఏ. (ఆనర్సు)

"ఇది యెవరు పాడినా విన్నగానీ ఇకముందు, విరహబాధలనందరూ"

ఈ మధ్య ఒకరిద్దరు వ్యాసకర్తలు (మాసపత్రికలలోనే) ఊర్మిళాదేవిని పాఠకలోకమునకు జ్ఞప్తిజేసిరి. అంతేగాదు,— వాల్మీకినాటినుండి పాప మాదేవికి కావ్యములలో న్యాయముగా ఈయబడవలసినంతటి ప్రాధాన్య మీయబడలేదనియు వాదించిరి. వారికి మనమొంతయు కృతజ్ఞులము.

నిజముగా, ఊర్మిళాదేవి చరిత్ర, తనకన్న ఎక్కుడుప్రకాశించు సీతచరిత్రముందు కాంతిదొఱిగినది. ఊర్మిళ కల్యాణము, సీతాకల్యాణము, శివునివిల్లుద్రుంచుట మొదలగు సందడులలో అణగిపోయినది. సీతాదేవి వనవాసపు విషాదంలో, ఊర్మిళవిరహము గమనింపబడలేదు. శ్రీరామపట్టాభిషేక సంభ్రమములలో, ఊర్మిళ పతినికూడుట మొదలగు ముచ్చట్లు పైకిరాలేదు. సీతాదేవితోపాటు, ఊర్మిళకూడ వనవాసమున కేగియుండినచో, కథ మార్పుచెందియుండును. కాని సౌమిత్రి వలదనెను. పతియాజ్ఞప్రకారము యింటనేయుండి,పదునాలుగేండ్లు కనుమూసి పవళించియున్నది. సీతాదేవికన్న ఆరిందాతనములో తక్కువయినా, పట్టుదలలో ఎక్కువది లాగు కన్పిస్తుంది.వాల్మీకిని ఒకకవి, ఆదరణతో

"గంగానదీశీతగర్భంబునందు
నిదురించుచున్నదా, నీచరిత్రంబు"

అని సంబోధించినట్లు, ఊర్మిళచరిత్ర పైడిపట్టి మంచాన్నిబట్టి నిద్రపోయిందని అనుకోవచ్చు.

అయితేనేమి, మనస్త్రీలు లలితహృదయులు. విరహము సహించలేరు. అగుట ఊర్మిళావిరహము వీరికి దుర్భరము. ఊర్మిళాదేవిని నిద్రనుండి వారిపాటలతో మేలుకొలిపినారు. స్త్రీలపాట లత్యంత మనోహరములు.మన తెలుగుకుటుంబజీవనపద్ధతులు, తెలుగుల సాంప్రదాయములు, తెలుగుతెలివల గడుసుదనము, ఈపాటలవల్ల బహిరంగ పరుపబడినట్లు ఇతరగ్రంథములవల్ల కాదు. స్వాభావికమైన, వారిమనసు మెత్తందనము, పాటలలో తేటలుదేరియుండును. అందును, అకలకంఠులే ఘణతి నలవఱచుకొని పాడుంటే, మనము మచ్చుమందు చల్లినట్టుగా ముగ్ధులవవలసినదే. గర్భిణియైన సీతమ్మను, ఉత్తరవనవాసమునకు పంపు ఘట్టములో, రామునిగూర్చి వారాడు నిష్ఠురోక్తులు, అందును మగవారినిగూర్చి యాడు సూటిపోటి మాటలు వినదగినవి. వీరికత్యంత ప్రియమైన అంశములు సతీపతులకు సంబంధించిన సరసములు, విరసములు, రుక్మిణీ సీమంతము, సత్యభామ సరసము, సీత సమర్త, ధర్మరాజు జూదము, ఊర్మిళాదేవినిద్ర, మొదలైనవి.

గృహావరణయందు మన స్త్రీలకున్న స్వాతంత్ర్య మపారము. మగవానికి మాటాడవీలులేదు. ఈగుణమే పాటలకు ప్రోత్సాహమొసగి, ఉత్పత్తికి కారణము. అత్తలకున్న అధికారము, ఆడపడుచులకున్న యా

దరణ, అసమానములు. పాతపాటల వల్లను ఈ యాచారములు మనకు వ్యక్తమగుచుండును.

"వదినల్లు వంటల్లు చేసేటివేళ
కోడళ్లు కొటిపసుపు కొట్టేటివేళ
చెల్లెళ్లు చేమంత్లు పెట్టేటివేళ"

ఇత్యాది పాటలలో చెల్లెళ్లు సుఖపడాలిసినట్లు, కోడళ్లు కష్టపడవలసినట్లు ఆచారమై పోయినది.

"చెంగుపై చెంగేసి చేడె చెంగేసి,
ఆపైని చెల్లెలిది చేమంతి చెంగు,
"పడచునిస్తావ అన్న పాడినిస్తావ"

అని దండింప గలిగినంతటి ఆదరణ యున్నది. ఊర్మిళాదేవి నిద్రలోను 'శాంత' ప్రస్తావన యిట్లేయుండును. ఒకటొకటిగా, 'ఊర్మిళాదేవినిద్ర'లోని సారస్యములను, పైని పాటల కారోపించి ప్రధాన లక్షణములను పరికింతము.

'శ్రీరామ భూపాలుడు పట్టాభిషేకుడై కొలువుండగా' సీతా దేవి కొక్కతకే యున్నది స్వాతంత్ర్యము, తనచెల్లెలిని గూర్చి ప్రస్తావించుటకు.

"సభ యంతకలయజూచి, పతిముఖముజూచి
నిలచీ,
ఒకచిన్న మనవి గద్దనిపలికెను;......"

లక్ష్మన్న నూర్మిళను బుజ్జగించుట కనుపుటయే ఈమనవి.

"కేళిగృహముజొచ్చియు, లక్ష్మన్న
కీరవాణిని జూచెను.
ప్రాణనాయకి పాన్పునా, కూర్చుండి
భాషించె విరహమ్మునా;"

వీరి సంభాషణ లత్యంతరమణీయములుగా నుండును. మొదట ఊర్మిళ కన్ను దెఱవలేదు. వ్రతంబు కతన పరపురుషుడనుకొని,

"అయ్య మీరెవ్వరయ్యా, యాగడమ్మల
కొస్తిరీ,
ఎవ్వరూలేనివేళ, మీరిపుడు ఏకాంతముల
కొస్తిరీ,
మాతండ్రి జనకరాజు విన్నా, యాజ్ఞ
చేయక మానరూ,
మాయక్క జానకివిన్నా, మీకిప్డు
ప్రాణముకు హానివచ్చూ,
మాయక్క మఱదివిన్నా, మిమ్మిపుడు
బ్రతుకనివ్వరుజగతిలో"

అని భయపెట్టియు,

"ఒకడాలి గోరిగాదా, యింద్రునికి
యొడలెల్ల హీనమాయె"

అని నయంబునను చెప్పినది. ముందు తండ్రిని పేర్కొనుట పుట్టింటి యభిమానము, "అక్క మఱది" అనుటలోగల లజ్జామాధుర్యము గమనింపదగినది.

తుట్టతుదకు,

"ఆడతోడా బుట్టరా మావంటి తల్లిలేదా మీకును" అని దీనముగా వేడుకొన్నది.

"నీ వెన్నుండింటులతోడ బుట్టవె నిజంబిట్టైన" యను బ్రాహ్మణివాక్యమును, "భవదీయమాత నేడక్కడ నిట్టి శోకమున నే క్రియనేడ్చుచు బొక్కుచున్నదో" అను ద్రౌపది వాక్యమును, ఏకార్థతగల్గియు,

మార్దవమునందు ఊర్మిళా వాక్యమునకు చాలవు. లక్ష్మణుని జవాబులు చాల శాంతముగను, సామాన్యముగనుండును. "జనకు లల్లునిగానటే, చేడిరో, సీత మఱదినిగానటే" అని తన్ను చెప్పుకొన్న తరువాత ఊర్మిళ కన్నువిప్పి జూచినది. పరస్పరాలోకనములు, ఆలింగనములు అయినవెనుక, పదునాలు గేండ్ల విరహము బయటపడేటట్లు, ఊర్మిళ కొంచెం కోపంతో, పతినిజూచి కొంచెం కన్నీళ్లతో,

"మాతండ్రి జనకరాజు మిమునమ్మి
మఱచి కళ్యాణమిచ్చె
యానాపతల్లుడనుచు తెలియకా మదిని
యుప్పొంగుచుండె
చిత్తమొకదిక్కునుంచి, సమయమున
చిన్నబుత్తురయింతులా"

అనుచు ముద్దుముద్దుగా ఊర్మిళ తాపము వెళ్లబుచ్చుకున్నది. ఇంతటినుండి 'శాంత–సీత' సరసాలు ప్రారంభం.

లక్ష్మణుడు అలంకరించుకొని,

"వెలలేనిమాణిక్యము సతిగూడి నిలువు
టద్దముజూచెను,
సిగ్గుబడి శిరసొంచుకూ ఊర్మిళా
చిరునవ్వుతో నిలచెను."

"ఎచ్చటనుండివచ్చె దరళేక్షణకన్నును సిగ్గుదొంతరల్" అను సుఖవిస్మయము మనకు కలుగును; స్త్రీ స్వభావమది "గాన లజ్జింప లజ్జించె గమలవదన" అని సమాధానం చెప్పుకొందుము.

తరువాత, కౌసల్య గారాముల పట్టి శాంత జానకితో,

"చేడెవినవే జానకీ నీ చెలియయూర్మిళా
బుద్ధులన్నీ,
భమిడిపానువున సొలసియుండె నొక
పదునాలుగేండ్లు పణతీ
కుందనపు ప్రతిమకళలు, యీకళ
లెందుండి దాగున్నదో
దృష్టితగులాకుండను, నీలాలనివాళు
లివ్వరమ్మా."

విని సీత వినయముతో నిట్లనెను.

"ఇంద్రాది చంద్రూలను వలపించు
చంద్రులూ మీతమ్ములు
దృష్టితగులాకుండను, నీలాలనివాళు
లివ్వరమ్మా"

అని సీత పలుకగాను, విని శాంత నవ్వుచూ

"అక్కచెల్లెండ్లుమీరు మిక్కిలి సౌందర్య
శాలులమ్మా
మా తమ్ములనలుగురిని వలపించేటి
జాణలకు దృష్టితగులూ"

విని సీత నవ్వుచూ,

"మాయన్న ఋష్యశృంగుని వనములో
కూడి యెడబాయకున్నా
ఏమియెఱుగని తపసినీ ఓవదినె కేళించి
విడిచినావు"

అనుచు, "వయ్యవడకుండ, నెయ్యంబున, తియ్యంబున" జరిగిన ఈ సరసాలాపములు కడుప్రశంసార్హములు.

మనకావ్యములలోని

సీ॥ "సర్వతోముఖపిపాసకు దప్పిబడియెడు
కామమోదనము నిక్కముగవలయు
యనులోమమున లెస్సవనిజేసికొంటిప్డు
భగవదారాధన ప్రాప్తినిధివి"

యనెడి 'చతురాక్షరాధికోక్తిప్రౌఢి'మలు, స్వభావంబున కెంతదూరంబులో సరసంబున కంత విరుద్ధంబులు. అది యట్లుండె.

ఊర్మిళా లక్ష్మణుల ఏకాంతసరసము లందును మనము కొంత సారస్యవిశేషతను గాంచగల్గుదుము.

"కీలుకొప్పమురవిడిచి లక్ష్మణుడునేర్పుతో
జడలల్లెను
బొడ్డుమల్లెలజాజులు జడపయిని శృం
గారముగజుట్టెను"

ఇప్పుడు, ఊర్మిళ సాధుస్వభావము మనకు గోచరించును. భర్తతో ముచ్చట లాడుచూ, సీత చెరబోయిన విధము తనకు తెలియమియు, అత్తలు చెప్పకపోవుటయు దలంచి భర్త నుద్దేశించి మృదుమధురముగా

"కౌసల్య మొదలయినా—సూమిత్రకైక
కాంతా దేవులు
గద్దెపీటలువేసుకూ నెరవునా సద్దు
చేయకయుందురూ
రామలక్ష్మణులువీారూ, యుండగా
రమనెట్లు చెరబోయెను,
సింహావిక్రములువీారూ, యుండగా
సీతెట్లు చెరబోయెను,
రాజ్యాధిపతులువీారు, యుండగా
రమనెట్లు చెరబోయెను"

యని యడిగినది. ఆ పరిస్థితిలో జవాబు ఎలా చెప్పాలో ఏది చెప్పాలో లక్ష్మనస్సుకే ఎఱుక. మన కందులోని సారస్య మెఱుక.

పాటలలోని భావములు గొప్పవికాక పోయినను మనలను మెప్పించు శక్తిగలవి. ఆ 'ఫణితి' మనసు కరిగించు మహిమగలది. ఇప్పటి శ్రీమతులు, వ్రాయగలిగినవారు, ఇట్టి పాటల ప్రయత్నించినచో మేలయ్యెడు. 'గృహలక్ష్మి'లో 'పాతఫక్కి' పాటలని కొందఱు వ్రాయుటజూడ నా యాశయము యాచరణీయమును నగు. ఫక్కి పాతదైనను, ఈ భాషాయుగమునందు, మనసు ఆ ఫక్కిమీాద పాఱుట సులభముగాదు. క్రొత్త భాషాయుగమునందు ప్రాతఫక్కి సరిపడదు. ఊర్మిళాదేవియొక్క ఓర్పు, సోదరీప్రేమ వివరించుటకును, స్త్రీల పాటల లోని 'హాయి'ని చూపించుటకును, చేతనైనంతవరకు ప్రయత్నించి, అందలి యొప్పులను, తప్పులను, సహృదయులకే యప్పగించి, నేను తప్పుకొనుచున్నాను.......

—:o:—

## మా పల్లెపిల్ల

(పాలు పితుకుట)

గవను వేంకటకృష్ణయ్య చౌదరిగారు

కనుదోయి ముకుళించి కర్ణాల రిక్కించి నెమరువెట్టుచు గోవునిలచియుండ,
కవటాకు నిందించు కరముల నందందు ఆకొన్న వత్సంబునాకుచుండ,
నెలరాజు నునుఁగాంతి నిరసించుమోముతో చిన్నారిపాపాయి చెంతనిలువ,
మధుపాల పంక్తులన్ మరపించు ముంగురుల్ మోముపై వింతగా మూఁగియుండ,
భాగ్యదేవత రూపంబు వడసినట్లు, పిక్కలనడుమ పాత్రంబు నొక్కిపట్టి,
తల్లి చీరుచున్నదనెడు తత్తరాన, వడిగ పాల్పిదుచుండు మాపల్లెపిల్ల.

# రాజస్థాన కుసుమము

పి. వి. రామచంద్రమూర్తిగారు బి. ఏ.

ఉదయపుర రాణాయగు భీమసింహునకుఁ గృష్ణకుమారియను పుత్రిక కలదు. ఆమె సుమారు పదునాఱు వత్సరముల వయస్సు కలది. ఆమె రాజపుత్రయువతులనెల్లఁ జక్కఁదనమున మించి, రాజస్థాన కుసుమమని పన్నెకెక్కినది.

జైపూరు సంస్థానాధీశుఁడగు జగత్సింహుఁడు కృష్ణకుమారిని దనకిచ్చి పరిణయము గావింప వలెనని యుదయపుర రాణాను గోరెను. రాణాయును నందులకు సమ్మతించెను. జగత్సింహుఁడు తన పుణ్యము ఫలించినదని సంతసించుచు రాజపుత్రి కుచితమగు కానుకల నొసఁగిరమ్మని మిత్రునొకని సపరివారముతో నుదయపురమునకుఁ బంపెను.

మార్వారును పాలించురాజా మానసింహుఁడు రాజస్థాన కుసుమమును వరించి, ఆమె నెటులైనఁ బరిణయమాడఁ జూచుచుండెను. రాజా మానసింహుఁ డతిపరాక్రమవంతుఁడు. అతని కాఫ్గనులును మహారాష్ట్రులును నవసరమగునెడ సాయమగుటకు సిద్ధులై యుండిరి. అతఁడు కృష్ణకుమారినిచ్చి జగత్సింహునకుఁ బరిణయము గావింపఁ బ్రయత్నములు జరుగుచున్నవని గ్రహించి, తనసైన్యము నుదయపురికిఁ బంపెను. మార్వారు వీరులముందర నిలువలేక యుదయపురసైనికులు పరుగెత్తిపాఱిరి. జయపురమునుండి యమూల్యాభరణములఁ దెచ్చిన రాయబారి పిక్కబలము చూపవలసి వచ్చెను.

అదిగాంచి జగత్సింహుఁడు సైన్యసమేతుఁడై పోయి మానసింహుని రాజధానియగు జోధపురమును ముట్టడించెను. కానియాతఁడు సంపూర్ణపరాజయము నొంది పాఱిపోయెను.

మానసింహుఁడు పఠాను నాయకుఁడగు అమీరాఖానును రాయబారిగ నుదయపురికిఁ బంపెను.

భీమసింహుని యవస్థ ముందుకుఁ బోయిన గోయి వెనుకకు మరలిన నూయివలె నుండెను.

అంతఃపురవాసిని యగు కృష్ణకుమారి యెప్పటి యుదంత మప్పుడు తెలిసికొనుచుండెను. జోధపురమునుండి యమీరాఖానుఁ డేగుదెంచెనని యామె యెఱుఁగును. వాఁ డాతఁడు రాణాతోఁ బ్రసంగించును. మానసింహుని తన యల్లునిగఁ జేసికొన రాణా యొప్పుకొనకున్నచోఁ గ్రూరుఁడును పరాక్రమవంతుఁడును నగు జోధపుర నాయకుని సైన్య ముదయపురమును ముట్టడించి సర్వము నాశముఁ జేయును.

కృష్ణకుమారిమానస మాందోళనకు లోనైనది. తన్ను జైపురాధీశునకిచ్చి వివాహము సేతునని వాగ్దత్తముఁ జేసిన రాణా మానసింహునితో నెట్లొడంబడికకు రాఁగలఁడు? తన జనకునకు సంభవమైన దుర్భరావస్థ యామెకు గోచరమైనది. మానసింహుఁడు బలీయుఁడు. అతనికి మహారాష్ట్ర నాయకుఁడగు సింధియా తోడగును. పఠాను నాయకుఁడగు నమీరాఖానుఁ డాతని కుడిభుజమై మెలఁగును. తమ రాజ్యమందు గలవారిలోఁ బెక్కురు శత్రునితోఁగూడి రాణాపై గత్తిగట్టఁ జూచుచున్నారు. కనుక రాణా మానసింహుని కోర్కె నెఱవేర్చుట శ్రేయస్కరము. కాని హతాశుడైన జగత్సింహుఁడు నాటినుండియు యుదయపుర రాణాకుఁ బ్రక్కబల్లెమై మెలంగును.

కృష్ణకుమారి నిట్టూర్పు పుచ్చి, "జనకా, నా సౌందర్యమును జూచి మురిసిపోయితివి. కాని నా సౌందర్యమే నిన్ను విపజ్జలధి ముంచనున్నది." అని తలపోయఁ జొచ్చినది. కలత జెందిన హృదయములో నామె యిటునటులు పచారు సేయఁజొచ్చినది. ఆమె హృదయ మతిరయమునఁ గొట్టుకొను చున్నది. అది ప్రయ్యలు గానున్నదా? 'అట్లుజరుగుట సుఖప్రదమే' అని యామె తలంచెను. రాజ సభామందిర మామె తలఁపునకు వచ్చెను. ఆపెకర్మ మెట్లున్నదో వాఁడు తేలును. రజిత స్తంభములపై నాధారపడియున్న చాందిని మాణిక్యమయమై యొప్పుచుండఁ గ్రింద

గల గద్దెపై రాణా కూర్చుండి యుండును. ఆ మహనీయుని కిరుపార్శ్వముల సామంతులలో ముఖ్యులాసనముల నలంకరింతురు, తక్కుంగల నాయకులెల్ల రుచితాసనముల నధిష్ఠింతురు. క్రూరహృదయుడగు నాపఠాను రాణా కెదురుగా నిలువఁబడి, "ఎట్లునిశ్చయించిరి?" యని అడుగును. పాపమామె నిరపరాధిని. ఆమె కెవ్వరన్నను బగసాధించు బుద్ధిలేదు. కాని యామె నిమిత్తమై జయపురమునకును జోధపురమునకును పోరు ఘటిల్లినది. ఉదయపురమునకు మహోపద్రవము రానున్నది. ఇట్టితలపు లానుకుమారి మానసవీధిని పరంపరలుగ రాఁజొచ్చినవి. ఆమెశరీరము భయముచేఁ గంపింపసాగెను.

ఆమెకు క్షణములు దినములుగ మారుచున్నవి. ఆమె మానసమును జిక్కఁబట్ట బ్రయత్నించునుగాని ఫలముగుపడదు. ఆమె తలఁపు లన్నియు సభామందిరమునకే పోఁజొచ్చినవి.

ఆమె యత్యాతురతతో నేమియుఁ దోఁచక పచారుచేయుచున్న యాప్రాసాదమున మహారాజ్ఞి దక్క నొరులెవ్వరును లేరు. ఆదేవేరి కుమారిం గాంచి 'అమ్మాయి, విచారించిన నేమిఫలము? కానున్నది తప్పింప నెవరితరము?' అని ధైర్యవచనములఁ బలుకసాగెను. కాని యామెయే శోకము నాపుకొనజాలక కంటఁ దడిపెట్ట జొచ్చెను.

కృష్ణకుమారి జననియొద్దకుఁబోయి, 'అమ్మా! నాకుఁ బరిణయమే లేకున్న సౌఖ్యమునుమా! జననమొంది నేటివరకును పెరిగిన యీసౌధములందే యాజన్మాంతము కాలముగడపుదును. అయ్యో! నా చక్కదనము చూపఱకెల్లఁ గామోదముగొల్పుచు నాకును సౌఖ్యదాయకమైయుండునని తలఁచితినే కాని, జనకుని, నుదయపురసంస్థానమును నాపదలందు ద్రోయుననుకొనలేదు.' అని పలుకసాగెను. 'తండ్రిగారు నన్ను మానసింహున కొసఁగినచో రణము తప్పును గదా! రాణాయట్లుజేసి హృదయమునకేల శాంతిని దెచ్చుకొనరాదు?' అని తల్లి నామె యడుగఁ జొచ్చెను.

కృష్ణకుమారి శిశోదయవంశమున జనించినది. సత్కులసంజాతులగు రాకొమరులుగాని యామె పాణిగ్రహణమున కర్హులు గాఁజాలరు. జగత్సింహుఁడున్నతవంశమునఁ బుట్టినాడు. కనుకనే యాతఁడు తగినవరుఁడని రాణా వాగ్దత్తము చేసినాడు. హీనకులుఁడును క్రూరుఁడును నగు మానసింహునకుఁ గృష్ణకుమారి నెన్నటికి నియ్యజాలఁడు. ఈవిషయము లన్నియు నాబాలిక చక్కగా నెఱుఁగును. జనకుఁ డావిపజ్జలనిధినుండి దాటుట కుపాయము నాలోచించుచున్న యామె ఆందోళనలో నాప్రశ్న వేసినదే కాని పరిస్థితు లామె యెఱుఁగక కాదు.

'కుమారీ! నిన్ను మాత్ర మాక్షుద్రదేవతకు రాణా బలినియ్యఁజాలరు. ఈకష్టమునుండి తప్పించుకొనుట కేదియో యుపాయమును వారన్వేషించుచు నేయుందురు.' అని రాణి కృష్ణకుమారితోఁ బలుకసాగెను. గాని యాబాలికకు మాత్ర మట్టి ధైర్యము గన్పడదాయెను.

'ప్రొద్దుపోవుచున్నది. రాజమందిరమునుండి సమాచారమేమియు రాలేదు. దూరమున నేదియో కలకలము వినవచ్చెను. కృష్ణకుమారి మేడమీది ముందు చావటిలోనికిబోయి తెరల నొత్తిగిలచేసి యటునిటు కలఁయజూచెను. రాజసభామందిరద్వారమున జనులు గుంపులుగా నిలువఁబడిరి. ముతుక వెల్లదుకల కురుచ గడ్డముగల యమీరాఖానుఁడు గుఱ్ఱము నెక్కుచుండెను. క్రౌర్యమును దెల్పు నాముఖమునఁ జిఱునగవంకురించ నాపఠానుఁడు వెనకకుదిరిగి ద్వారమున నిలువబడి యున్న ప్రధానునొద్ద సెలవుగైకొనెను. కృష్ణకుమారి యాతని గాంచినది. ఆమె మేనుకంపించినది. వాఁడామెను జూచి యుండఁడు. కాని వాఁడామె వక్షమున నొకబాకు గ్రుచ్చినట్లామెకుఁ దోఁచినది. ఆమె యొక్కపరుగున జననియొద్ద కేతెంచినది.

ఆమె లోనికి వచ్చునప్పటికి గుమ్మమునొద్దగల పరిచారికలు సద్దుసేయసాగిరి. రాణీ కారణమడుగ రాణా యంతఃపురమున కేతెంచుచున్నాడని తెలియవచ్చెను.

రాణా భీమసింహుఁడు ఆగదిని ప్రవేశించెను. ఆతని ముఖమున శోకము మూర్తీభవించి నట్లుండెను. ఆతఁ డీనరలోవలె వచ్చుటతోడనే ప్రేమవాక్యములఁ గృష్ణకుమారీని బలుకరింపలేకపోయెను.

కృష్ణకుమారి ముందున కేతెంచి జనకునకు నమస్కరించెను. రాణియు వచ్చి ఆమెప్రక్కనే నిలువఁబడెను. వారెవ్వరును మాటలాడ నేరరైరి. భీమసింహుఁ డొక నిట్టూర్పుపుచ్చి, ప్రక్కనున్న యాసనముపైఁ జతికిలఁబడెను. ఆ నిశ్శబ్ద మతిఘోర వృత్తాంతముకన్న భయంకరమై యొప్పెను.

నిర్భాగ్యుఁడగు రాణా తుదకు శిరమునెత్తి కంపమానగాత్రుఁడై కుమారింజూచి 'అమ్మా, ఇటురమ్మ' అని పిలిచెను.

కృష్ణకుమారి జనకుని సమీపించి మోకాళ్లపై నిలువఁబడినది. అమీర్ఖానుని పోఁక నామె గాంచి నప్పుడే యామె యొక వింతభయమునకు లోనైనది. రాణా ముఖము నామె గాంచినప్పుడు ఆవేదన కామె రూపము నియ్యగల్గినది.

'తండ్రీ! ఏల పలుకసందేహింతురు? రాజా మానసింహునకు నన్నిచ్చి పరిణయముసేయ నిశ్చయించితి ననియే గదా మీరు దెలుపవచ్చినది!' అని యామె నెమ్మదిగా నడిగెను.

రాణా 'ఔన'ని తెలుప శిరమునూపెను. తన జనకుఁ డా యధమునకుఁ దన్ను ముడిపెట్టుట కొడంబడినాఁడు. ఇంతకన్న నింక దారుణ మేమిగలదు? కాని రాణా కన్యమార్గ మేదియు లేదుగదా? మానసింహుఁడు తన కామె యర్పింపఁబడనిచో నుదయపురము నొక్క నిమిషమున నేలపాల్సేయును. మానసింహుని యంతఃపురమున నామె యెట్లు నివసింపఁగలదు? శిశోదయవంశధర్మము నశింపవలసినదేనా? జయపురరాజునకు రాణా యొనర్చిన వాగ్దానము మాట యేమి?........ఇన్నివిధములఁ దలపోసి యేమిలాభము? రాణా పరిస్థితుల నాలోచించియే తన యంగీకారము నమీర్ఖానున కొసగినాఁడు. రాణా కన్యమార్గములేకయే ఇట్లొనర్చినాఁడు. ఏమి? రాణా కన్యమార్గములేదా? కృష్ణకుమారి మానసమం దొక్క తలపు విద్యుల్లతవోలె మెఱసినది.

'తండ్రీ! నన్నుగూర్చి గదా యిట్టి సంక్షోభము కల్గినది? నే మరణించినచో శాంతి సమకూరును' అని యామె పలికినది.

ఆమె జనని ఆ పలుకులందలి యర్థమును గ్రహింపనిదానివలె వెఱ్ఱిచూపుల నామెపై బ్రసరింపఁ జేసెను.

'కనుక నా ప్రాణము లర్పింతును.'

రాజపత్ని కవ్వుమని యఱచుచు నేల కొఱగుచుండెను. కృష్ణకుమారి జనని పడిపోకుండఁ బట్టుకొనుచు 'అమ్మా! ఎందుకీ యధైర్యము? ఉదయపురమునకు శాంతి సమకూరుటయే నా యాశయము. నే జీవించియుండి సుఖింపలేనుగదా? అని యామెకు నచ్చఁజెప్పఁ బ్రయత్నించెను.

జనని కా పలుకులు వినబడలేదు. 'అమ్మాయీ! మన యుదయపురము యమసదనమువంటిది. మన కిచ్చట నేమిపని? దీనివిడిచి కొండలసందుఁ బోయి సుఖముగాఁ జరింతము. రమ్మ' అని యా భీరువు కేకలు వేయుచుఁ గుమారికొంగునుబట్టి యీడ్చుకొని పోసాగెను.

కుమారి జననిని భుజముపైన నానుకొనఁజేసి మెల్లగా నామెను ప్రక్కగదిలోనికి దీసికొనిపోయి అచటఁగల పరిచారికలతో నామెకుఁ దగిన విశ్రాంతిని గలుగఁజేయవలెనని చెప్పి, ఆమె నచటవిడిచి, రాణాయొద్దకు శరవేగమునఁ దిరిగివచ్చెను.

కుమారి రాణాకెదురుగా నిలువఁబడి, ఆపె వక్షమున దాచియుంచిన తళుకు తళుకుమను బాకునుదీసి 'రాచబిడ్డ రాజపుత్త్రిల హస్తములనే మరణించు టుత్తమ'మని పలుకుచు, దానిని రాణాకు ముందుంచెను.

రాణా యదరిపడిలేచి, ఆ యాయుధమును గైకొని 'నిన్ను జంపుకొనుటకన్న నే మడియుట

మేలు' అని పలుకుచు దానిఁ దన ఱొమ్మునకు గుఱిచేయుచుండెను. కుమారి రాణా హస్తమును బట్టుకొని, 'తండ్రీ, మీరు మడియుటవలనఁ గలుగు మేలు శూన్యము. మీరు మరణించినచో రాజపుత్ర వనితల మానధనమును గాపాడువారెవరు? రాణా గతించినచో నుదయపుర ప్రజల గతియేమి?' యని బలుకుచు నాతని యుద్యమమును మాన్పెను.

'కుమారీ! నీవు వచించినది సత్యము. రాజపుత్రుఁడ నయ్యు, భీతుఁడనై ఆత్మహత్యఁ జేసికొని మానవతుల నెల్ల శత్రువులవశముజేయ నుంకించుచున్నాను. నీ ధీరత్వముఁ జూచిన నాకు లజ్జ వొడముచున్నది. కాని, తల్లీ! నీవు గతించినచో నేను జీవచ్ఛవమనై యుండవలెను సుమా!' అని యాతఁడు కంటఁ దడి పెట్టుకొనుచుఁ బలుకసాగెను.

'మహారాణావా రిట్లధైర్యపడు టుచితముగాదు. నేను శిశోదయవంశమున జనించితిని. నా వంశమతి పవిత్రమైనది. దాని కాపంతరమైన వన్నె దఱుఁగనున్నచో శిశోదయులగు స్త్రీ పురుషు లెల్లరును దమ ప్రాణముల ధారపోసి గౌరవమును గాపాడుకొందురు. ఇది మన కులధర్మము. ఈ కులమున జనించిన వనితలెందరో ఈ ధర్మమును బాటించిరి. కాన నే నొనరించు కృత్య మొక క్రొత్త పోకడ కాదు. రండు. ఈ బాకునుగైకొని కులధర్మమునకై నా ప్రాణముల ధారపోయుదు' అని ఆమె రాణాను హెచ్చరించెను. అతఁ డట్లే చతికిలబడెను. 'నేనే స్వయముగ నీపనిని నెఱవేర్చుకొనఁగలను. కాని పురుషులే యీకార్యము నిర్వహించి, యా గౌరవమును దక్కించుకొను టుచిత'మని యామె తిరిగి వచించెను.

రాణా హృదయమున వింతలగు తలపులు పుట్టసాగినవి. నిరపరాధినియై ప్రాణములగోల్పోవ నిలఁబడియున్న యా కుమారి యాతనికి కేవల మొక బాలికవలెనే కనుపించలేదు. శిశోదయధర్మ మెల్ల మూర్తీభవించి తన కుమారియై నిలచినదని యాతఁడు భావింపసాగెను. ఆమె ప్రాణము లర్పింపవలసిన తరుణ మేతెంచినది. మహాత్యాగము సేయ సంసిద్ధురాలైనది.

'కుమారీ! శిశోదయవంశసంజాతవగు నారీలోకమున కెల్ల శిరోరత్నమవీవు. నే నన్నివిధముల నదృష్టహీనుఁడ. కాని నిన్ను గనుటచే నా జన్మము ధన్యమైనది. కులమున కపయశము రాకుండఁజేయఁ బ్రాణములఁ ద్యజించుచుంటివి. నా కట్టిభాగ్య మబ్బలేదు గదా! తల్లీ! నీ యాజ్ఞను శిరసావహించి సజీవుఁడనై యుండి ధైర్యముఁబూని రజపుత్రవనితల మానము గాపాడ రణరంగమునఁ బోరెద. తల్లీ! శిశోదయ రాజపుత్రికలకు మార్గదర్శినివై కీర్తికాయమున నిలయుము. కుమారీ! సంసిద్ధురాలవై యుండుము. రేపటి దినమున శిశోదయవంశమునకు నీ ప్రాణము లర్పించుము. నీ యాత్మకు శాంతి సమకూర, నిద్రింపుము' అని రాణా పలుకుచు లేచెను. కృష్ణకుమారి యాతని యాజ్ఞ నాదలఁదాల్చినది. రాణాయును నంతఃపురమును వీడిపోయెను.

ఆరాత్రి కృష్ణకుమారి నిర్విచారమనస్కురాలై నిదురించినది. మరుసటిదినమున నరుణోదయకాలమున నే మేల్కాంచి, నాఁడు తన కల్యాణదినమని భావించుచు మరణమునకై వలయు ప్రయత్నములఁ జేయఁ దొడఁగెను. ఆమె శ్వేతాంబరధారిణియై, ఫాలమున దిలకమును బాగుగా దిద్దినది. వివిధ పుష్పజాతులచే నామె కేశభారము నలంకరించుకొన్నది. మంచి గంధమును, తావుల వెదజల్లు నత్తరులను మేనబూసికొన్నది. శాంతహృదయురాలై యాబాలిక యొకచో గూర్చుండి ధ్యానమునకుఁ గడంగినది. ఆసన్నమగు మృత్యువును నిశ్చింత నెదురుచూచుచున్న రాజపుత్రికను గాంచి, అంతఃపురకాంత లెల్ల రచ్చెరువందుచు తాము శోకించుట యుక్తముగాలేదని తలపసాగిరి.

రాణా కన్నకూతుప్రాణములఁ జేతులారఁ దీయఁజాలక తనకు సన్నిహితబాంధవుఁడగు రాజా దౌలత్ సింహుని నంతఃపురమునకుఁ బంపెను. అతని యాగ

మనమును విని కృష్ణకుమారి నవ్వుచుఁ దన్ను జుట్టి యున్న వనితలనుండి సెలవుగైకొని, తన్ను విడిచి పొండని కనుసన్నఁ దెలియఁజేసెను.

రాజాజ్ఞననుసరించి, తన యనుచరులదీయనచ్చిన దౌలత్ సింహుని కామె చిఱునగవుతో స్వాగత మొసఁగెను. అతఁ డా యబలకౌతుకమును గాంచి నిర్విణ్ణుఁడైపోయెను. ఆముగ్ధ నాతఁడు చంపఁ జాలఁడు. ఆతని హృదయము కరఁగిపోయెను. 'రాజాజ్ఞ నుల్లంఘించుటచేఁ గలిగెడు శిక్ష ననుభవింతును గాని యీ ఘోరమును నే చేయఁజాల'నని పలుకుచు నాతఁడు తన ఖడ్గమును తన్ననుసరించి వచ్చిన మహారాజా జవాన్ దాసుని హస్తమునకుంచి పోయెను. సౌందర్యవతియగు నాబాల వినమ్రయై నిలువఁబడినది. జవాన్ దాసు, కృష్ణకుమారి సామాన్యుని ఖడ్గమున కెఱ గాఁజాలదని యెఱుంగుటచేఁ దన కా కృత్యము తప్పదని తలంచుచు నామెను సమీపించెను. కాని ఆతని హస్తము వణఁకసాగెను. మానసము కలఁతఁ జెందెను. ఆతని చేతిలోనుండి ఖడ్గముజారి క్రిందఁబడినది.

'ఈ కోమలాంగి కిట్టి ఘోరమరణమును సమకూర్చుట కే కఠినుఁడైన ధైర్యమూనఁడు' అని పలుకుచు నాతఁడును అంతిపురమును వదలిపోయెను.

కుమారి, కరుణాళువులైన యా రసపుత్రు లిద్దరును మరలిపోవుట గాంచి, విషపానమువలన ప్రాణములఁ గోల్పోవ నిశ్చయించుకొనెను.

ఆమెను చిన్ననాటినుండియుఁ బెంచి ప్రేమించుచున్న యువతు లెందరో యామెవద్ద కేతెంచిరి. ఆమె ప్రాణములకు మారు తమ ప్రాణము లర్పించ వలెనుపడిన బాగుగానుండును గదా యని విలపించసాగిరి. మహాత్యాగము గావింపనున్న కృష్ణకుమారి పరమసాధ్వి. ఆమె దేవత్వమును బొందినది. ఆమెను గాంచినవారి కెల్లరకును భక్తి గౌరవములు కల్గినవి. వారందరామెకు నమస్కరించిరి. తమ బిడ్డల నామెకుఁ బ్రణమిల్లఁజేసి, ఆమె యాశీర్వాదమును బడసి, కన్నీరుగార్చుచు వెడలిపోయిరి.

ఆమె యొంటరిగా నాగదియందుఁ గూర్చుండెను. రాజసేవకుఁ డొకఁడు రజతపాత్రయందు విషముగలిసిన పానీయమును బోసి తెచ్చెను. వాని వెనువెంటనే మహారాణి విలపించుచు నొక్కపరుగున వచ్చి కృష్ణకుమారి హస్తమునుండి యాపాత్రను లాగుకొనఁ బ్రయత్నించెను. కుమారి, జననికందకుండ నాపాత్ర నెత్తిపట్టుకొని 'తల్లీ! విచారింపకుము. సెలవు దయసేయుము. నన్ను మఱచిపొమ్ము' అని పలుకుచు ఆ విషమును సంపూర్ణముగ గ్రోలెను. రాజపత్ని మూర్ఛిల్లెను. రాజస్థానకుసుమము మెల్లగాఁ గన్నుమూసినది. ఆ నిద్రనుండి యామె మేల్కాంచలేదు.

కృష్ణకుమారి పొందిన దుర్మరణమునుగూర్చి విలపించని రాజపుత్త్రుఁడు లేఁడు. రసపుత్రులెల్లరును తమ పౌరుషముల మాటుపఱచి, ఇంటఁగూర్చుండి యొక్క సుకుమారిని బలియిచ్చితిమని తలిపికొన్నపుడు వారికిఁ బొడమిన లజ్జ యింతంతనరానిది. వారెల్లరకును నూతనముగ శౌర్య ముద్భవించినది. ఆమె మహాత్యాగమును బురస్కరించుకొని వారెల్ల రైకమత్యమును జూపుచు శత్రులతోఁ బోరాడి మేవారునకు యశము దేఁ బ్రయత్నింతురు.



# శ్రీజీవయాత్రా గ్రంథకర్త్రి

## శ్రీమతి విద్వాన్ కవితిలక కంచనపల్లి కనకాంబగారి ప్రశంస

[ డి. యస్. శర్మగారు ]

మ॥ పరిషత్పూజ్యతగాంచినట్టికవితా ప్రాగల్భ్యమున్ బూని సు
స్థిరకళ్యాణము జీవయాత్రకృతిని న్ జీవాళికిన్ గూర్చె స
ద్గురుసంసేవ స్వధర్మదీక్షయును సాధుల్ మెచ్చగానల్పె ని
ద్ధరలో శ్రీ కనకాంబశుద్ధియగుకాంతన్ గాంతుమే యిక్కలిన్॥

ఉ॥ మోదముతోడఁ బూర్వకవి, ముఖ్యులతోడను బోల్చినారుగా
నీదుకవిత్వమోయమ మనీషులు* వేంకటకృష్ణముఖ్యుల
త్యాదరవృత్తి సాధువులహర్నిశముల్ బఠియించి బ్రహ్మమా
స్వాదనచేయుచుంద్రు బహుభంగులనీదగు జీవయాత్రలోన్॥

గీ॥ గీతగోవిందమోయిది గీతయొక్కొ లలితపదబంధమునఁ దత్త్వలాభమునను
జీవయాత్రను బోల్పంగలేవుకృతులు వేదసారంబుచిలికిన వెన్నముద్ద॥

క॥ మద్దెలదరువులతోడను ముద్దుగఁబాడంగవచ్చు ముదమొదవగనీ
పద్దెములను గనకాంబా, విద్దెలగనినంతనే ప్రవీణతగలదే॥

క॥ కవులెల్లరునిన్మెచ్చిరి కవితిలకమవంచు నీదుజ్ఞానంబో సా
ధువులెల్లవినుతిచేసిరి భవతారక మంబ నీ ప్రబంధము కలిలోన్

సీ॥ అతులవైరాగ్యబోధోపరతులఁ దేలి మధురకవితా విలాససంపదలఁ బొదలి
శారదోపాస్తిలబ్ధ విస్తారగరిమఁ దేజరిల్లెడుకనకాంబదివ్యమహిమ॥

క॥ విద్వాన్ బిరుదముగాంచెను
సద్వాదులగోష్ఠిఁ దత్త్వ సారముఁ గ్రోలెన్
హృద్వీథిన్ హరి నిల్పుచు
సద్వైతవిభూతి కనకమాంబిక కనియెన్॥

క॥ చక్కదనంబును జదువును
జొక్కపుశీలంబు వృద్ధశుశ్రూషయు నల్
దిక్కులఁ గ్రమ్మిన ఖ్యాతియు
నిక్కము కనకాంబకడనె నిలిచెం గలిలోన్.



క॥ అమృతానందునిబోధల
నమృతముగాఁ జేసెఁ గనకమాంబ తనకృతిన్
సుమనస్సులకిడ నిర్వృతి
సమరసతుంగూర్పసకల సజ్జనతతికిన్.



# మల్లెదండ.

శ్రీమతి దర్భా సీతాదేవిగారు

[గంగానదీతీరం. గంగానది హోరు శ్రావ్యంగా వినిపిస్తున్నది. ఆ ప్రదేశమంత కీకారణ్యం. మిట్ట మధ్యాహ్నం. నీళ్ళుతాగడానికి లేళ్ళు దుప్పులు, పందులు గంగఒడ్డుకి చేరుకుంటున్నాయి. ఎటుచూసినా దారి కనుపించదు. పెద్దపెద్దచెట్లు, మోళ్లు, రాళ్ళు, పాములపుట్టలూ, చూస్తే హడలు పుడుతోంది. ఒకరథం, అంతస్పష్టంకాని నేమినిస్వనంతో, మెల్లిగా నడుస్తున్నది.]

లక్ష్మణుడు

అమ్మా! ఈఅడవిలో ఇంక రథం వెళ్లదు. రథచక్రాలకి పెద్దపెద్ద మోదుగతీగలు, అడ్డతీగలూ, తగులుకొని, చుట్టుకొని వస్తున్నాయి. రథం కదలలేక ఆగిపోయింది. కనక కొంచెం దిగాలి.

సీత

నాయనా! ఈ గతుకులలోనూ, రాళ్ల మీద రథాన్ని ఈడ్చేసిచంపేశాయి గుఱ్ఱాలు. ఈ కుదుపులో కూర్చోడమే కష్టంగాఉంది. ఇంక ఎట్లాదిగను?

లక్ష్మణుడు

ఓయి! సుమంత్రా! గుఱ్ఱాల్ని కదల్నీయకు, అమ్మగారు దిగుతున్నారు.

సుమంత్రుడు

చిత్తం.

సీత

(మెల్లిగాదిగింది.)

లక్ష్మణుడు

(తనలో) ప్రభువని తలదాల్చనా? అన్యాయమని అధఃకరించినా? నా తలలో విషమసమస్య ప్రవేశించింది. అబ్బా! ఈ ఆలోచనలతో బరువై ఈ తలపగిలిపోతే ఈ ఘోర కృత్యం నేను చెయ్య నక్కరలేదు కదా!

పౌరులు—రాక్షసపౌరులు ఒళ్లు తెలియక పేలినకూతలకి ఈ సాధ్విని పైగా గర్భభారాలసను కారడవులలో వదలి రమ్మన్నాడు నన్ను. (ఆలోచించి) అవును పాపం అతనేంచేస్తాడు. పండువెన్నెలవంటి కులానికి మసితగిలింది అంటే ఎట్లాభరించడం? ఏమైనా ఈ మహాకౄరకృత్యం నా మీద పడింది. అమాయకంగా నమ్మిచేరికఅయిన లేడిపిల్లని కటికదగ్గరకి చేర్చినట్టు ఈమెనీ ఉగ్రాటవికి చేరుస్తున్నా.

సీత

నాయనా! ఈగర్భ భారంవల్ల అడుగు తీసి అడుగు వెయ్యలేకుండా ఉన్నాను. గంగానది ఇంకా ఎంతదూరం ఉంటుంది?

లక్ష్మణుడు

ఇదిగో దగ్గిరికివచ్చాం. తామరతూండ్లని పొడుచుకొని తింటూన్నకలహంసల తియ్యనిపాటలు వినిపించడంలేదూ? కెరటాల మీద ఉయ్యాలలూగుతూ తామరపువ్వుల ఆసనముతాగి మత్తెక్కి జోగుతూఒస్తున్న పిల్లగాలులు గంగానదివే.

సీత

ఓహో ఎంత సుఖంగా ఉందిగాలి. తల్లి చల్లనిచేతితో బిడ్డపులకించినట్టు గంగాభవాని గాలితో నాదేహం గగుర్పాడిచింది. (హఠాత్తుగా లక్ష్మణున్నిచూసి) ఏంనాయనా! ఏం నాయనా?

అట్లా జలజలపొంగుతున్న కన్నీళ్లతో ఒణికి పోతున్నావు. అయోధ్యలో అందరికీ క్షేమమేనా—ముఖ్యంగా మీ అన్నగారికి?

లక్ష్మణుడు

(కంపిస్తూ) అందరూ బాగానేఉన్నారు. పాపాత్ముడు లక్ష్మణుడు చచ్చిపోయాడు.

సీత

(నిర్ఘాంతపోయి) ఛీ అట్లా అనకు సంగతి ఏదో చెప్పు.

లక్ష్మణుడు

(సీతమ్మ కాళ్ళమీదపడి మూర్ఛపోయాడు.)

సీత

(కన్నీళ్ళతో లేవనెత్తి) ఏదో తెలియదు-గందరగోళంగా ఉన్నది. ఏదో అనర్థం సంభవించింది నిశ్చయం. (పైకి)లక్ష్మణా! చెప్పు, నీకేం భయంలేదు.

లక్ష్మణుడు

(ఏడుస్తూ) అమ్మా! మీరు మళ్లీ వనవాసం చెయ్యాలి.

సీత

(ఆత్రంగా) ఏం, ఏం, ఎందుకూ?

లక్ష్మణుడు

కారణమేమిటి? వారి—ఆజ్ఞ.

సీత

అత్తగారిదా?

లక్ష్మణుడు

కాదు. అన్నగారిది.

సీత

హా పరమేశ్వరా! సీతకోసం అడవి అడవి కోసం సీత పుట్టయికాబోలు. ఛీ ఏం బతుకు (సొమ్మసిలి పోతుంది)

లక్ష్మణుడు

(శూన్యంగా దిక్కులవేపుచూస్తూ). ఈ ప్రపంచమంతా జీర్ణారణ్యం. ఈ పిట్టపిడుగు వంటి మాటతో నిజంగా ఈమె ప్రాణం పోయింది.

సీత

(చల్లని గంగానదిగాలితో కొంచెం కదులుతూ నాయనా! వెళ్ళిపోయావా?

లక్ష్మణుడు

లేదమ్మా! ఇదిగో కిరాతకుడు.

సీత

అడవిలో ఒదిలిపెట్టమన్నారా? అంతేనా?

లక్ష్మణుడు

కొన్ని మాటలు చెప్పమన్నారు.

సీత

చెప్పునాయనా!

లక్ష్మణుడు

ఇవి ఆయనమాటలు.

సీతా! ఏదుర్ముహూర్తంలో ఈ పాపాత్ముని పాణిగ్రహణం చేసికొన్నావో నీజీవితానికి సుఖంలేకుండా పోయింది. సుఖంలోను దుఃఖంలోను తోడునీడవై, నన్ను వదలలేక పోయావు. నేను నిన్ను క్షణంలో అడవిలోకి విసిరికొడుతున్నాను. ఇదీ నా ప్రేమవిశ్వాసం. నీవల్ల ఏచిన్నదోషం జరిగినదన్నా, ప్రళయం కమ్ముకుపోతుంది, రాక్షసలోకం నోటికివెరచి ఇట్లాచేసేను.

సీత

ఇంకేముంది ఏదోనింద నాతలపై పడింది,

లక్ష్మణుడు

అమ్మా! అష్టదిక్పాలకులు, సప్తమహర్షులు నేను, అన్నగారూ, చూస్తుండగానే కదా నీ పవిత్రతస్పష్టమైంది—కాని—

సీత

చెప్పు, కాని—

లక్ష్మణుడు

లోకం నిరంకుశం.

సీత

అగ్నిశుద్ధి అనగానే అదిగాక ఇంకేముంది. ఛీ అరవై వేల జన్మలకై నా ఆడతనం ఒద్దు.

లక్ష్మణుడు

అమ్మా! అయోధ్య వెళ్లి అన్నగారితో ఏమని చెప్పను?

సీత

ఆ రాతిగుండె కేమనిసందేశం? కాని— నువ్వు అడిగేవు కనుక చెప్పాలి, విను. నిరపరాధినిఅయిన నన్ను మీ కోసలరాజ్యంనుంచి తరిమినందుకు దుఃఖించను. మీహృదయంలో చోటుంటే, నేను గుణవంతురాలను కాకపోయినా చిరకాలపరిచితననిగాని దిక్కులేని దానిననిగాని తుదకు సీతననికాని ఎప్పుడేనా తలచుకొని అనుగ్రహించండి.

లక్ష్మణుడు

కష్టం, కష్టం, ఆ మహాయుద్ధంలో పాపాత్ముడు హనుమంతుడు చచ్చిపోయిన నన్ను సంజీవిపోసి బతికించిన దెందుకంటే ఈమెను అడవిలో ఒదిలిపెట్టి ఈవిడ గర్భనిర్భేదముగా ఏడుస్తూ చెప్పినమాటలు సంతోషంగా వినడానికి,

(ముందుకు చూసి)అయ్యో పాపం పచ్చిక నమలుతూ మానివేసి లేళ్లు కన్నీళ్ళతో ఈమెను చూస్తున్నవి. హంసలు దుఃఖంతో ఒళ్ళుతెలియక ఎలా దీనంగా కూస్తున్నవో. అదిగో ఆనెమళ్ళు పురివిప్పిఆడుతూ ఈమెనుచూసి తలవంచుకొని బిక్కమొగం వేసినవి. ఛీ ఛీ మనుష్యులకన్న పశుపక్ష్యాదులు నయంగదా?

సీత

నాయనా! సూర్యుడు క్రుంకిపోతున్నాడు. మనుష్యసంచారం తగ్గిపోయింది. పక్షులు గూళ్ల కెగిరిపోతున్నాయి. అమ్మబాబో! క్రూరమృగాలు అరుస్తున్నాయి.

లక్ష్మణుడు

అమ్మా! ఇంక ఈ పాపాత్ముడు వెళ్ళాలి. ఇదే నా ఆఖరు నమస్కారం.

సీత

నాకర్మ మిట్లాకాలింది. నీవేంచేస్తావు నాయనా వెళ్ళు.

లక్ష్మణుడు

(వెళుతూ) ఈమె కింకదిక్కెవ్వరు? ఎట్టి మహారాజపుత్రిక—ఎట్టిగతి! ఇంక ఈనదులే, స్నేహితులు. అష్టదిక్పాలకులే పాలకులు. ఈ పెద్దపెద్ద పర్వతాలే అన్నలు. గంగాభవాని తల్లి. (వెళ్ళిపోతాడు)

సీత

ఏమిటీ నిజంగా వెళ్ళిపోయాడు! నన్ను

ఈ మహారణ్యంలో విడచి, అయ్యో అయ్యో సూర్యుడు అస్తమించి పోతున్నాడు. కూత మేరకుకూడ అందడు లక్ష్మణుడు. లేళ్ళు పులి బొబ్బరింతలకు భయపడి తమతమ పొదరిండ్లకు ఒస్తున్నాయి. పక్షులు ఎగిరిపోతున్నాయి. ఘాతుకజంతువులు యథేచ్ఛగా తిరుగుతు న్నాయి. చీకటి తెరలు తెరలుగా కన్నుల ఎదుట జారుతున్నది.

ఆహా ఎంతలో నిర్మానుష్యం అయిపో యింది. ఇప్పు డీదౌర్భాగ్యురాలు ఎక్కడికి పోతుంది? ఎవరది? ఎవరో నాకోసం పాపం జాలిపడివచ్చారా? (నిదానించి) ఆహా ఇది వట్టిభ్రాంతి, గంగానదిగాలికి కదలిన ఒకలత ఇది. మనసి. అనుకున్నాను. నిన్నటివరకు లెక్కలేని పరిచారికలు. ఇప్పు డొక మనుష్య ప్రాణికే కరవు. ఆహా దైవగతి! (సొమ్మసిల్లి పోతుంది.)

(ఎవరో ముసలి మహర్షి కండ్లలో ఆలోచనా, జాలి, అన్వేషణ, తిరుగుతున్నాయి. ఆ ఆడదికి ఎంత పరిచితుడైనా తోవకి తడుముకుంటూ)

అబ్బా ఈచీకటి మసిపూతలో దేనికేదీ కనుపించదు. వటువులు ఉన్న ప్రాంతం ఇదేనా.

సీత

ఈనిద్రలోనించి లేపినవారెవరు? ఒళ్ళు మరచి సొమ్మసిల్లిపోయినా ఈదుఃఖానుభవం కోసం గంగానదిగాలులు లేపి ఉంటాయి.

ఋషి

ఇలా ఎంతదూరం వెళ్ళనూ? ఏపుట్టలో కాలుపెడితే ఏపాము పీకుతుందో? పిలిచిచూ స్తాను (పైకి) ఎవరమ్మా!

సీత

(సంతోషంతో) నాయనా లక్ష్మణా! నువ్వొచ్చావా.

ఋషి

లక్ష్మణుడు ఎవరు?

సీత

కొంప మునిగింది. ఎవడో-పరపురుషుడు. ఇప్పు డేంచెయ్యను? స్త్రీని. ఒంటరిని.

ఋషి

అమ్మా! నన్ను ఎవడోదుర్మార్గుడు అను కోకు. మావటువులు చెప్పితే ఇలావచ్చేను. అయితే అమ్మా! పదునాల్గుభువనాలచేత పరమపురుషుడని కీర్తింపబడ్డ శ్రీరామచం ద్రుని పాలనలో ఈన్యాయమేమిటి?

సీత

ఆ పండువెన్నెలలోనే ఈ నిప్పులవాన.

ఋషి

ఏమిటీ శ్రీరామభద్రుడు_ఈవిప త్తికి___ కారణం?

సీత

అవును.

ఋషి

అయితే నేవెడుతున్నా

సీత

తండ్రీ ఒకమనవి

ఋషి

చెప్పు

సీత

ఈ తుచ్ఛజీవితాన్ని నిలపెట్టడానికి కాదు రఘువంశ విచ్ఛిత్తికి సహించలేక ఈ తిప్పలు.

ఋషి.

సీతవా నాతల్లీ

సీత

ఊరుకుంటుంది

ఋషి

(ఆశ్చర్యంగా ముఖం పెట్టి) ఎందుకమ్మా! మళ్ళీ ఈవనవాసం?

సీత

(సిగ్గుపడి ఊరుకుంటుంది.)

ఋషి

(తలఊచి) ఆఁ తెలిసింది. నీపాతివ్రత్యం లోకవిశ్రుతం. మాయలోకానికి భయపడి అతను ఇట్లాచేసేను. విచారించకు. అతని హృదయం నీది. నీహృదయం అతనిది. ఎడబాటు మిమ్మల్ని గెలువలేదు. అక్కడ నీవంటి మునికన్యలు, కౌసల్యవంటి వృద్ధస్త్రీలు నీస్నేహానికి భక్తికీ పాత్రమవుతారు. అక్కడ లేడిపిల్లలనీ, సెలయేళ్ళనీ, పచ్చికనీ, పువ్వులనీ చూస్తూ ఈవిచారం మరచిపోదువు గాని. రా తల్లీ మన ఆశ్రమానికి వెడదాం.

సీత

తండ్రీ కృతజ్ఞురాలను (లేచి గంగానది వేపు చూస్తో) తల్లీ గంగాభవాని నమస్కారం. సుఖంగా నీళ్లాడితే ప్రతిరోజూ ఒకమల్లెపూలదండ గుచ్చి నీప్రవాహానికి భక్తిగా సమర్పించుకుంటాను.

ఋషి

అమ్మా! ఇదిగో ఈప్రక్కని గోతులు. ఆపక్కని పుట్టలు. మధ్యని దర్భముళ్ళు జాగ్రత్తగా చూసుకునీ నావెనక్కాలే రా!

సీత

ఒస్తున్నా తండ్రీ!

(ఇద్దరూ ఆశ్రమానికి వెడతారు)

(శిష్టము)

---

# ఆశీస్సు

సామవేదం జానకిరామశర్మగారు

౧

శ్రీలకిరవయి వితరణశ్రీవహించి
యశములోఁగొన్న స్వీయవంశాభిజాత్య
మధికమొనరింప, జన్మంబునందెననఁగ
చిరమువర్ధిల్లగదవోయి! చిన్నిబిడ్డ!

౨

పాలబుగ్గల పసపల్చుబాలకుండ
వెలుఁగవించుక లౌకికహీనవృత్తి
పరమవైరాగ్య విజ్ఞానపథమునట్టు
సంయమియు నీవు నొకపాఠశాలవారు.

౩

జిలిబిలిపదాలఁ బొత్తంబుఁ జేతఁబట్టి,
తరుణిఁ బెండ్లాడి, వ్యవహారధర్మమెఱిఁగి
సంతతినిగాంచి, తలిదండ్రులింత ముదము
నొంద వర్తింపు చిరకాల మిర్విమీఁద.

౪

కప్పురంబు పలంతిగాఁ జెప్పునట్టు
లెలమి నీకీర్తిచంద్రిక ల్వెలయభువిని,
త్యాగివై, భోగివై, సదుద్యోగివగుచు
క్రొలఁదియిడరాని సంపదఁగొని సుఖింపు.

# జయపురం ఇస్టేటు

శనివారపు సుబ్బారావుగారు

[జయపురము ఆంధ్రదేశములో విశాఖపట్టణము మండలము ఏజెన్సీకి చెందిన ఒక విశాలసంస్థానము. అది సుందరారణ్యములతోను, ఉన్నత భూధరములతోను, అనేక నదీనద జలపాతములతోను అలరారుచు మహాశ్రీమంతము కాగల ప్రదేశము. సంయుక్తరాష్ట్రములకును బంగాళాఖాతతీర విశాల మైదానములకును మధ్యనలరారుచు స్థానికముగ నెక్కువ ప్రాధాన్యము వహించుచున్నది. అనేక చారిత్రక విషయములకు కూడ నాకరము. ఆంధ్రవిశ్వవిద్యాలయమున శాస్త్రీయ శాఖకు సంవత్సరమునకొక లక్షరూప్యములు విరాళమునిచ్చుచు పోషించుచున్నది. ప్రస్తుతము దీనిని పాలించుచున్న శ్రీశ్రీశ్రీ విక్రమదేవ వర్మగారు విద్వత్కవులు, పండితపోషకులు, ఉదారసంకల్పులును నైయున్నారు. వీరినిగూర్చియు, ఈసంస్థాన సౌందర్యములను గూర్చియు కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు విజయలక్ష్మీ విలాసమను నొక అద్భుత ప్రబంధను కూడ రచించియున్నారు. ఇట్టి సంస్థానమునకు శ్రీయుత శనివారపు సుబ్బారావుగారు సందర్శనాభిలాషతో నేగి యచ్చటి వింతలనన్నిటిని ఆంధ్రపాఠక లోకముకొరకు సేకరించి దీర్ఘమగు వ్యాసమును వ్రాసి మా 'గృహలక్ష్మి' పత్రికలో ప్రచురింప పంపినందు కెంతయు కృతజ్ఞులము. పాఠకుల కిట్టి స్థానిక చారిత్రక విజ్ఞాన మావశ్యకమని భావించి రెండుభాగములుగ ప్రకటించుచున్నాము.

గృ. సం.]

**విశాఖపట్నం జిల్లా, రెవిన్యూ తాలూకాలు.**

విశాఖపట్నం జిల్లా, ఏజన్సీ ప్రాంతములో జయపురం ఇస్టేటు గలదు. ఇది జయపురం ఏజన్సీ అను పేరిట పరిగణింపబడుచున్నది. జయపురం ఏజన్సీలో (1) జయపురం (2) మల్కనగిరి (3) పాడ్వా (4) పొట్టంగి (5) కోరాపుట్టి (6) నౌరంగపూరు (7) రాయగడ (8) గునుపూర్ (9) బిస్సంకటక్ అను 9 రెవిన్యూ తాలూకాలు గలవు. ఈ తొమ్మిది తాలూకాలు వెళ్లవలెనంటే విజయనగరంనుంచి సాలూరువరకు రైలుమీద వెళ్లవలెను. సాలూరునుండి మోటారుబస్సు ఎక్కవ జయపురం వెళ్లును. ఈరోడ్డును టర్నరుగారు జిల్లాకలెక్టరుగా నుండగా వేయించెను. సాలూరునుండి జయపురం వెళ్లులోపునే (1) పొట్టంగి (2) కోరాపుట్టి (3) జయపురంతాలూకాల ముఖ్యపట్టణములు మోటారు బస్సుమార్గమును అంటియుండును. పాడ్వాతాలూకా ముఖ్యపట్టణమునకు పొట్టంగినుండి నాటుదారిని వెళ్లవలెను. మోటారు సర్వీసులేదు. (1) మల్కనగిరి (2) నౌరంగపూర్ తాలూకాల ముఖ్యపట్టణములకు జయపురంనుండి మోటారుబస్సుమీద వెళ్లవచ్చును. తాలూకాలలో (1) రాయగడ (2) గునుపూర్ (3) బిస్సంకటక్ అను 3 తాలూకా ముఖ్యపట్టణములకు విజయనగరంనుండి పార్వతీపురంవరకు రైలుమీద వెళ్లి పార్వతీపురంనుండి మోటారుబస్సుమీదనుండి వెళ్లవలెను. జయపురంనుండి యీమూడుతాలూకాలకు వెళ్లవలెనంటే జయపురంనుండి సాలూరుకు మోటారుబస్సుమీదనువచ్చి సాలూరునుండి పార్వతీపురంవరకు రైలుమీదను వెళ్ళవలెనేగాని మరోదారి లేదు. ఈ తొమ్మిది తాలూకాలు జయపురం ఎస్టేటులోనే చేరియున్నవి. ఈ తొమ్మిది తాలూకాలమీద వచ్చే ఆదాయమంతయు జయపురం రాజాగారికే చెందుచుండును.

**జయపురం ఇస్టేటు, మదరాసు గవర్నమెంటు.**

మదరాసు గవర్నమెంటువారు తమ పరిపాలనను యీఏజన్సీలో గావించుకొనుటకై 9 రెవిన్యూ తాలూకాలకు 9 గురు తహశ్శీల్దార్లను నియమించిరి. ఈ 9 తాలూకాలను రెండు రెవిన్యూ డివిజనులక్రింద విభజించి ఇరువురు రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లను నియమించిరి. వీరి పైఅధికారి విశాఖపట్నం జిల్లా

కలెక్టరే. ఏజన్సీ ప్రాంతమునకు జిల్లాకలెక్టరే మదరాసు గవర్నరు తరఫున ఏజంటుగా పరిగణింపబడును. కలెక్టరే ఏజన్సీకి గవర్నరు అని చెప్పవచ్చును. తాహశ్శీల్దార్లకు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లకు, సివిలు క్రిమినలు అధికారములుండును. అందువల్ల వారే అన్నివిధములైన కేసులను విచారించుచుండెదరు. తహశ్శీల్దారు ఇచ్చిన తీర్పుపై అపీలు రెవిన్యూ డివిజనలు ఆఫీసరువద్ద. రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు ఇచ్చిన తీర్పుపై జిల్లాకలెక్టరునకే అపీలు. పోలీసు డిపార్టుమెంటునకుగాను యీజయపురం ఏజన్సీ అంతటిని జయపురంజిల్లాగా ఏర్పాటుచేసుకొనిరి. ఇందు ఏర్పాటుచేసిన పోలీసు అధికారులను సాధారణంగా ఏజన్సీ లేని యితర ప్రాంతములకు బదిలీచేయరు. పోలీసుసిబ్బంది ఒక్కటేగాక రిజర్వు పోలీసుఅను పేరిట రమారమి 200 మంది సైనికులను కోరాపుట్టికే ముఖ్యప్రదేశముగా ఏర్పాటుచేసుకొని అందుంచిరి. పోలీసుశాఖకు కూడా కోరాపుట్టే ముఖ్యప్రదేశముగానున్నది. సివిలుక్రిమినలు నేరములందు శిక్షింపబడేవారికి కోరాపుట్టియందు నొకజిల్లా జైలును నిర్మించిరి. అందువల్ల యీ 9 తాలూకాలలోని ప్రజలలో కారాగారశిక్ష బడినవారిని కోరాపుట్టి జైలునందే ఉంచుటగలదు. ఏజన్సీలో తిరుగుబాటు చేయువారిని ఏజన్సీనుండి నెలసరి భృతియిచ్చి ఇతర ప్రదేశమునకు ప్రవాసశిక్షగా పంపివేయుట గలదు. ఇట్టి ప్రవాసశిక్ష గలవారు గవర్నమెంటు వారి అనుమతిలేనిదే మరల యీ ఏజన్సీలో అడుగు పెట్టరాదు.

ఇస్టేటువారికి వచ్చే రాబడి వసూళ్లకుగాను, ఫారెస్టు డిపార్టుమెంటు (అడవి పరిపాలనాశాఖ) భూమిశిస్తు వసూళ్లకుగాను, ప్రతిగ్రామములోను మునసబు కరణాలను (మునసబునకు అమీన్ అనియు కరణమునకు చలాన్ అనియు పేర్లు.) వీరిపై అమీనులను ఏర్పాటుచేసిరి. వీరినే రెవిన్యూ ఇనస్పెక్టర్లని అనుకోవచ్చును. వీరిపై అసిస్టెంటు దివానులు గలరు. అసిస్టంటుదివానులపై దివానుండును. దివానే అన్ని విధములను ఇస్టేటు శాఖలను పరిపాలించుచుండును. దివాను నియామకములో ఐ. సి. యస్. వారినే నియమింపవలెనని మదరాసు రాష్ట్రమునకు గవర్నరుగా ఇదివరలో పనిచేసిన లార్డువిల్లింగుడన్ గారే పట్టుబట్టిరి. లార్డు విల్లింగుడన్ గారు మదరాసురాష్ట్ర గవర్నరుగా నున్నపుడు జయపురం ఇస్టేటునకు కీ॥ శే॥ విక్రమదేవుగారు రాజుగానుండెను. ఆయన యీ మధ్యను చనిపోయిన రామచంద్రదేవుగారి తండ్రిగారు. ఈ చనిపోయిన విక్రమదేవుగారి అన్న కుమారులే ప్రస్తుతము రాజుగానున్నారు. ప్రస్తుతము రాజుగానున్న వారి పేరుకూడ విక్రమదేవుగారే. కీ॥ శే॥ విక్రమదేవుగారు ఐ.సి.యస్. దివానును వేసుకొను విషయములో ఇష్టపడలేదట. కారణమేమనగా ఐ. సి. యస్. పరీక్షలు అనగా జిల్లాకలెక్టరునకు సంబంధించినవనియు, అట్టి పరీక్షలను బడయుటకు లండనునగరమున చదవవలెననియు అట్టి హోదాగలవారు పామరజనులతో మాట్లాడుటకు సులువుగా ఇష్టపడరనియు అందువల్ల మామూలు ప్రజల కష్టసుఖములను తెలిసికొనుటలో గాని పామరజనులు సులువుగా దివానును సందర్శించుటకు గాని వీలుండదనియు చెప్పినటుల తెలియుచున్నది. ప్రారంభములో నియమించిన ఐ.సి.యస్. దివాను ఐరోపీయుడు. ఈ ఐరోపీయుడు దివానుగా రాకపూర్వము పూర్ణ వెంకన్నపంతులుగా రనేవారు దివానుగానుండిరి. ఈ వెంకన్నపంతులుగారి నివాసము విశాఖపట్నంజిల్లాయే. వెంకన్నపంతులుగారు పింఛను తీసికొనిన పిమ్మట కొంతకాలమువరకు జీవించి అటుపిమ్మట చనిపోయినటుల తెలియుచున్నది. కీ॥ శే॥ విక్రమదేవు రాజాగారికిన్ని వారి కుమారుడైన కీ॥ శే॥ రామచంద్రదేవుగారికిన్ని ఎక్కువ సామరస్యముగ లేదనే వదంతులున్నవి. అందువల్లనే కీ॥ శే॥ విక్రమదేవుగారు తన కుమారుడైన రామచంద్రదేవుగారికి ప్రత్యేకముగా నొక రాజభవనమును పురాతనమునుండి వచ్చుచుండే రాజభవనముప్రక్కనే కట్టించినటుల తెలియు

చున్నది. అందువల్లనే ఇపుడు రెండు రాజభవనము లున్నవి. కీ॥ శే॥ రామచంద్రదేవుగారి రాజ్యపరిపాలనాకాలమున హెండర్‌సన్ అను ఐ.సి.యస్. దొరగారు దివానుగానుండిరనియు ఆయన కాలముననే ఇస్టేటునకు సొమ్ము నిలువగా చేకూర్చెననియు చెప్పుదురు. కీ॥ శే॥ రామచంద్రదేవుగారి రాజ్యపరిపాలనాకాలముననే రామకృష్ణచౌదరిగారు (ఐ.సి.యస్. ఆంధ్రులు) దివానుగానుండిరి. ఈ రామకృష్ణ చౌదరిగారు దివానుగానున్న కాలముననే ప్రత్యేకముగా దివానుగారుండుటకు చక్కటి భవనమును చాలాధనము వెచ్చించి కట్టించెను. ఈ భవనము ఇస్టేటు తాలూకు ఆఫీసులుండే ప్రదేశమునందే ప్రశాంతముగానుండుటకుగాను నొక ప్రక్కగా కట్టబడినది. రామకృష్ణ చౌదరిగారు దివానుగనున్న కాలముననే సి. వి. రావుగారిని (వెలమదొరలు) నూతక్కి రామశేషయ్యబి.ఎ.,బి.యల్.(కమ్మవారు)గారినిఅసిస్టెంటు దివానులుగా నియమించెను. ఈ యిరువురిలో రావుగారు జయపురమునందేయున్నారు. రామశేషయ్యగారు రాయగడయందు ఆఫీసును ఏర్పాటు చేసుకొన్నారు. ఈ యిరువురి దివానులకు నెల 1కి రు. 500ల వరకు జీతమున్నదట. ఈ యిరువురినిగాక నెల 1కి రు. 500 ల జీతముతో నొక ఫారెస్టుఆఫీసరును కూర్గ ప్రాంతమునుండి తీసుకువచ్చి నియమించినటుల తెలియుచున్నది.

రామకృష్ణ చౌదరిగారు మదరాసు రాష్ట్రమునకు పరిశ్రమల (ఇండస్ట్రీస్) శాఖకు డైరెక్టరుగా నియమింపబడిరి. అందువల్ల వీరి స్థానే పుల్లారెడ్డి ఐ. సి. యస్. గారిని నియమించిరి. రామచంద్రదేవ మహారాజాగారు చనిపోయిన పిమ్మటను ప్రస్తుతము రాజుగానున్న శ్రీ విక్రమదేవవర్మగారు రాజ్యపీఠమును అలంకరించిన తరువాతను రామకృష్ణ చౌదరిగారు వెళ్లిపోయిరి. పుల్లారెడ్డిగారు వచ్చి కొలదికాలమే అయ్యెను. వీరి కాలముననే మదరాసు ప్రభుత్వ సెక్రటరియేటునుండి నె. 1కి రు. 250 జీతముతో నొక పంతులుగారిని (కర్ణాటకులు) మేనేజరుగా నియమించినటుల తెలియుచున్నది.

### జయపురం ఇస్టేటు—ఐరోపీయ వసతిగృహము

ఈ ఐరోపీయ వసతిగృహము బహుశా ఐ. సి. యస్.లు దివానులుగా నున్నప్పటినుండియే ఏర్పాటు అయియుండవచ్చును. ఎవరి కాలముననో తెలియదు. ఈ గృహమునందు అమర్చిన మంచములు వాటిపైన వేసిన పరుపులు, తదితర సామానుల ఖరీదు మొత్తము చేసిన కొన్ని వేలుండును. ఇందుండే పరుపులు పక్షులయొక్క ఈకలకుండే మెత్తని వెంట్రుకలతో తయారుచేసినవై ఉన్నవి. అందువల్ల అవి ఎంత మెత్తగానుండునో ఎంత ఖరీదుండునో చదువరులే గ్రహింతురుగాక! ఇచ్చటి కైరోపీయు లెవ్వరైనను అతిథులుగా రావచ్చును. ఈరీతిగ వచ్చే అతిథులు ఎంత కాలమున్నను అట్టివారందరికి భోజనము, ఫలహారము త్రాగుటకు కావలసిన విలుగల బ్రాంది సారాయి ఖర్చులు సిగరెట్టు ఖర్చులు మున్నగునవన్నియు ఇస్టేటువారే భరించెదరు. ఇట్టి అలవాటు ఇప్పటికిని ఇంకను అమలులోనున్నది.

### ఇస్టేటుకు వచ్చే రాబడి

ఈ ఇస్టేటునందు అమితమైన కొండలున్నవి. ఈ కొండలలో కోరాపుట్టి, పొట్టంగి తాలూకాలందుండే కొండలు సముద్రమట్టమునకు రమారమి 4500 అడుగుల ఎత్తునవుండును. అందువల్ల యీ రెండు ప్రదేశములలోను వేసంగిలో సహా చల్లగానుండును. శీతకాలములో అమితమైన చలిగాను, వర్షాకాలములో అమితమైన వర్షముగాను ఉండును. ఈ ప్రదేశమందు కాఫీ తోటలను అక్కడక్కడ ఇపుడే వేయుచున్నారు. కాని యీ ప్రదేశమంతయు చలిజ్వరముతోను ఇదిగాక బ్లాకువాటర్ ఫీవరు అనుదానితోనున్నదని చెప్పుదురు. అందరికి యీ జబ్బు వస్తుందని అనుకొనరాదు. సాధారణంగా ఎపుడో ఒకపుడు చలిజ్వరం వస్తే రావచ్చునని చెప్పుదురు.

కొండల మధ్యను అనేక వాగులున్నవి. ఆ వాగుల ద్వారా నీరు ప్రవహించుచుండును. కొండలమధ్య నుండే పల్లపుప్రదేశములకు వాగులద్వారా వచ్చే నీటి సదుపాయములున్న చోట్లెల్ల ఈ ఏజన్సీయందుండే ప్రజలు పల్లెలు కట్టుకొని నివసించుచున్నారు. ఆ నీటిసదుపాయముతో భూమిని సాగుచేసుకొని వరిపంటను పండించుచున్నారు. కొండలమీదను నీరు ప్రవహించని చోట్లలోను చోళ్లను పండించు చున్నారు. ఈ రెండే ప్రధానపంటలు. ఇవిగాక నీరుల్లి, అరటితోటలు, చెఱకు, కూరగాయలు, పసుపు మున్నగువాటిని పండించుచున్నారు. వాగులలోనుండే నీరును కారిముతో పొలములలోనికి ప్రవహించునట్లు చేసుకొని వ్యవసాయమును చేయు చున్నారు. ఎచ్చోట నీటిసౌకర్యముండునో అచ్చోట తప్పక పల్లెటిగ్రామము లుండును. ఆ పల్లెటి గ్రామాలవారు తాలూకా ముఖ్యపట్టణములకు రావలె నంటే కొండలమీదనుండే నాటుదారిని వచ్చుచుం డెదరు. ఆ నాటుదారులు అచ్చోటి ప్రజలకేగాని ఇతరులకు తెలియవు. అడవులలో సాలుకర్ర బాగా దొరకును. ఈ కర్రతోటే ఇండ్లను కట్టు కొనెదరు. సాలుకర్ర అనగా రైల్వేలైను మధ్యను వేయు కర్రయే. మంచి గంధపుచెట్లు అరుదుగానుం డును. ముషిణిగింజలు, చింతపండు, విప్పపువ్వు, కరక్కాయలు, వంటచెరకు, రంగులు వేయుటకు తగిన చెట్లయొక్క చెక్కలు విరివిగా దొరకును. ఈ అడవులలో దొరకే సరుకులను ఇతర చోట్లకు ఎగుమతిచేయుట గలదు. అందువల్లను పంటభూముల వల్లను రాజాగారికి ఆదాయము వచ్చుచుండును. ప్రస్తుతముండే ఆర్థికదుస్థితికి పూర్వము సాలునకు 11 లక్షల రూపాయిలున్న యిపుడు సుమారుగా 7 లక్షల రూపాయిలున్న ఆదాయము వచ్చుచున్నట్లు తెలియుచున్నది.

హెచ్చుగా సాగుఅగుటకుండే మార్గములు

కొండలుండే ప్రదేశములు హెచ్చుగా పొట్టంగి, కోరాపుట్టి, జయపూరు తాలూకాలలోనే గలవు. మిగతా తాలూకాలలో అంత హెచ్చుగా కొండలు లేవు. భూములు యెఱ్ఱచెక్కసేలగాను తెల్లగాను నుండును. సారవంతమైనవే అని చెప్పెదరు. నీటి వసతి ఏర్పాట్లకుగాను కొండవాగులుండే ప్రదేశము లలో నీటిని నిలువచేయుటకు పెద్ద పెద్ద (రిజర్వా యర్సు) చెఱువులను త్రవ్వించి అందు నీటిని నిలువ చేసిన ఆ నీటివల్ల సాగుచేయుట కెంతయేని అవ కాశముండును.

జలపాతములు

జయపురమునకు 6 మైళ్ల దూరములో కొండల మధ్యను బగరా అను గ్రామమున్నది. ఈ గ్రామము వద్దనే కోలాబా అనుపేరిట నొక నది ఉన్నది. ఈ నదిలోనికి నీరు అనేక కొండలనుండి వచ్చుచుం డును. ఈ కోలాబానదికి యీ గ్రామమువద్దనే నొక గొప్ప జలపాతమున్నది. బగరాదుడుమ అని యీ జలపాతమునకు అచ్చోట వారు పేరిడిరి. ఈ జలపాతములు రెండుగా ఉన్నవి. ఒకటి చిన్నది గను మరియొకటి పెద్దదిగను ఉండును. ఈ రెంటికి దూరము 2 ఫర్లాంగులుండును. చిన్న జలపాతము 3 లేక 4 గజముల వెడల్పున 10 గజముల ఎత్తునుండి పడుచుండును. ఈ చిన్నజలపాతమున్న చోటనే 2 గజాల వెడల్పున 10 గజముల ఎత్తునుండి పడేవి మరి రెండు జలపాతములు గలవు. ఈ మూడు జలపాతములనుండే పెద్ద జలపాత మేర్ప డును. ఈ మూడు జలపాతములుండే చోటు నకు 2 ఫర్లాంగుల దూరము ఆనది గుండా కొండల మధ్యనుండి వెళ్లిన అక్కడ 8 గజముల వెడల్పున సుమారు 40 అడుగుల ఎత్తునుండి పడుచుండే జల పాతము గలదు. ఈ జలపాతమునుండి విశాఖపట్నం, విజయనగరం, అనకాపల్లి మ్యునిసిపాలిటీలకున్ను జయపురం పట్టణమునకున్ను యీ ప్రదేశములందుండే ఫ్యాక్టరీలు మున్నగువానికన్నింటికిన్ని విద్యుచ్ఛక్తిని (ఎలక్ట్రిసిటీ) సప్లైచేయవచ్చునని సంగతిని విద్యు చ్ఛక్తియందు ప్రవీణతకెందిన శాస్త్రజ్ఞులు యీ జల

పాతములను జూచి అచ్చోట కొన్ని పరిశోధనలను గావించి నిర్ణయించిరట. ఈ జలపాతముల ద్వారా జయపురము ఇస్టేటునందుండే పల్లప్రదేశములలో నీటిసాగును చేయవచ్చునని చెప్పినారట.

ఈ కొలాబా జలపాతమువల్ల ఏర్పడిన ఈ ప్రవాహము జయపురం, మల్కనగిరి తాలూకాల గుండా మధ్యపరగణాల రాష్ట్రములోనుండే బస్తరు ఎస్టేటునకు వెళ్లి అచ్చోటనుండే శబరినదిలో కలియుచుండును. ఆ శబరినది బస్తరు ఎస్టేటునుండియు, మల్కనగిరి తాలూకానుండియు తూర్పుగోదావరి జిల్లానుండియు గోదావరి నదిలో పడుచుండును. మల్కనగిరి తాలూకాలో మోటు అను గ్రామమువద్దనుండి యీ శబరినది ప్రవహించుచు తూర్పుగోదావరిజిల్లా ఏజన్సీలో గోదావరినదివద్దనుండే కూనవరం అను గ్రామమువద్ద గోదావరినదిలో కలియుచున్నది. గోదావరినదికి హెచ్చునీరిచ్చేది యీ కొలాబా జలపాతమనే చెప్పుదురు. గోదావరిజిల్లా అంతటికి నీటి సప్లైకి యీ జలపాతము కొంతవరకు ముఖ్యమైనదిగ నుండుటవల్ల యీ జలపాతమును జయపురంనందే ఆపుచేసిన గోదావరిజిల్లాకు నష్టం కలుగుననే కారణంవల్ల మదరాసు గవర్నమెంటువారు రిజర్వాయరు మున్నగునవి కట్టి నిలుపుచేయుటకు అంగీకరించలేదని అచ్చోటి ప్రజలు చెప్పుచుండెదరు. ఎంతవరకు నిజమో తెలియదు. జయపురం జూచుటకు వెళ్లిన గవర్నర్లుగాని తదితర అధికారులుగాని తదితర ప్రజలుగాని యీ జలపాతమును జూడనిదేరారు.

—:o:—

# నేను — నీవు

(వనవిహారి)

చిగురుటాకులనీడ నేను
చెంత
పొగనుగీతలబాడు నీవు
అరమోడ్పుకనులతో నేను
తనువు
కరిగించుచూపుతో నీవు.
ఆనందబాష్పముల నేను
అండ
అనుపమానందమున నీవు
మధురకావ్యమునల్లు నేను
చెంత
సుధజిల్కుపదమాడు నీవు.
పూలతలనీడలను నేను
అందు
మాలలల్లుచునుండు నీవు.

పండువెన్నెలలోన నేను
చెంత
నిండుహాసముతోడ నీవు.
కరపల్లవముచాచి నేను
ప్రక్క
కంపించుగాత్రముతో నీవు
నిండుహృదయముతోడ నేను
అటనె
పండుటాసలతోడ నీవు.
'నీవు నాదేవివ'ను నేను
కాదు
'నీవు నాదేవుడ'ను నీవు
'నీవెనే'నని యేటి నేను
కాదు
'నేనె నీ'వని యేటి నీవు.

## సతీహితసమితి, తాడేపల్లిగూడెం.



ఈసమితి 1-10-1932-న తేదిని స్థాపింపబడినది. స్త్రీలకు విద్యాజ్ఞానమును, ధార్మికచింతను, సాంఘికసేవను, పరస్పర సహాకారమును నేర్పి, అంటరానితనమును నిర్మూలించుటయే దీనికి ముఖ్యోద్దేశము. ఇప్పటికి 45 గురు సభ్యురాండ్రు చేరియున్నారు. ఈసంవత్సరము దామోజీపురపు వెంకటరమణమ్మగారు అధ్యక్షురాలుగను, దామోజీ పురపు లక్ష్మీనరసమ్మగారు కార్యదర్శిగను వేలేటి సావిత్రమ్మగారు సహాయకార్యదర్శిగను ఎన్నుకొనబడిరి. ఈసమితికి ఉపసంఘముగా శారదాగ్రంథాలయమను పేరట ఒక లైబ్రరి స్థాపించిరి.

# ప్రపంచఘోష—మానవవిప్లవము

శ్రీమతి తాడి నాగమ్మగారు.

విశ్వము వింతైనది. ప్రపంచము లీల కాటపట్టు. మానవజీవితము నవలలోని గాథ. చిత్ర విచిత్ర రాజకీయప్రవాహము లందు మనుష్యసంఘములు తేలిపోవుచున్నవి. వింతలన్నిటికంటె వింతైనది మానవ జీవితము. సర్వలోకములను శాసించుటకు సకల ప్రయత్నములు చేయుచున్న మానవుడు అకస్మాత్తుగ అధోలోకములోనికి పోవుచున్నాడు. తన యభీష్టమును తీర్చుకొనుటకై మానవుడు రాజకీయ, సాంఘిక, మత విప్లవములు లేవదీయుచున్నాడు. వింతవింత విప్లవములు నిమిష నిమిషమునకును పుట్టుచున్నవి. ఎన్నియో సంఘములు, సమాజములు, పార్టీలు, శాఖలు, సంస్థలు, అనుక్షణము బయలుదేరుచునే యున్నవి.

ఐనను మానవునికి సంతృప్తి యెక్కడిది! మనుష్యునియొక్క ఆశ దేవునియొక్క విశ్వముకంటె పెద్దది. **Man's desire is greater than God's universe** అని యొక మహాశయుడు చెప్పిన మాట సత్యము. ఈవింత మానవునకు అంతెక్కడిది! ఈ మానవ జీవికి తృప్తి యనునదిలేదు. నిత్యము నిమిష నిమిషమునకు ఘడియ ఘడియకు వింత వింతగ మానవసంఘము తన ఆశయములతోసహా మారిపోవుచున్నది.

బాలిక బాలునిపై తిరుగబడుచున్నది. స్త్రీ పురుషునితో కలహించుచున్నది. కుమారుడు తండ్రిమీదకు తిరుగబడుచున్నాడు. కూతురు తల్లిపై కెగురుచున్నది. కోడలు అత్తపై చెలాయించుచున్నది. సంఘములు సమాజములతో తలపడుచున్నవి. మతములు పరమతములతో పోరాడుచున్నవి. రాష్ట్రములు రాజ్యములపైకి లేచుచున్నవి. రాజ్యములు సామ్రాజ్యములపై తిరగబడుచున్నవి. దేశములు పరదేశములతో పోటీలు సలుపుచున్నవి. సైన్యములు సైన్యాధికారులపై సవాలుకొట్టుచున్నవి. సైన్యాధికారులు రాజులకు ద్రోహులగుచున్నారు. ప్రధానులు చంపబడుచున్నారు. అధ్యక్షులు హతులగుచున్నారు. ఈ సందిగ్ధములయందు బడి మానవాశయములు తుత్తునియలై పోవుచున్నవి. ఈ యల్లకల్లోలములయందు బడి మానవోద్దేశములు భిన్నములై పరస్పర విరోధములచే క్షీణించి పోవుచున్నవి. దినములు గతించు కొలది నరులకు కష్టపరంపర లెక్కువగుచున్నవి. మనుష్యునకు జ్ఞానముతోపాటు దుర్దశగూడ వృద్ధిగాంచుచున్నది. ఆశ యెక్కువగు కొలదీ శోకము హెచ్చు పెరిగిపోవుచున్నది. మతముల పేరిట మానవుడు చేయరానికార్యములు చేయుచున్నాడు. దేనినైతే నరుడు దైవమని నమ్మెనో అదే భూతమై యాతని మ్రింగుచున్నది. దేనినైతే మనుష్యుడు రక్షణగ భావించెనో అదియే నాశనమునకు మూలహేతువగుచున్నది. ఎవనిని ప్రభు

వని చెప్పి మానవసంఘ మాశ్రయించెనో యతడె రాక్షసుడై సంఘమును పీల్చి పిప్పి చేయుచున్నాడు. నాయకుడె అనుచరులను నాశముచేయుచున్నాడు. ప్రభువే ప్రజలను పాడుచేయుచున్నాడు. రక్షకుడె రక్షింప దగినవారిని శిక్షించుచున్నాడు. రాజే రాజ్యములను కొల్లగొట్టుచున్నాడు. పశు పక్ష్యాదులకులేని మాయలు మానవుల నాశ్రయించినవి. ఖనిజములను గడించు తత్వశాస్త్రములు నరులయందు ఘనీభవించి పోవుచున్నవి. అధ్యాత్మిక శాస్త్రములయొక్క ఆశయములు ఆవిరియైపోవుచున్నవి. ఏదియో మహానర్థకము, మహాప్రళయము, మహావిప్లవము మానవకోటిని చుట్టనున్నది.

లేనియెడల ఈ విచిత్రములేమి? ఈ వింత లేమి? ఈ దురవస్థలేమి? ఈ అన్యాయములేమి? మహాభూకంపములచే, అగ్నిజ్వాలలచే దేశదేశములు దగ్ధమగుచున్నవి. మహావరదలచే పంటలు నాశనమై భూములు మునిగి, ఇండ్లు కొట్టుకొనిపోబడి కొన్ని దేశములు క్షీణించిపోవుచున్నవి. వర్షములు లేక వరదలు లేకపోవుటచే పంటలు యెండిపోయి, ఫలవృక్షములు దగ్ధమై, పచ్చని మొక్కలులేక తుదకు త్రాగుటకు నీటిచుక్కయినను లేక కొన్ని రాష్ట్రములు భగ్గున మండి తహతహ లాడిపోవుచున్నవి. అతి వృష్టిచే నాశనము: అనావృష్టిచే కరువు. అరాజకము ప్రబలి శాంతి యనునది లేక, న్యాయ మనునది లేక, పాలన మనునది లేక, రక్షణ యనునది లేక, కొన్ని దేశములు భయకంపితములై ఘూర్ణిలిపోవుచున్నవి. రాజులున్న దేశములలో రాజరికము లెక్కువై నిరంకుశముగను, కఠినముగను పరిపాలనములు కొనసాగింపబడుచున్నవి. యుద్ధము యుద్ధమంచు కొన్ని జాతులు ముందంజవేయుచున్నవి. ప్రాణముల నరచేతబట్టుకొని కొన్ని జాతులు పారిపోవుచున్నవి. తిరుగుబాటుచేసి కొన్ని దేశములు స్వాతంత్ర్యమును సంపాదించుచున్నవి. తిరుగుబాటుచేసి కొన్ని దేశములు ఉన్న స్వాతంత్ర్యమునుకూడ పోగొట్టుకొన్నవి. భగవంతుని లీలలు భయంకరములు. మానవుని మాటలన్నియు మాయలు. ఏదేశమునందు జూచిన ఏడ్పు, దుఃఖము, ప్రలాపము, చింత, రోదన, ఈర్ష్య, అసూయ తప్ప మరి యితరము గాన్పించదు. ప్రతి దేశమునందు, రాష్ట్రమునందు, జాతియందు, మతమునందు, సంఘమునందు, కక్షలు, పార్టీలు పెరిగిపోవుచున్నవి.

పరులయందుండెడి అసూయకంటె పక్షములలోనుండెడి మనస్పర్థలు మెండు. ఒరులయెడుండెడి భేదభావముకంటె తమలో తమకు తారతమ్యము హెచ్చు. కలిమికొరకై కల్లలాడుటలు పార్టీదారులకు ప్రధానసూత్రములైనవి. మర్యాదకొరకై అనేకవిధముల ప్రాకులాడుచు మనస్పర్థలు పెంచుకొనుటలే మానవాశయములైనవి. నిజము నీటగలిసినది. సత్యము సన్నగిల్లినది.

నిజానిజములకును, సత్యాసత్యములకును ఈ మానవమతములందును, ఈ రాజకీయములందును తావులేదు. అబద్ధ మక్షయమైనది. అసత్య మజేయమైనది. వల్లమాలిన ప్రమాణములు, సన్నగిలు క్షమాపణలు, రాజకీయయుద్ధరంగములయందు అస్త్రశస్త్రములైనవి. నిశ్చయమైన నిర్ధారణలుగాని, సంశయములేని సవరణలుగాని రాజకీయములం దపరూపములు. అసలుకు మించిన ఆశలు, ఆశలను మించిన సంశయములు, ప్రతి పార్టీప్రతినిధులకు ప్రధాన హక్కులైనవి. కల్మషములేని కల్లలే కలియుగమున కాధారభూతములైనవి. ఉన్నవాడు లేనివాడు సమముగానే దుఃఖించుచున్నారు. లేనివాడు లేదని గోల. ఉన్నవాడు తనది పోవునని గోల. స్వాతంత్ర్యము గలవాడు, స్వాతంత్ర్యము లేనివాడు సమముగానే కష్టములపాలగుచున్నారు. స్వాతంత్ర్యముగలవాడు ఇతరుల నస్వతంత్రులనుగా జేయవలెనని పలువిధములుగా కష్టించుచున్నాడు. స్వాతంత్ర్యములేని వాడు తనకది కావలెనని ఘోషించుచున్నాడు. తనకు లేదని యొకడు ప్రలాపించుచున్నాడు. తనకు లేకపోయినను తన ఎదుటి వాని కేలయుండవలయునని మరియొకడు రోదన చేయుచున్నాడు.

కర్మను కలిగించినవాడు-దేవుడు. కత్తిని నిర్మించినవాడు దానవుడు. వారిద్దరిచే బాధింపబడువాడు మానవుడు. కర్మచే ఈశ్వరుడు మానవకోటిని కట్టివేసెను. కత్తిచే దానవుడు మానవమాత్రులను నిర్బంధించివైచెను. కర్మచే ఈశ్వరుడును, కత్తిచే దానవుడును మనుష్యకోటి నెంతకాలము బాధించెదరు? నిరాటంకముగా దేవుడును, నిరంకుశముగ దానవుడును మానవుల నెంతకాలము పీడించి, భయపెట్టి పరిపాలించగలరు? దేవదానవుల కర్మకత్తులు మానవసంఘముల నెంతకాలము భయపెట్టగలవు? వాని కర్మకును వీని కత్తికిని స్వస్తిజెప్పు కాల మరుదెంచినది. భయమనునది మానవహృదయమునుండి తొలగిపోయినది. యుగయుగములనుండియు మానవుడు దైవనిర్మితమైన కర్మచేతను, దానవనిర్మితమైన కత్తిచేతను కలుగు కష్టములను సహించియున్నాడు. ఇక సహించలేడు. ఇక ఓర్చుకొనలేడు. క్షమ యనునది మానవహృదయమునందు శూన్యమైపోయినది. పిరికి తనమనునది మానవసంఘమునుండి పరారియైనది. నూతనశక్తి యొకటి మానవకోటియం దుద్భవించుచున్నది. ఈ నూతనశక్తితో నరుడు విశ్వముపై విజృంభించుచున్నాడు. ఇక దైవదానవుల కర్మకత్తులు మానవస్వేచ్ఛ నరికట్టజాలవు, జాలవు ముమ్మాటికి జాలవు.

మానవవిజృంభణమునకు ప్రపంచ మాహుతి గావలసియున్నది గదా!

# "అమితమైన స్త్రీవిద్య"

శ్రీమతి వేములపాటి మీనాక్షమ్మగారు

పైశీర్షిక క్రింద హైదరాబాదునగరము నుండి వెడలు "గోల్కొండ పత్రిక" యీ రీతిగ వ్రాయుచున్నది. "అమెరికా వాస్తవ్యుడగు డబ్ల్యూ. వి. లారెన్సు అను నొకవర్తకుడు 85 సంవత్సరముల వయస్సున తన వ్యాపారమును మానుకొని విశ్రాంతి గైకొను కాలమున స్త్రీ విద్యా ప్రమాణమును గుఱించి యిట్లు అభిప్రాయమిచ్చియున్నాడు. "అవివాహితలగు ఉపాధ్యాయినులు స్త్రీల కళాశాలలందు తమ విద్యార్థినులకు వివాహమును మానుకొనుమని బోధించుచున్నారు. ఖేలనాద వినోదము లందెక్కువ కాలమును పట్టభద్రురాండ్రు వినియోగించుచు తమ్ముతామే వివాహమున కనర్హలుగ నొనర్చుకొనుచున్నారు. స్త్రీలకు వివాహమాడుటయే ప్రధానమైన విషయము."

స్త్రీస్వభావమును పెంపొందించుటకును, విద్యాతిశయమువలన అవివాహితలుగనుండు యవకాశములను నిర్మూలించుటకును, న్యూయార్కు పట్టణమునందు ప్రత్యేకము స్త్రీల నిమిత్తము కళాశాలలు నిర్మించుటకు లారెన్సుగారు రెండులక్షల యేబదివేలపౌనులను (అనగా రమారమి ముప్పదియేడున్నరలక్షలరూపాయలు) దానపూర్వకముగ నొసంగిరి. ఈకాలేజీయందు నాలుగుసంవత్సరములకు బదులు రెండుసంవత్సరముల వరకే స్త్రీలనైజమున కనుగుణ్యములగు లలితకళలందు శిక్షజరుగును. వీనివలన స్త్రీలు తమజీవనమునకై యితరులపై నాధారపడక యుండవచ్చును గాని, పురుషుల కనాకర్షణులుగఁ జేయఁబడక అమిత విద్యాభ్యాసమునుండి సంరక్షింపఁబడుదురు. గృహిణీ ధర్మములు నేర్పఁబడును."

సోదరసోదరీమణులారా! "అతి సర్వత్ర వర్జయేత్" అను ఆర్యోక్తి స్త్రీవిద్యకు పట్టించవలసియున్నది. పరమపావనమైన మన భరతఖండమున చిరకాలమునుండి యేదో ఒకవిధమైన స్త్రీవిద్య ఆచరణయందుండెననుట నిర్వివాదాంశము. స్వాతంత్ర్యవిషయములో, స్త్రీలు బాల్యమున తమ జననీజనకుల సంరక్షణములోను, యౌవనమున తమ భర్తల సంరక్షణములోను, ఇతరకాలమున తమపుత్రుల సంరక్షణములోనునుండిరి. ఇప్పటికిని సావిత్రి గౌరినిపూజించునపుడు మన స్త్రీలు యీప్రకారము ధ్యానించుటవాడుక. "దండనాలు తప్పకుండ, అఖండమారకుండ, తల్లిదండన తండ్రిదండనకలుగఁజేసి అత్తదండన మామదండన కలుగఁజేసి, పురుషదండన కలుగజేసి రాజుదండన యమదండన లేకుండ జేసి, స్వర్గమునకు పోయినను సవతిపోరు లేకుండజేయవలెను." "సర్వశాస్త్రమయో మనుః" అనురీతిగా మనుస్మృతిననుసరించి, నేటికిని స్త్రీకిమనదేశమునస్వాతంత్ర్యము లేదు. శ్రీజగద్గురువు పూరి శంకరాచార్యులవారు సూచించినట్లు, స్త్రీకి స్వాతంత్ర్యము లేదనుటచేతనే బానిసలుగా చూడఁబడుచుండిరనుట గొప్పపొరబాటు. సావిత్రి, సీత, అనసూయ మొదలైన భారతనారీమణుల నామములు నేటికిని పావనముగ భావింపఁబడుచున్నవి. గృహిణీధర్మముల నెరవేర్చుచు,

పతిశుశ్రూషచే భర్తను సంతోషపెట్టుచు, సదాభగవంతుని ధ్యానించుచు మనభరత ఖండమునకు అపారమైన కీర్తినితెచ్చిన పతివ్రతలకు కానిసత్వముండెననుటకల్ల. సతి గృహమునకు రాణిగ నెన్నబడుచుండెను. సర్వకర్మలకు భర్తకు నధికారమునిచ్చునది భార్య. కాబట్టి భార్యలేని వానికిగాని, భార్యాసమేతుఁడు కానివానికిఁ గాని మతకర్మలఁజేయుటకు అధికారములేని కారణముచేత, అట్టివానికి స్వాతంత్ర్యములేదనియే భావింపవలసియున్నది.

అమెరికా దేశములో 'గృహిణీధర్మములు" స్త్రీలకు కాలేజీలో నేర్పఁబడబోవునట్లు తెలియుచున్నది. గృహిణీధర్మములు నేర్చుకొనుటకు స్థలము గృహముగాని కాలేజీ కాఁజాలదు. మనబాలికలు చిన్ననాటనుండియు గృహకృత్యములలో తలిదండ్రులకు దోడ్పడుచు గృహిణీధర్మములను స్వయముగానే నేర్చుకొనుచుందురు. మఱియు అమెరికాలో "స్త్రీస్వభావమును పెంపొందించుటకు" యత్నములు జరుగుచున్నవి. అక్కటా! ఎంతటివిద్య!! ఎట్టిపరిస్థితులు!! ఈలాటిపరిస్థితులు పవిత్రమైన మనభరతఖండమునకు కళంకము తెచ్చుననుటఅతిశయోక్తి కాఁజాలదు. ఇప్పటికే అచ్చటచ్చట మన దేశములో "అమితస్త్రీవిద్య" పెడమార్గమునుబట్టి గృహిణులు కఱవగునట్లుజేయుచున్నది. స్త్రీవిద్య స్వధర్మనిర్వాహమునకనుకూలించి యుండవలెను. అనగా స్త్రీ గృహతంత్రము నెఱిగి, భర్తకు నీడవలెయుండి తోడ్పడి, మాతృస్థాన మలంకరించుటకు తగినలక్షణములను కలిగియుండవలెను. ఇట్టి ధర్మమునకు స్త్రీవిద్య తోడ్పడనియెడల, దాని వలనలాభములేదు. సంసారరథమును దంపతులు కలిసిసాగించవలెను. ఇరువురు ఒకవిధమైన విద్యనే నేర్చి ఒకవిధమైన పనులనే జేసి, ధనార్జనలోనే పోటీచేయును కాలము గడపినచో గృహిణులకు కఱవుకాదా? ఇన్నివేలసంవత్సరములు మన సనాతనధర్మములను కాపాడినది గృహిణియే! ఇట్టిగౌరవము మనస్త్రీలకు చెందినదిగాని విద్యావంతులమనుకొను పురుషులకు చెందునదికాదు. ప్రస్తుత అమెరికాలోని భయంకరమైన పరిస్థితులు మనలను పీడించకుండుగాక! మనసోదరీమణులు మోసబోకుందురుగాక!! భగవంతుఁడు మనలను ఉత్తమ ఆర్యవిధానమున నడపించుగాక!!!

—:o:—

## ఆ ప్రేమ

జనమంచి కామేశ్వరరావుగారు

పసిపాపలా నన్ను
పలుకరించినప్రేమ
కౌగిలింతల ఒదిగి
కలలగాంచింది.

ప్రేమ పాపిట దిద్ది
కలలుసఖలోతురిమి
నొసటకుంకుమపెట్టి
బ్రతుకునిచ్చింది.

## 'పరోపకారిణి'

శ్రీమతి బి. లక్ష్మీవెంకాయమ్మగారు

"పతియె దైవంబు పతియె సర్వస్వమనుచు విభుని నానందపరచుచే విధియటంచు
తలచికొలువుడీ సాధ్వీమతల్లులార మహితగుణలార లక్ష్మీసమానలార!"

సంక్రాంతిపండుగ. మధురా నగరమంతయు పచ్చనితోరణములతో వివిధాలంకారములతో స్వర్గధామమువలె ప్రకాశించుచుండెను. అట్టి సంతోషసమయమందొక యుద్యానవనములో సరోవరముదగ్గరనున్న స్ఫటికశిలావేదికపై సుజాతారమాకాంతులు విషణ్ణవదనులై అశ్రుకణములు రాల్చుచు కూర్చుండిరి. వనమంతయు వివిధలతానికుంజములతోను నానావిధసువాసనాపుష్పములతోను శోభించుచుండెను. సరోవరము పద్మసమ్మిళితయై ఆనందము గొల్పుచుండెను. సుజాతాదేవి రామప్రసాద్ అను గొప్ప శ్రీమంతుని బిడ్డ. నిఖిలసద్గుణాలవాల. ఆమె షోడశవర్షప్రాయమును గలిగి, సువర్ణ స్వర్ణపద్మసన్నిభములైన నేత్రములు దీర్ఘకుంతలములు దొండపండువంటి అధరము మృణాలవల్లరులంబోలిన బాహువులు సుధాకరునివలె ప్రకాశించుచున్న వదనమునుగలిగి, రతీదేవి మాడ్కి రాజిల్లుచుండెను. రమాకాంతుడు ఇరువదేండ్ల యువకుడు. దబ్బపండువంటి శరీరచ్ఛాయ, ఆకర్ణాంతములైన నయనములు, విశాలవక్షస్థలముగలిగి మదనునిమాడ్కి రాజిల్లుచుండెను. రమాకాంతుని బాల్యమందే అతని జనకుడు మరణించెను. తల్లి అసమర్థురాలగుటచే ఆస్తినంతటిని దాయాదులు వశపర్చుకొనిరి. సుజాతా రమాకాంతులు బాల్యమునుండియు అన్యోన్యమైత్రితో కలిసిమెలిసి మెలగుచుండిరి. ఒకరినొకరు గాఢముగా ప్రేమించిరి. ఆమె జననీజనకులు రాధాకృష్ణప్రసాద్ అను గొప్పజమీందారునకిచ్చి పరిణయముగావింప నిశ్చయించిరి. అప్పటినుండియు ఆమె బహుళపక్ష సుధాకరుని మాడ్కి క్షీణించుచుండెను. వారిరువురును వియోగబాధ సహించలేక యుద్యానవనములో అశ్రుకణములు రాల్చుచుండిరి. సుజాతాదేవి రమాకాంతునితో, "ప్రాణేశ్వరా నేను బాల్యమునుండియు మిమ్ములనే త్రికరణశుద్ధిగా పంచభూతముల సాక్షిగా ప్రేమించుచుంటిని. మీ కర్పించిన హృదయమును మరియొకరి కర్పింపజాలను. ఎన్ని కష్టములనైనను సహించి మిమ్ములనే పరిణయమాడెదను. లేనియెడల ఆత్మహత్యయే శరణ్యము" అని ప్రతిజ్ఞచేసెను. రమాకాంతుడు సుజాతతో, "ప్రేయసీ! నీయొక్క రూపంబును సద్గుణంబులును నా హృదయపీఠమునందు స్థిరముగా నెలకొల్పబడియున్నవి. నిన్నుతప్ప మరియొకరిని వివాహమాడను. సందర్భపడనియెడల సన్యాసినై దేశాటనము చేయుదునుకాని నా హృదయమును మరియొకరి కర్పించను" అని ప్రతిజ్ఞ చేసెను. వియోగమును భరింపజాలక కొంతసేపు దుఃఖించి ఎవరి భవనములకు వారు వెళ్లిరి. మరుచటిరోజున సుజాతా

దేవి కల్యాణమహోత్సవము. భవనమంతయు
బంధుమిత్రులతో నిండియుండెను. సుజాత
జనకుని సన్నిధికేగి సాష్టాంగనమస్కార
మాచరించి, "జనకా! నేను మనోవాక్కాయ
కర్మలచేత రమాకాంతునే పతిగా వరించి
తిని. అతనితప్ప అన్యుల వివాహమాడుట
పతివ్రతాలక్షణముగా"దని వినయముతో
చెప్పెను. జనకు డామె మాటలను మన్నించ
లేదు. దుఃఖముతో అంతఃపురమునకు
వెళ్లెను. సుజాతకు లలితమోహను డను
ప్రియసహోదరుడు కలడు. అత డామెను
బహుప్రేమతో ఆదరించుచుండెను. తండ్రి
సహోదరి కోర్కెను నిరాకరించిన సంగతి
విని తక్షణమే అంతఃపురమునకు వెళ్లెను.
సుజాతాదేవి తనయొక్క దురదృష్టమునకు
విచారించి పునర్జన్మమందైనను రమాకాం
తుడే భర్తగ కావలయునని సర్వేశ్వరుని
ప్రార్థించి విషము త్రాగబోవుచుండెను.
చెల్లెలియొక్క సాహసమునకు దిగ్భ్రాం
తుడై వేగమే కరముపట్టుకొని, "సోదరీ! నీకీ
సాహసము తగునా? ఆత్మహత్య మహాపాత
కము గాదా! నీ బహిఃప్రాణమగు నేనుండ
నీ వీలాగున చేయదగునా? నా ప్రాణ
మున్నంతవరకు నీకేమియు కష్టములు సంభ
వింపవు. రమ్మ"ని చెప్పి ఇరువురును ఇల్లువిడిచి
వెళ్లిరి. రాధాకృష్ణప్రసాద్ నకు సుజాత చెలి
యగు సుధేష్ణనిచ్చి అత్యంతవైభవముగా
పరిణయము గావించిరి. సోదరీసోదరు లిరువు
రును కంటకభూయిష్టమగు అరణ్యములో
ప్రయాణముచేయుచుండిరి. ఒకనాడు గాలి
వాన ప్రళయభయంకరముగా నుండెను.
అట్టి సమయమందు మేహర్‌జాన్ అను
దొంగలనాయకుడు సుజాత రూపమునకు
మోహించి లలితమోహనుని దగ్గరనుండి
ఆమెను అపహరించెను. సోదరు డామె
కొరకై అరణ్యమంతయు వెదకెను. ఎంత
వెదకినను ఆమె జాడ తెలియలేదు. అరణ్య
ములోలేదని నిశ్చయించి పట్టణములలో
వెదకసాగెను. మధురానగరములో రమా
కాంతుడు సుజాత వెళ్లినప్పటినుండియు
బహుళపక్ష సుధాకరునిమాడ్కి క్షీణించు
చుండెను. అతని జనని నిఖిలసద్గుణాలయయు
అసమానసౌందర్యవతియునగు స్వర్ణలతా
మంజరి యను బాలికను వివాహమాడ
వలసినదని నిర్బంధపెట్టసాగెను. మాతృ
భక్తుడగు రమాకాంతుడు జనని ఆజ్ఞాను
సారముగా ఆకన్యకను పరిణయమాడెను.
స్వర్ణలతామంజరి గృహకృత్యములను నేర్పు
తో నిర్వహించుచు అత్తగారియొక్కయు
ప్రాణేశునియొక్కయు సేవయందే అహర్ని
శలు కాలముగడపుచు సాధ్వీశిరోమణి
యని ప్రఖ్యాతిగాంచెను. అత్తగా రామెను
తల్లివలె ప్రేమతో ఆదరించుచుండెను.
ఇవ్విధంబున రెండు సంవత్సరములు గడ
చెను. రమాకాంతుడు స్వర్ణలతను ఆదరిం
చుటలేదు. సాధ్వీశిరోమణియగు నామె
ప్రాణేశుని సంతోషపరచుటకు ప్రయత్నించు
చుండెను. కాని రమాకాంతు డామె సేవలు
గైకొనక సుజాతకొరకై విలపించుచుండెను.
తల్లివలె నాదరించు అత్తగారు మరణించెను.
ఆ సాధ్వియొక్క శోకమునకు పరిమితిలేదు.
రమాకాంతు డామెను తల్లి ఆజ్ఞ నుల్లం

ఘింపలేక వివాహమాడెను కాని సుజాత యొక్క సద్గుణంబులును రూపమును అతని హృదయపీఠికయందు నెలకొనియుండెను. తల్లి మరణానంతరము ఒకనాడు రమాకాంతుడు స్వర్ణలతను పుట్టినింటికి వెళ్లమని చెప్పెను. ఆ పతివ్రత భర్త యాజ్ఞానుసారముగా పుట్టినింటికి వెళ్లెను. రమాకాంతుడు గృహము పరిత్యజించి సన్యాసియై దేశాటనము చేయసాగెను. స్వర్ణలతామంజరి తన భర్త సుజాతను వెదకుటకై దేశాటనము చేయుచున్నారని గ్రహించి 'పతిని సంతోషపెట్టుటే పరమధర్మము. ఎన్ని కష్టములైనను సహించి సుజాతను వెదకి నాప్రాణేశ్వరునకు పరిణయముగావించి ధన్యురాలనయ్యెద'నని నిశ్చయించి యోగీశ్వరుని వేషము వైచుకొని అరణ్యములన్నియు వెదకసాగెను. దొంగలనాయకుడు మేహర్ జాన్ సుజాతను పాతాళగృహములో బంధించి తన్ను పరిణయమాడవలసినదని నిర్బంధపెట్టుచుండెను. అతను ఎంత కష్టపెట్టినను నిశ్చలమైన మనస్సుతో రమాకాంతునే ధ్యానించుచుండెను. కాని మేహర్ జాన్‌కు లొంగుటలేదు. ఒకనాటి రాత్రి మేహర్ జాన్ తన చోరదళముతో చౌర్యమునకు వెడలెను. సమయము కనిపెట్టి ఇస్మాల్ ఖాన్ అను మ్లేచ్ఛుడు సుజాతతో లలితమోహనుడు తీసుకరమ్మన్నాడని నమ్మిక బుట్టునట్లు వచించి ఆమెను గృహము దాటించెను. మధ్యదారిలో తన్ను గూడవలసినదని నిర్బంధపెట్టసాగెను. ఆమె ఇష్టపడలేదు. క్రూరుడగు ఇస్మాల్ ఖాన్ ఉగ్రుడై నిశితకరవాలమును ఆమె వక్షస్థలమందు గ్రుచ్చెను. ఆమె ఆర్తనాదముతో క్రిందపడిపోయెను. ఇస్మాల్ ఖాన్ పారిపోయెను. ఆర్తధ్వని విని యోగివేషముతోనున్న స్వర్ణలతామంజరి వెదకుచు సుజాతపడియున్న స్థలమునకు వచ్చెను. ఆమె స్మృతితప్పి రక్తప్రవాహములో పడియుండెను. యోగి కమండలువులోనున్న ఉదకముతో గాయములు కడిగి కట్టుకట్టి శైత్యోపచారములు చేయసాగెను. ఆమె కన్నులుదెరచి యెదుట బాలసూర్యునివలె ప్రకాశించుచున్న యోగీశ్వరునకు నమస్కరించి సమస్త వృత్తాంతము జెప్పెను. స్వర్ణలతామంజరి 'ఇప్పటికి నా జన్మసార్థకమైనది, నా కష్టము ఫలించినది' అని మితిమీరిన సంతసమొందెను. సుజాతను గోపాలకుల సహాయముతో దగ్గరలోనున్న గ్రామమునకు తీసుకువెళ్లి సంపూర్ణారోగ్యము కలుగువరకు ఉపచారములుచేసి తర్వాత లలితమోహనుని వెదకి అతనికి సుజాతను ఒప్పగించి ఆమె రమాకాంతుని వెదకుటకు బయలుదేరెను. కాశీలో సన్యాసి వేషముతో ద్రిమ్మరుచున్న రమాకాంతునకీవార్త జెప్పి మధురానగరము తీసుకొని వచ్చెను. సోదరీసోదరు లిర్వురును స్వగృహమునకు వచ్చిరి. జననీజనకు లమందానందమొందిరి. ఒకానొక శుభదివసంబున సుజాతా రమాకాంతుల వివాహము అత్యంత వైభవముగా జరిగెను. వారు కల్యాణమండపములో నున్నప్పుడు స్వర్ణలతాదేవి కుసుమమాలికల రెంటిని గొనివచ్చి దంపతుల మెడలలో నలంకరించెను. సుజాత

# అన్నపూర్ణాదేవి షష్ఠమవార్షికోత్సవము



శ్రీ అన్నపూర్ణాదేవి షష్ఠమవార్షికోత్సవమున కధ్యక్షతవహించిన శ్రీయుత జి. సుబ్బస్వామి చౌదరి యం. యల్. సి. గారు, శ్రీ తోలే నారాయణరావు జమీందారుగారు, దండు నారాయణరాజుగారు, బాపినీడుగారు, వారి సతి శకుంతలాదేవిగారు, కలగర పిచ్చమ్మగారు, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు, దుర్గాబాయమ్మగారు, శ్రీమతి విద్వాన్ అట్లూరి వెంకటసీతమ్మగారు, దామెర్ల కమలరత్నంగారు, యన్. సుభద్రమ్మగారు, ముంషూరి రత్తమ్మగారు, జవ్వాజి రాజరత్నమ్మగారు, చి. ఝాన్సీ, విద్యాలయోపాధ్యాయులు, బాలికలు, మున్నగువారు కలరు.



శ్రీమతి టి. నారాయణఅమ్మగారు, బి.ఏ,
తిరువాన్కూరు సంస్థానమున శ్రీమూలమ్‌సభ—శాసన
సభ—లో సభ్యురాలుగ ప్రభుత్వమువారిచే
నియమింపబడినారు.



శ్రీమతి దిల్‌నవాజ్ బై రంజీకన్య
బొంబాయిరాష్ట్రమున శ్రీమతి లామ్‌సతీమణికి తరువాత
నీకన్యకామణియే, హైకోర్టులో అడ్వొకేటుగా
నిటీవల నమోదైనది. ఈయమ పారసీకయువతి.

స్వర్ణలతామంజరియే తన్ను రక్షించినదని చెప్పి ఆమెకు సాష్టాంగనమస్కారమాచరించెను. వివాహమునకు వచ్చిన జనులందరామెను పరోపకారిణియని పొగడసాగిరి. రమాకాంతు డామెను క్షమాపణకోరెను. సుజాతాదేవి స్వర్ణలతామంజరిని స్వీకరించవలసినదని రమాకాంతుని ప్రార్థించెను. అతడు అంగీకరించెను. కాని స్వర్ణలతాదేవి గృహసౌఖ్యముల నొల్లక బ్రహ్మచర్యము నవలంబించెను. ఆమె పరోపకారమే పరమధర్మమని నిశ్చయించి అనాధశరణాలయము నొకదానిని స్థాపించెను. అహర్నిశలు రోగులకు సేవజేయుటయందే కాలము గడపుచుండెను. స్త్రీలకందరికి పతివ్రతాధర్మములు మున్నగు సద్విషయములు బోధించుచుండెను. అనతికాలములోనే ఆమె కీర్తి జగద్విఖ్యాతమాయెను. సోదరసోదరీమణులారా! సర్వ ధర్మములలోను పరోపకారమే సర్వోత్తమమైనది. ఎవ్వరైతే పరోపకారార్థమై తమ జీవితము వినియోగించెదరో అట్టివారికి ఇహపరములయందు కీర్తి గల్గును. సర్వేశ్వరుడు మోక్షమిచ్చును.



## మురళి

కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు

నిలుపరా! నిలుపరా!!
నీమురళిమృదుగానని ర్ఝరిని యతులనే
నిలుపరా!!! నిలుపరా!!!!
కలగీతిమెలికలలో
కలసిపోయిననేను
మెలితిరిగి మెలితిరిగి
నలిగిపోవుచునుంటి
వేదనచె పటపటా
హృదయతంత్రులు తెగిమె
వెర్రినై పోవుదునో?
నిలుపరా! నిలుపరా!!
యీామహావేదనను యికె వేగలేనురా!
నిలుపరా!!! నిలుపరా!!!!

సరసమగుగీతికతో
కరగిపోయిన నేను
ఏకొండకోనకో?
ఏయరణ్యానికో?
ఏనదీతటముకో?
ఏవిజనసీమకో?
తెలియక నెయతులనె
తేలిపోమెదనోరా!
మరలిరాలేక నే
సురిగిపోమెదనోరా!
నిలుపరా! నిలుపరా!!
నీమధురతరమురళి నిస్వనస్రోతమును
నిలుపరా!!! నిలుపరా!!!!

# మగని చెవిలో—

"అనసూయ"

(మొక్కులగురించి.)

పిల్లలకు మొక్కులు తీర్చాలి, ఎప్పుడేమిటి బయలుదేరుదాం? అవి తీర్చకుండా అశ్రద్ధచేస్తూ ఉండబట్టేవాళ్లకు యిలాగు వదలకుండా ఏదో ఒక చీకాకుచేస్తూనే ఉంది. పిల్లలతో బయలుదేరితే సంరక్షణకు ఎవరని అంటారా? కావలస్తే మా అమ్మను రమ్మంటాను. మా అమ్మవస్తే మరి మనకు పిల్లలపూచీయే అక్కర్లేదు. వంటా పెంటా అంతా అదేచేసి పెడుతుంది. దానిదగ్గర పిల్లలకుకూడా యెంతో చేరిక. దానికికూడా యేదో మొక్కు ఉన్నాదిట, ఆ వెట్టీకూడా తీరిపోతుంది!

ఇందరికి డబ్బు పెట్టుకోలేరూ? మీకూ మీ పిల్లలకూ మీ పెళ్లాముకూ టిక్కెట్లు మీరే పెట్టుకుంటారు గదా! ఇకను ఎటు వచ్చీ మా అమ్మేనా మీకు బరువు! అంత బరువైపోతే నేనే యేదైనా బంగారం అమ్మిపెట్టుకుంటాను లెండి! పోనీ యేం పైదా? మీకు తల్లివంటిది! దానినేం ఉచితముగా ఒక్కరైసీ పంపించి యాత్రలు చేయించమని మిమ్మలిని కోరేనా యేమిటి! మీ పిల్లలను యెత్తుకొని వంటలూ వార్పులూ చేసి చేతులూ మూతులూ కడిగి కూలిపని చేసినందుకు టిక్కెట్లు కొన్నానని మీరు అనుకోకూడదు? పోనీ, ధర్మంచేసేనని అనుకోరాదూ? ధర్మమా! ధర్మానికంటే మీ మనస్సొప్పదే! డబ్బులేకపోతే ధర్మమేమిటా! నే ననేసరికి డబ్బులేని ఘోష వస్తుంది. ధర్మమంటే దానమంటే. యాత్రంటే నోమంటే ప్రాక్టీసులేదనీ, సొమ్ములేదనీ, క్లుప్తముగా కాలక్షేపముచేయాలనీ, డిప్రెషను రోజులనీ, శ్రీరంగనీతులు మొదలు పెడతారు! కాఫీలకి పది పదిహేను రూపాయిలు అయిపోతున్నాయి నెలకు___అది మానగలిగేమా? పిల్లలచేతనైనా మానిపించగలిగేమా? నిన్నను మీ క్లబ్బువాడు వచ్చేడు. మీరేమో బిలియర్డు ఆటబాపతు పదిహేను రూపాయీలు క్లబ్బుకు యివ్వాలట, అడిగేడు. నిజమేనా? 'ఎప్పటిదో పాతబాకీ'యా? ఎప్పటిదో పాతబాకీకాదు. సరి కొత్తదేనట? నేను కనుక్కోకపోలేదు! అరపయ్యోయేట అగ్గిగండమని ఆ ఆట మీకెందు కిప్పుడు? చిన్నపిల్లలాగు ఏమిటా ఆటలు? మీరు చిన్నవాడిని అనే అంటారా! మీకు ముప్పయిమూడోయేడు, ఇంకా మీకు చిన్నతనమా? మీకు ముగ్గురు చిన్నవాళ్లు గదా, ఇంకా చిన్నవాళ్లేనా మీరు? పోనీ, ఆట ఆనుకున్నా యేదో డబ్బు ఖర్చుకాని ఆటలాడితే బాగున్నాది గాని నెలకి యిదో పదిహేనురూపాయిలా! ఈ పేకాటా ఈ గొట్టికాయలాటా మీ గాంధి ఆడమనిచెప్పేడా? ఆ క్లబ్బుకే పోనే

దానికి డబ్బుఉందా? యాత్రకంటే లేదూ? మీ ఖర్చులకన్నింటికీ డబ్బులోపము వుండదు. నేను యీ పండుగకి ఆ పండుగ, ఒకచీర అడిగినా; వెళ్లక వెళ్లక యేదో యాత్ర వెళదామన్నా, 'పొదుపుగా ఉండాలి, పొందికగా ఉండాలి' అని నీతికథలు వెళ్లబోస్తారు!

పోనీయండిగాని, అంత డబ్బులోపమైతే అప్పుచేసి రెండువందల రూపాయీలు ఎందుకు తాలూకాబోర్డు వోట్లకు తగలబెట్టేరు? ఇంతా చేసి గెలిచేరు, ఏమిటిలాభం? ఆ ఖర్చుపెట్టినది మరికొంచెం భారీగాచేసి జిల్లాబోర్డు మెంబరుకే ప్రయత్నం చేయలేక పోయేరూ? దానివల్ల యేమిలాభమూ? ఏమిలాభమో మీకు తెలియదా యేమిటి, లోకమల్లా కోడై కూస్తూవుంటే? బడుబాబులు, పొట్టచీరితే అక్షరం లేనివాళ్లు, వందలూ వేలూ సంపాదించినారట తమ వోట్లకు!

అది నఖారాపనా? మీ ప్లీడరీపనికన్న నఖారాయేమిటి? అబద్ధాలాడడం కాదు, అబద్ధాలాడించడం కాదు, ఒకడికొంప తీయడం కాదు; ఒప్పన్నంప్రకారం ఫీజుపుచ్చుకున్నాను, ఓటిచ్చేను! దానిలో తప్పేమిటి, నఖారాయేమిటి? చుట్టకంపు నాయిళ్లని సక్కుచిక్కుల పట్నాయిళ్లని నాలుగేళ్లు ప్రాణం పుచ్చుకున్నా, రాతిని నారలాగినట్లు లాగినా, రానంతసొమ్ము, అరమినిటుపనికి హాయిగా దొరుకుతూఉంటే మానేసి వెర్రిమొగం వేసుకొని కూర్చుంటే మాత్రం మీరు సత్యహరిశ్చంద్రుల్లు అయిపోతారా? కళ్లజోడు వాకుట! వోటిచ్చినచ్చేను; వాడుంచుకొన్న కరణపుది మొన్నను గజ్జెలవడ్డాణం పెట్టుకొని తిరుగుతున్నది! మచ్చలమొగంవాడి గర్వం భూమీ ఆకాశమూకూడాపట్టలేదుట గదూ! అది వోట్లడబ్బువల్లనేనా? లేక వాళ్లేం మరోమో స్తరుగా యీ నాలుగు రోజులలోనూ ఆర్జించేసేరా? అంచేత వోటుకి లంచము పుచ్చుకోవడము నీచమూ హైన్యమూ యెట్లయిందో చెప్పండి? నేను చెప్పిన మాటకి సమాధానం చెప్పరేం? పట్టుమని పదిరూపాయిలు ఫీజిస్తే, అయినది కాదనీ, కానిది ఔననీ, రాసినది రాయలేదనీ, రాస్తే సొమ్ము ముట్టలేదనీ, చేసిననేరం చేయలేదనీ, యీవిధముగా వాదనలు అబద్ధమని తెలిసి యుండిన్నీ చేయడం, అందుకు తగిన సాక్ష్యము పూటుచేసి తరఫీదుచెయ్యడం, వీటిలో నీచమూ హైన్యమూ లేదూ? వోటు లంచానికన్నా మీ అబద్ధాలఫీజు యేమో స్తరుగా మంచిదో చెప్పండీ!

మన హిందువుల కళ్ళతో—అంటే ఆర్యుల కళ్ళతో చూస్తే, ఇవన్నీ పాపాలే; పడమటి కళ్ళతో చూస్తే బహువిధాలుగా ఉంది. ఈవృత్తి సంగతులు యిన్ని నాకు యెలాగు తెలుసునా? ఆడవాళ్ళకు తెలియనిదేది? మీరు తరుచు అనడమూ లోకులవల్ల వినడమూ రెండుకలిపి చూచుకోండి!

అందుచేత మీనీతి కబుర్లు మానండి! ఉండగలిగేరా మీరుచెప్పే గాంధీలాగు ఉం

డండి! లేదా బురదలోకి దిగితే, బురదలలో
రంగులు, తేడాలు, చూసేదేమిటి? అన్నీ
బురదలే! అంటుకోక మానవు, కంపుకొట్టక
మానవు! బురదలోకి దిగినందుకు లాభ
ముండాలి! అందుచేత, మీ తెలివి తక్కువ
అనండి గాని వోటుకు లంచము పుచ్చుకో
వడం నీచమనకండి. అంతదాకా యెందుకూ?
మీకు రెండువందలరూపాయిలు తాలుకా
బోర్డు మెంబరు పనికి యెందుకు ఖర్చు అయి
నాయి? ఎలాగు ఖర్చు అయినాయి?
వోట్లలో మూడువంతులు డబ్బిచ్చి కొన్న
వేనా? మీరు యివ్వడం గౌరవమేనా, పుచ్చు
కొన్న వాళ్లేనా పాపం? లంచము తిన్న వాడి
దేనా నేరం? యిచ్చినవాడి కేమీ లేదూ?
సానిదాని కేనా పాపం, సరసుడికి లేదూ?

"బాగున్నది యీయెలక్షను లెక్చరు,
పడుక్కోనీ"యా? పడుక్కోండురు గాని
తొందరేమిటి? చెత్తనోవలు పట్టుకొంటే మా
యమై పోయేనిద్ర నేనొకమాట మాట్లాడేనో
లేదో అప్పుడే వచ్చి యెంతట్లో వాలుతుంది?
పడుక్కోవచ్చును గాని అసలు సంగతేదో
తేల్చండి!—అప్పో సప్పో చేసి యాత్రకు
వెళ్ళకతప్పదు: పిల్లల మొక్కులు తీర్చక
తప్పదు! ఎన్నేళ్లున్నా ఉండిపోవడమే గాని
మరొకనాడు మనకి కలిసివస్తుందా యేమిటి?
మీ తాలూకాబోర్డు వోట్లకే మరి రెండువం
దలు ఖర్చు పెట్టే ననుకోండి! రెండునెలలు
పేకాట, బిలియర్డులు, సిగరెట్లు,_ మానేసి
నాననుకోండి! బయలుదేరండి! ఇంతకీ మా
అమ్మను గదా మీరు టిక్కట్టు పెట్టలేక
వెళ్ళలేరు? పోనీయండి, మీరే పిల్లలకు సంర
క్షణచేస్తూ ఉందురు గాని, యాత్రచేసికొని
వెళ్ళిపోవద్దాము!

'మాఅమ్మను తీసికొని వెళదామా,' అం
టారా? చెప్పేదేమిటి, ఆవిడె సాయము దైవ
సాయమే! ఆవిడెకు కూడా చాకిరీ చెయ్యాలి!
పిల్లలిని ఎత్తుకోదు, వంటవండదు, పిల్లలకి
అన్నంపెట్టదు, పాలుపొయ్యదు, మరెందుకు
ఆవిడె సాయం? కావలస్తే దారికడాకూ
పోటుకుమాట లాడడానికిపనికివస్తుంది. అదీ
గాక ఆవిడె బయలుదేరితే అప్పగారు కూడా
తప్పదుకదా! సూదితో దారం బొంత కలం
కారం! ఇక మరి చెప్ప నక్కర్లేదు, యాత్ర
సౌఖ్యమూ, యాత్రఫలమున్నూ! వాళ్లిద్ద
రూ నన్ను నోట్లో పడేసుకొన్న తర్వాత
యాత్ర అయితేనేమి, కాకపోతేనేమి? మొ
క్కులు తీరితేనేమి, తీరకపోతేనేమి? అయితే
వాళ్లకు మాత్రము మీరు టిక్కట్లు పెట్ట
నక్కర్లేదా?—మరి ఆసొమ్ములో సగంపెడితే
మాఅమ్మని తీసికెళ్లవచ్చునే! ఏబాధా
లేకుండా చెప్పిన పనల్లా చేసి చెయ్యికడిగి
అన్నం పెడుతుంది! దాన్ని మానీడ మేమిటి?
వీళ్లని తీసికెళ్ళడ మేమిటి? స్వర్గానికెళ్లి నా
సవతిపోరు తప్పింది కాదన్నట్లు!—వాళ్ళతో
యాత్ర చాలుచాలు! బయలుదేరితే మా
అమ్మతో బయలుదేరుదాం; లేకపోతే
మనమే వెళ్లిపోదాం—మనకు సాయమెం
దుకు? మీరే ఉంటారు అన్నింటికీ!

# ఆరోగ్యబోధిని

## క్షయవ్యాధి

ఆగష్టు 9 వ తేదిని క్వీనుమేరీ కళాశాలలో డాక్టరు ముత్తుగారు క్షయవ్యాధిని గూర్చి యొసంగిన యుపన్యాసములో నీదిగువ యంశము లెంతయు గమనింపదగినవి.

మన దేశములో మసూచికము, మహామారి మొదలగు పెక్కు అంటురోగములు వ్యాప్తియందున్నను, క్షయవ్యాధి యొనరించు చున్నంత వినాశనము మరి యేయంటువ్యాధియు నొనరించలేదు. అత్యసహ్యకరమగు కుష్ఠురోగమువలన సంవత్సరమునకు కొన్ని వేలమంది చనిపోవుచున్నారు కాని క్షయవ్యాధివలన సంవత్సరమునకు 10 లక్షలమంది చనిపోవుచున్నారు. దీనివలన పురుషులకంటె స్త్రీలు యెక్కువమంది పీడింపబడుచున్నారు. నవయౌవనములో పిల్లలను గని పోషించవలసిన స్త్రీల నిది యెక్కువగా పీడించుచున్నట్లు కలకత్తానగరపు జవాబా లెక్కలవలన తెలియుచున్నది. "వైద్యులీవ్యాధి నాపగల్గినచో ఏల యాపరు"రని కీర్తిశేషులగు ఏడవ ఎడ్వర్డు చక్రవర్తిగారు విలపించిరి. వైద్యులకు దీని నాపుట తెలియదా? లేక, తెలిసియు ఆపఁ బూనుకొననంతటి నిర్దయులై యున్నారా? ఇతర దేశములలో వైద్యసహాయ మెక్కువనై దీనివలన మరణించువారి సంఖ్య ఏటికేడేటికి తగ్గుచుండగా మన దేశమున అది హెచ్చుచున్నది. దీనికి కారణములు మన మరయవలయును.

(1) దీనికి ముఖ్యకారణము దారిద్ర్యమువలన కటకటించునట్టియు చాలీచాలనట్టియు పుష్టిదాయకము కానట్టియు ఆహారము. మన దేశీయులు మరబియ్యమును పొట్టూడ్చిన కందిపప్పు రసమును సాధారణముగా తినుచుందురు. స్త్రీలకును ఉన్నత విద్యాకృషియందుండు విద్యార్థులకును ఈ ఆహారము చాలక ఈ రోగము కలుగుచుండును. దంపుడుబియ్యము పొట్టుకందిపప్పు, కూరలు, పాలు, నేయి, మజ్జిగ మొదలగునవి పడకున్నచో వారికి తగిన బలముకలుగదు. ఇట్టి నీరసాహారమువల్లనే మన దేశములో మనుష్యుల సరాసరి ఆయుర్దాయము తగ్గుచున్నది. ఇంగ్లండు దేశములో మానవుని సరాసరి ఆయుర్దాయము 49 నుండి 50 యేండ్లకును, అమెరికాలో 56 నుండి 58 యేండ్లకును, న్యూజీలండులో 65 యేండ్లకును, జపానులో 47 యేండ్లకును హెచ్చగా హిందూదేశములో 25 నుండి 23 యేండ్లకు తగ్గుట యెంతయు శోచనీయము.

(2) ఈవ్యాధికి మరియొక కారణము జనులు నివసించుటకు మంచియిండ్లు లేకుండుట. సూర్యకాంతి ప్రసరించు విశాలమైన ఆవరణము లేకుండు తావులలో నిండ్లుకట్టరాదు. తేమస్థలములు వాసయోగ్యములు కావు. ఇండ్లలోనికి మంచిగాలివచ్చుటకు విశాలమైన కిటికీలుండవలెను. ఇంటిచుట్టు పెంటకుప్ప లుండరాదు. చిన్నయిండ్లలో పెక్కుమంది కాపురము

చేయరాదు. ఇట్టి సూత్రములు పాటింపకున్నచో క్షయరోగములు కలుగుటలో నాశ్చర్యమేమి?

(3) మానవులకు మలబద్ధ ముండరాదు. ఇదియే సమస్తరోగములకు మూలము. దీనివలననే బడలిక, నీరసము, తలనొప్పి, జ్వరము కలిగి క్షయరోగమునకు దించును.

(4) ప్రతిదినము మానవులు స్నానము చేయవలెను.

(5) శరీరమును బిగపట్టియుంచు దుస్తులను దాల్పరాదు. స్త్రీలు ముఖ్యముగ బిగువగు నొడ్డాణములు పటకాలు ధరించరాదు. ఇందువలన కండరములు పెరుగవు. మలబద్ధము కలుగును. అజీర్ణము పెరుగును.

(6) ఘోషాపద్ధతివలన మనదేశములో పెక్కు రోగములు కలుగుచున్నవి. ఆరుబయట స్త్రీలు తిరగవలెను. సూర్యునిలోనుండు అల్ట్రావయొలట్ కిరణములు వారికి తగలవలెను.

(7) అతి బాల్యవివాహములు, యౌవనోదయమునకు ముందు 13, 14 సంవత్సరములలో గర్భమును దాల్చుట, దగ్గరదగ్గర కాన్పులు, వీనివలన క్షయరోగము కలుగకమానదు. పురుషులకు 28 యేండ్ల లోపుల స్త్రీలకు 20 యేండ్లలోపునను వివాహములే చేయరాదు.

(8) వర్ణాంతర వివాహము లత్యావశ్యకములు. లండను తూర్పుకొన వాస్తవ్యులౌ ప్రాంతీయులతోను, పల్లెటూండ్లవారితోను వివాహములు చేసుకొనుచున్నప్పటినుండి వారి వంశములు నిలచి, ఆయుర్దాయములు పెరిగి, బలము హెచ్చి, ఈ రోగము తొలగుచున్నట్లు నిదర్శనములు కనిపించుచున్నవి.

(9) క్షయరోగము రాకుండవలెనన్న మనుష్యుల కాందోళన లేని శాంతజీవనమును కుదుర్చుకొనవలెను. చిత్తమునందలి కల్లోలమే యీ వ్యాధి కొక పెద్దకారణము. విక్టోరియాకాలములో స్త్రీలకు తాము వరించెడి పురుషులను వివాహమాడుటకు సంపూర్ణమగు అవకాశములు లేకుండెడివట. అందువలన క్షయవ్యాధులవచ్చి యెన్నిమందులు వేసినను నిమ్మళింపక మరణించెడివారట. ఈ ఆచారము మారుటవలన వారికి చిత్తశాంతి కలిగి దీర్ఘాయుష్మంతు లగుచున్నట్లు తెలియుచున్నది.

(10) పల్లెటూళ్లలో నివసించుటవలన నిట్టి క్షయవ్యాధి తొలగును. పట్టణవాస జీవనమున పెక్కు ఉద్రేకములు కలుగుచుండును జీవసంఘర్షణ మెక్కువ యగుచున్నందున శాంతముగ నాలోచించుట కవకాశము చిక్కకున్నది. నాడీకూటమున కుద్రేకము కలిగిన జీర్ణావయవములు సరిగా పనిచేయవు.

(11) శరీరమునకు పరిశ్రమయు విశ్రాంతియు కూడ సమానావశ్యకములు. శరీర పరిశ్రమవలన కండరము లెట్లు పెరుగునో విశ్రాంతివలన బడలిక అంత తీరును. పరిశ్రమ యెక్కువయినచో హృద్రోగము కలుగును. విశ్రామము, మౌనములోనే నిజమైన పెరుగుదల యున్నట్లు తోచును.

మౌనములోనే ప్రకృతి తనపనిని చేయుచున్నది. మందుపడుట, మొగ్గలు పెరుగుట, మొగ్గలు వికసించుట మొదలగు పనులెల్లయు నిశ్శబ్దముగానే జరుగుచున్నవి. నిశాసమయమునను యవనిక దించబడగానే కరుణామయియగు నిద్రాదేవి మానవలోకమునకు వచ్చి మనకన్నులను ప్రశాంతముగ మూసివేయును. రాత్రి 8 గంటలయినను నిద్రించనిచో పగటిపూట సరిగా పనిచేయలేము. దీనివలన శాంతియు మౌనము నెంత ఆవశ్యకములో తెలియవచ్చును.

(12) ఈశ్వర ధ్యానమువలన శారీరక మానసిక ఆధ్యాత్మిక దివ్యశక్తులు మనకు కలుగును. శారీరక పుష్టి, అంతరంగ శౌచము, దురాచార నిర్మూలనము వలన జనించు ఆధ్యాత్మిక చింతనము అను, పునాదుల పైననే సౌందర్య బలారోగ్య సౌభాగ్య సౌధమును మనము నిర్మించగలము.

# బాలవిజ్ఞానశాఖ

బొమ్మల పెండ్లి,

తాటియాకుకు కాటుకా బొట్టుపెట్టి
చీరసింగారించి షోకు జేశారు!
గాజుపూసలపేరు మెళ్లో వేశారు
గౌరికల్యాణాల రేఖదిద్దారు!
పానకంబిందెలూ సిద్ధపరచారు
పాపపేరంటాండ్రు కాచుకున్నారు!
లక్కపిడతలో అన్న ముడికిపోయింది

శ్రీ రుక్మిణీనాథశాస్త్రిగారు.

లక్కచట్టిలో పప్పు ఉడికిపోతోంది
పెళ్లికూతురుమామ కట్నాలకోసం
చింతగింజలు లెక్కపెట్టి దాచాడు
ఉత్తుత్తి అలజడీ జరిగిపోతోంది
ఉత్తుత్తి బాజాలు మ్రోగుతున్నాయి
కబురుమీదా కబురు వెళ్లిందికాని
పెళ్లికొడుకులవారు తర్లి రాలేదు!!

పాత పాటలు

ఎంతదొడ్డవాడు యమధర్మరాజు
యిన్నిపనులువిడిచి వెంటరమ్మనెను
పుట్టిన బిడ్డలవిడిచి పుట్టిల్లువిడిచి
పూలవైకుంఠము కలదు రమ్మనెను
కన్నబిడ్డలవిడిచి కాపురంవిడిచి
కలకవైకుంఠము కలదురమ్మనెను. 1

పల్లిదానింటిసరస కల్లుపాకవుంది
పైమీది పంచిచ్చి కల్లుతాగు మరిది
నామీద చాలచాల దయవుంచు మరిది
దగదగ మెరిసేటి దండమ్ముమరిది. 2

చేయికాలంవచ్చి చెట్టెండిపోయె
దానికేమొచ్చిందో మొదలెండిపోయె
అల్లుడికిజ్వరంవచ్చి అత్తయెండిపోయె. 3

కాపురం మంచిది కూటికేలేవు
పెనిమిటి మంచివాడు మాటలేలేవు
కుదుళ్లుచక్కన కుండలులేవు. 4

నేదునూరి గంగాధరంగారు

కథలు

ఆలస్యమనర్థదాయకము

శ్రీమతి కే. శారదగారు

ఒకప్పుడు ఒక గొప్పధనవంతునికి ఏకపుత్రు డుండెను. ఆపుత్రుడు కొంచము దుర్మార్గుడు. ఒక పిల్లనుచూచి తనకు మోహముకలిగి తనయిల్లు విడిచి పెట్టెను. వీడు యిల్లువిడిచి పెట్టెనని తెలిసినతోడనే ఆయువతి అతని సహవాసమును వదలిపెట్టెను. అతనికి చాలా వ్యసనముగలిగి కడాపట ఒక గొల్లవానిదగ్గర మేకలను మేపుచు కాలము గడుపుచుండెను. ఒక దినము ఒక మేక కనపడక పోయెను. అందులకు ఆగొల్ల

వానికి వానిమీద కోపముగలిగి వానిని పనినుండి పొమ్మనెను. ఆయువకుడి కప్పుడు చాలా వ్యసనము గలిగి మరల తన యింటికిపోయి తండ్రితో తన్ను మన్నించమని అడుగుటకు తలచెను. కాని దినదినము వాడు యివేళ రేపు పోదామని నిశ్చయించుకొనెను. కాని ఆసమయము వచ్చునప్పుడు మాత్రము తన తప్పును తలచుకొని పోవుటకు కష్టపడుచుండెను. ఒక దినము యెటులైన పోదామనితలచి యింటికివెళ్లి నప్పుడు తనతండ్రి తాను వెళ్లుటకు రెండుగంటల ముందు ప్రాణమును విడిచియుండెను. తాను యిన్ని రోజులు పోవుటకు కష్టపడిగదా యిప్పుడు తనతండ్రిని చూచుటకు వీలులేకపోయినదని తలచి యిల్లు విడిచిపెట్టి ఒకసన్యాసివేషమును ధరించెను. దీనియందు మనకు తెలిసేదేమనగా మనము ఒకపనిచేయుటకు తలచినప్పుడు మనము ఆపనిని ఆక్షణముననే చేయవలెను. లేకపోతే మనకు కడాపట ఆపదగలుగును.

శ్రీమతి వోరుగంటి శ్యామలాంబగారు

## లబోడాశంఖం

ఓవూళ్లో ఓబ్రాహ్మడుండేవాడు. అతడు చాలా బీదవాడు. ఈ బీదరికానికి సాయం పెళ్లాము, ఆరుగురు పిల్లలున్ను. వీళ్ళకు తిండిపెట్టలేక చాలా బాధపడుతూ వుండేవాడు. కడకు విచారం యెచ్చయింది. నిద్రపట్టడంలేదు. కాళ్లూ, చేతులూ ఆడడంలేదు.

ఓరోజున అర్ధరాత్రివేళ లేచా డీబ్రాహ్మడు. ఒసే! ఒసే! అని పెళ్లాన్ని లేపాడు. పెళ్లాం లేచింది. 'ఏమేంయ్! నాకు దేవుడు కలలో కనపడ్డాడు. జపం చేస్తే డబ్బిస్తానన్నాడు. నేను జపానికి వెళతా. నీవు యింటిపనులు సవరించుకొంటూవుండు' అన్నా డీబ్రాహ్మడు. పెళ్లాం ఊఁ! అంది.

అడవిలో రావిచెట్టునీడను కూర్చొని ముక్కుమూశా డీబ్రాహ్మడు. రాత్రిపగళ్ళు గడచినాయి. కళ్లువిప్పడు—పిలిస్తే పలకడు. ఈ పట్టుదలకు దరొచ్చింది. నడ్డిమీద తట్టిలేపాడు. 'బ్రాహ్మడా! యీ శంఖం నీవు పట్టుకువెళ్ళు' అన్నాడు దేవుడు. 'దీనితో నేనేమిచేయను' అని బ్రాహ్మడడిగాడు. 'ఈశంఖం రోజుకు లక్షరూపాయి లిస్తుంది—హాయిగా ఖర్చుపెట్టుకో' అన్నాడు దేవుడు—ఆహా! అలాగే అని బ్రాహ్మడింటికి పోయాడు మహాఆనందంతో.

అటుపయిన బ్రాహ్మడింట రోజూ సంతర్పణలే. రోజూ సంభావనలే. ఈశంఖ రహస్యం మరో బ్రాహ్మడు కనిపెట్టాడు. ఆబ్రాహ్మడు యీశంఖాన్ని కాజేశాడు. ఈబ్రాహ్మ డింటిదగ్గర లబలబలు ఆరంభం అయాయి. పిచ్చెత్తిపోయా డీబ్రాహ్మడు. మళ్లీ జపానికి పరుగెత్తాడు. జపంచేశాడు. దేవుడుకనిపించి "యీశంఖాన్ని నాజాగ్రత్తచేసుకో యిది మాట్లాడుతుంది." అని మరోశంఖాన్ని యిస్తూ చెవిలో యేదో చెప్పాడు దేవుడు. 'అలాగే బాబూ అంటూ యింటికి పరుగెత్తి, శంఖమా! నాకు పదిలక్షలరూపాయిలు కావాలన్నాడు యీబ్రాహ్మడు. ఈమాట లడిగేటప్పుడు మొదటిశంఖం దొంగలించిన బ్రాహ్మడుకూడా అక్కడున్నాడు. శంఖం అప్పుడు పదిలక్షలుకాదు, యిరవై లక్ష లిస్తానంది. అది యీ దొంగబ్రాహ్మడు విన్నాడు. మొదటిశంఖాన్ని పడేశి, రెండోశంఖాన్ని మెల్లగా చేపట్టాడు. ఇంటికి పరుగెత్తాడు. శంఖమా! నాకు యిరవై లక్షలు కావాలన్నాడు. ఇరవైకాదు నలభైలక్ష లిస్తానంది, శంఖం. రోజూ యీలాగే అడిగిన దానికి రెట్టింపు యిస్తానంటోంది; యివ్వడం కనబడదు. ఏమే శంఖమా! యిస్తాననడమేకాని యివ్వడం కనబడదే—యేమిటీచిత్రం అని బ్రాహ్మడు శంఖాన్ని అడిగాడు.

"అహం లబోడాశంఖోస్మి వదామి నదదామి తే"

'అయ్యో! యెరగవా! నాపేరు లబోడాశంఖం, నావంతు మాట్లాడడమే కాని డబ్బివ్వడం కా'దన్నదీ లబోడాశంఖం.

ఎవరుతీసిన గోతులో వాళ్లేపడతారు.

## నీయిష్టమువచ్చిన దతనికిమ్ము

కవితిలక కంచనపల్లి కనకాంబగారు, విద్వాన్

బృందావనమను పట్టణమున గోపాలుఁడను జమీందారు వసించుచుండెను. అతనియొద్ద మాధవశర్మ యను దివానుండెను. జమీందారును దివానును మిక్కిలి స్నేహముకలిగి యన్నదమ్ములవలెఁ బ్రవర్తించుచుండుటచేఁ జూచుటకు రెండుమూర్తులుగా నున్నారేకాని వారి కాత్మ యొక్కటియే సుమా యని జను లనుకొనుచుండిరి.

ఒకప్పుడు గోపాలరాజునకు వెన్నున రాచకురుపు లేచెను. మాధవశర్మ మిక్కిలి యాతురతతో గొప్ప వైద్యులరావించి చికిత్సఁజేయించెను. కాని యతని కేమాత్రము నెమ్మది కలుగదయ్యెను. అంతకంతకు వ్యాధి ప్రబలమై నిరాశాచిహ్నములు పొడగట్ట సాగెను. గోపాలరాజునకుఁ జిదానందుఁడను నేక పుత్రుఁడు, మిక్కిలి పసిబాలుఁడుకలఁడు. రాజు గారు దివానుని దగ్గఱకుఁబిలిచి "మిత్రమా! నేనిఁక పెక్కుదినములు జీవించునట్లుఁ దోఁపదు. కాల మాసన్నమైనది. గురుమూర్తికరుణచే నాకు మరణ భయములేదు. దాని నానందముతోనే యెదుర్కొను చున్నాను. ఇహమున నీకన్న నాప్తులెవ్వరును నాకు లేరు. నా యనుంగుకుఱ్ఱను నీకప్పచెప్పుచున్నాను. వానినిఁ బెంచి పెద్దవానినిఁ జేయుభారము నీది. నాయావదాస్తిని నీ పరము చేయుచున్నాను. బాలుఁ డెదిగిన పిమ్మట నీ యిష్టమువచ్చినదతనికిమ్ము. సర్వస్వాతంత్ర్యముల నీకొసఁగితిని, ఇదిగో మరణ శాసన"మని వ్రాసియిచ్చి నిశ్చింతమెయి నాత్మాను సంధానముఁ జేసికొనుచుండెను.

కొన్నిదినములకుఁ దరువాత జమీందారు కాలగతి నొందెను. రాజుగారి బంధుగులు కొందఱు బాలునిఁ దీసికొని పోయెదమనిరి. కాని దివాను మరణశాసన విషయము వారల కెఱిగించి బాలుని భారము తాను వహింతుననియుఁ, దక్కుంగలవారల కాస్తి విషయమునగాని శిశువువిషయమైగాని యేలాటి జోక్యమును గలిగించుకొనవలసినది లేదనియు నాటఁజెప్పెను. బంధుగులును జేయునది లేమి నెక్కడివార లక్కడి కేఁగిరి.

చిదానందుఁడును, మాధవశర్మ శిక్షయందుఁ బెరిగి పెద్దవాఁడయి విద్యాబుద్ధుల నేర్చికొనెను. యుక్త వయస్సు రాఁగా నతఁడు దివానుని ఆస్తివిషయమై ప్రశ్నించెను. అంతట మాధవశర్మ మరణశాసనమును దెచ్చి "నా కిష్టమువచ్చినది నీ కొసఁగునట్లున్నది, చూడుము. ఏబదిలక్షల యాస్తికలదు. నిన్ను బ్రాణ ప్రదముగఁ బెంచి విద్యాబుద్ధులఁ జెప్పించితిని. నీకొక లక్షనిచ్చెదను. పెద్దవాడవైతివి. నీదారి నీవు చూచు కొనఁగలవు."అని పలికి తటాలున లోనికిఁబోయెను.

కుమారుఁడు చేయునది లేమి నివ్వెఱపడి "ఔరా! కంచెయే చేనుమేసిన నిఁక దిక్కెవ్వరు? నన్ను వృద్ధికిఁదెచ్చిన నా తండ్రియొక్క మిత్రునికే యిట్టి దుర్బుద్ధిపుట్టె. ప్రాణమిత్రులనైన ధనము పగవారినిఁ జేయునుగదా! కలికాలమహిమ. భరతభూమియందు ధర్మము నశింపలేదు. న్యాయాధికారికడకేఁగి విషయ మును దెలిపి చేయఁదగిన ప్రయత్నమునకు లోపము లేకుండ నొనర్చెద." అని తలపోసి రామమూర్తి యను న్యాయాధికారి యొద్దకేఁగి తన యాస్తివిషయ మైన యక్రమమును విన్నవించెను.

న్యాయాధికారియు శాసనమును బరికించి నవ్వుచు "కుమారా? ఈశ్వరుఁడు నీ పక్షమున నున్నాఁడు. భయపడకుము. నేను దివానునిఁ బిలిపించి కార్య మును జక్కఁజేసెదను.'' అని వచించి మాధవశర్మను రాఁబనిచి యాతనివలన జరిగినదంతయు విని "ఓయీ మరణశాసనము న్యాయముగ నేయున్నది. నీకొఱకై నిలువ యుంచుకొనిన నలువదితొమ్మిదిలక్షల యాస్తి నాతని కిమ్మనట్లుకదా యున్నది. "నీ కిష్టమైన దానినే యాతని కీయవలయును. నీకర్థము కాకున్న మాబోటివారల నడుగరాదా!" అని మందలించెను. దివానునకు గుండెలు ఝల్లుమనెను. మనస్సును జిక్క బట్టి తన కృతఘ్నతకు సిగ్గుఁజెంది పశ్చాత్తప్తుఁడై మాధవశర్మ ఆస్తినంతయుఁ జిదానందునకిచ్చి యేరికిని గనఁబడక యెచ్చటికో పోయెను.

గోపాలరాజుగారి యాత్మజుఁడు మేధావియగు నొక్కని దివానుగ నియమించి యాతని సహాయమునఁ దండ్రినిఁబోలి పాలించుచు సుఖంబుననుండెను.

## చిత్రప్రశ్నలకు సమాధానములు

అగస్టుమాసపు సంచికలో ప్రకటించిన శ్రీమతి కంకిపాటి రుక్మిణమ్మగారి చిత్రప్రశ్నకు 'శకుంతల' యని యు సేకులు వ్రాసినారు. సోమయాజుల వెంకటాచలశాస్త్రిగారి ప్రశ్నకు ఈ దిగువ వదహరింపబడిన సమాధానములను పెక్కురు వ్రాసినారు.

(1) కైపుకై (2) లోయలో (3) కటిక (4) చరస (5) తర్వాత (6) వటువ (7) విరివి (8) పల్లవ.

## సమస్యాపూరణము

సెప్టెంబరు సంచికలో ప్రకటింపబడిన సమస్య నీదిగువ వివరించిన విధమునఁ గొందరు సోదర సోదరీమణులు పూర్తిచేసి పంపినారు.

ఉ॥ మాచెలిపెంచినట్టి యభి। మానముజూడక రక్కసీవు చే
సాచియొకింత నీప్రసవ। సంతతిముట్టిన నోగులాబిమో
కా! చలమేలనే? సహజ। కంటకి, మూడుదినాలె కానినీ
పూచినపూలు పండ్లగునె। భూస్థలినేగతి రిత్తవోవకన్.

ఉ॥ తోచదు, నామనోహరుని। దోడ్కొని వచ్చెదనంచుఁబోయి యే
లాచెలిరాదు, నాదగు ల। లాటమునన్ విధియేమివ్రాసె, నే
నోచిననోము లేమగు, మ। నోరథముల్ కొనసాగి యుంక నా
పూచినపూలు పండ్లగునె। భూస్థలి నేగతి రిత్తవోవకన్.

ఉ॥ నీచుడు పుత్త్రఘాతు డవి। నీతుడు ప్రాణియటంచుఁ జంపగా
జూచెదు ప్రాణనాథ, గురు। సూనుడు విప్రు, డవధ్యు; డన్యనిం
దాచరణంబదేల? ద్రుప। దాత్మజ ప్రార్థనపాపవల్లికన్
పూచినపూలు పండ్లగునె! భూస్థలినేగతి రిత్తవోవకన్.

—కోరిమిల్లి వీరసోమ సత్యనారాయణ.

ఏచిరుకంకణంబయిన నెట్టులో ముత్తెపుచిప్పలోనికిన్
తా చనునంత ముత్తెమవు; భారుణినెన్నియొ వర్షధారలెం
తే చిరకాలమైపడవు? ఏదియు ముత్తెముగాగమారెనే?
పూచినపూలు పండ్లగునె భూస్థలినేగతి రిత్తవోవకన్॥ శ్రీ॥ వేంకటావధాని.

లేచినతీవకన్నియలు లేచినయప్పుడె కోపగించినన్
జూచినగల్వచేడియలు జూచినయప్పుడె మోముద్రిప్పినన్
వైచినమోహపాశములు బాలికలప్పుడె బుచ్చిత్రెంచినన్
పూచినపూలు పండ్లగునె భూస్థలి నేగతి రిత్తవోవకన్॥ —కమల.

రాచకుమారులెల్ల గదసరంగమునన్ దెగటార్చి భీమనా
రాచరుచిన్ గురుండు గనులాగునొనర్చి దివంబుకేగగా
శోచనమందనేల భవనూనికిన్ విజయుఁడ, నెట్టివో
పూచినపూలు పండ్లగునె భూస్థలినేగతి రిత్తవో వకన్॥ —పశెం లక్ష్మాంబ.

ఉ॥ వేచినవి త్తనంబు లిలవేసిననుద్భవమందనేర్చునే
లోచనగోళముల్ సెడ విలోకనశ క్తిజనించునే తగన్
నీచులపీరభాషణలు నీరసమై చెడిపోవునట్టులే
పూచినపూలు పండగునె భూస్థలి నేగతి రిత్తవోవకన్. సి.వి. రుక్మిణీదేవి.

ఉ॥ నోచగ నొక్కగర్భమున నొప్పగపుత్రు లడెందరుండినన్
చూచిననందులోన గడుగూర్చిన సుహృదులొక్కరిద్దరే
సోచరితుంద్రుపేరెయన సార్థకమందుదు రంతియేయగున్
పూచినపూలు పండ్లగునె భూస్థలి నేగతిరిత్తవోవకన్॥ పా॥ శ్రీలక్ష్మీకామేశ్వరి.

ఉ॥ యోచనచేయగా నలమహాత్ముని బోలిన పుణ్యపూరుషుల్
ఆచలసేత్తి మాచలము నంతటగాంచిన నొక్కరిద్దరే
చూచిననిట్టివారరుదుసూ క్షితినంతట నెందుగాంచ నౌ
పూచినపూలు పండ్లగునె భూస్థలి నేగతిరిత్తవోవకన్॥ పాకల చంద్రకాంతామణి.

ఉ॥ మేచకమేఘపాళి పుశమింగురుపించెడి వర్షబిందులం
దేచిలుచుక్కలోగను మణిత్వ; మనేకములౌ తదన్యముల్
నీచపుచావుజచ్చునవనిన్; భగవత్కృపలేకపోయినన్
బూచినపూలు పండ్లగునె; భూస్థలినేగతిరిత్తవోవకన్॥ పి. పద్మరాజు.

ఉ॥ పూచిమనోజ్ఞమారశరపూజ్యతనొంది ఫలించి లోకజం
హ్మాచితి మాధురీరుచిరసాంకితమాత్రమునై తి; మల్లికా!
నీచవియేమి? మారునకు నీవునుకోలవుగాదె? యంతె, నీ
పూచినపూలు పండ్లగునె భూస్థలి నేగతిరిత్తవోవకన్॥ యేమూరి వెంకటేశం.

## ప్రశ్న

శ్రీమతి పాకనాటి లక్ష్మీకామేశ్వరిగారు

సీ॥ కోటకీవలనుండి కాపాడునదియేది స్వల్పమంచును అర్థమానదేది
దేనిచే జనులెల్ల తీర్థముందీతురు పదమేది ముల్లంచు బరగుచుండు
పట్టువస్త్రము దెల్పు పర్యాయపదమేది తండులంబులు దేవ శుభ్రపడును
యత్యవసరంబిది యనుచు దెల్పునదేది యరిపాదమునునుండు అంగమేది

తే॥ గీ॥ మొనిమిదికిజూడ మూడేసియక్షరములె
యీవలావల జూచిన నేకవిధము
దీపనుత్సాహముంగల్గు యువిదలెల్ల
దెలుపప్రార్థింతు సోదరీసములమిమ్ము॥




బడిపంతులు:—ఒరే! ఎల్లయ్యా! ప్రపంచంలో నీళ్లెన్ని పాళ్లు, భూమెన్ని పాళ్లురా?

ఎల్లయ్య:—నీళ్లు మూడుపాళ్లు భూమి ఒకపాలండీ.

పంతులు:—ఈరెండు కలిస్తే ఏమవుతుంది.

ఎల్లయ్య:—బురద.

## తెలియనితనం

నూతనముగా కాపురమొచ్చిన ఓఅరవావిడ యింటి యజమానురాలగు ముసలావిడవద్దకొచ్చి "పాటీ! యిడిక్కె రొంబ కష్టమాయిరుక్కు. కొత్త బులక్కె కొడుక్కురీరా? (అవ్వాదంచుటకు చాలా కష్టముగానున్నది కొంచెం తోకలి నిచ్చెదరా)

"యేమిటాగొడవ సరీగాచెప్పు. అర్థంతెలియ కుంటా"

"అప్పడియానాల్ యిందవీట్టిలిరుప్పదు రొంబ కష్టం. కట్టాయం నీంగ కొడుత్తాన్ తీరవేండుం." అంది అరవావిడ.

(అటులయిన ఈయింట్లోనుండుట చాలాకష్టము తప్పక మీరిచ్చితీరవలయును.)

"యికనే పూరుకోనునుమా? జాగ్రత".

"యెన్నపాటీ! అవ్వళవు కోపమాయ్ పార్కి రీర్. మాసంపిరంబాల్ వాళిక్కె రూపాయి వాంగు రీరే?" (యేమి అవ్వా! అంతకోపముగా చూస్తారు. నెలపుట్టినదే అర్ధ రూపాయిలుమాత్రం తీసుకుం టారే?) అంది అరవావిడ.

"కోపంతో, యేమిటిరూపాయిలు గీపాయిలని మాట్లాడుతావు. వాఓలికి యేముంది" అంది.

"ఆమామ్, అదుదాం, అదుదాం!"

(అవును అదేఅదే) అంది అరవావిడ.

—సి. కమలాబాయి.

గ్రంథకర్త:—"మొగుడు పెళ్ళాం దెబ్బలాడుకోడం గురించి నేనువ్రాసిన నాటకం మీరుచూచేరా"

పొరుగువాడు:—"నేను, చూడలేదుగాని మీరు మీ భార్య ఆనాటకం ఆడేదనిమాత్రం విన్నాను."

♦ ♦ ♦

ప్రయాణీకుడు:—"నేను మూడుగంటల బండికి అందగలనా?"

రైల్వేఉద్యోగి:—"ఆసంగతి నీ పరిగెత్తడంపట్టి ఉంటుంది. పావుగంటక్రిందటే బండికదలిపోయింది."

♦ ♦ ♦

తల్లి:—"నాయనా! ఏం చేస్తున్నావురా?"

కొడుకు:—"ఏంలేదే! యివాళ నేను స్కౌటులలో జాయిన్ ఐనానే? స్కౌటు మంచిపనులను చేయమని బోధిస్తుంది. అందుచేత మన ఎలుకల బోనులో రాత్రిపడ్డ ఎలుకను ఆకలితోనున్న మన యింటిపిల్లికి ఆహారంగా వేస్తున్నాను."

♦ ♦ ♦

సత్యవాది:—ఈ ప్రపంచకమంతా దగాకోరులతో నిండియుంది. ఇవాళ ప్రొద్దున్న పాలవాడు దొంగ రూపాయి నాకిచ్చి వెళ్లిపోయేడు.

సత్యవాణి:—సత్యవాదీ! ఏది ఆరూపాయి.

సత్యవాది:—అప్పుడే అది కాఫీక్లబ్బులో మార్చేసేను.

♦ ♦ ♦

ఒక జమీందారు సాయంకాలపు షికారునకు వెళ్లి వెత్తితనుపత్రి వద్దకువచ్చేడు. అతనికి లోపలికి వెళ్లాలని బుద్ధిపుట్టింది. గేటువద్దనున్న నౌఖరును చూచి జమీందారు—'నేను జమీందారుని, నాకు లోపలికి .........' మాట పూర్తికానిదే నౌఖరు—"స్వాగతము" అయ్యా! "మీలాంటి జమీదారులు డజను మంది యిక్కడ ఉన్నారు" అనెను.

# పాకకళ

## —చెన్నపురి చంద్రకళా—

గోధుమపిండి స్వంతముగ తయారుచేసినదిగాయిన మిక్కిలి శ్రేష్ఠము. అంగడులలో దొరకునది అంత శ్రేష్ఠమైనది కాజాలదు. అంత రుచికరముగను వుండజాలదు. కావున మంచి గోధుమలను దెచ్చి పిండిచేసి పూరీలవలె అప్పడములుగా తయారుచేసి. పంచదార, తీయకోవబిళ్లలు, బాదంపప్పు, ద్రాక్షపండ్లు, చారపప్పు, కిస్తాపప్పు, ముంతమామిడిపప్పు, వీటినన్నిటిని నూరి, కొంచెముతీసి తయారుజేసిన అప్పడములో బెట్టి పైన దానితోనే మూతమూసి నేతిలోవేసి వుపయోగింపవలెను. మిక్కిలి రుచిగానుండును.

—శ్రీమతి, యమ్. అనసూయ.

## —మాల్ పూరీ—

అరవీసె మైదాపిండితెచ్చి ఒకపాత్రలోవేసి దానిలో కొంచెము మిఠాయిరంగువేసి నీళ్లతో చిక్కగా కలుపవలెను. కొంచెము సోడాఉప్పు, ఏలకులపొడి దానిలో కలుపవలెను. పొయ్యిమీద జిలేబీకళాయి (లోతులేనికళాయి) పెట్టి దానిలో నెయ్యిపోసి సలసల మరగిన తరువాత చిక్కగా కలిపిన మైదాపిండి గరిటెతోతీసి అట్టుమాదిరిగా పోయవలయును. (మామూలు లోతుకళాయి ఉపయోగించిన పూరీ ముద్దకట్టి పాడగును.) పూరీ ఎఱ్ఱగా వేగనీయవలయును. ఇంతకుముందు ఒకఅరవీసె పంచదార లేతపాకముపట్టి ఉంచుకోవలెను. వేగిన పూరీలను ఈపాకములో వేయవలయును. తరువాత వానినితీసి రెండు చట్టముల మధ్యపెట్టి అరికెలు నొక్కునట్లు నొక్కవలెను. అదియే తినుటకు సిద్ధముగానున్న మాల్ పూరీ.

—యశోదాబాయి.

## —చంద్రకాంతలు—

మొట్టమొదట పెసరపప్పు నానబెట్టి పప్పునానిన తరువాత రోటియందుబోసి మెత్తగా రుబ్బవలయును. మెత్తగా మెదిగినపిండి గిన్నెలోనికితీయవలయును. అది అటులుండనిచ్చి మఱియొకగిన్నెలో బెల్లము మెత్తగా తరిగిపోసి ఆబెల్లముపైన రుబ్బిన పిండిముద్ద ఉంచి పొయ్యిమీద పెట్టవలయును. పిండియు బెల్లము కలిసి కుతకుత ఉడుకుతూఉన్న సమయాన గరిటెతో కలుపుతూ ఉండవలయును. అపుడు పాకములాగ గట్టిపడును. తరువాత నున్ననిపీటకి నేయిరాచి ఆపిండి పీటపైవేసి సమానముగా చేయవలయును. అది చల్లబడినచో చిన్నముక్కలుగా కోయవలెను. ఆకోసినముక్కలను మసమస కాగుచున్న నూనెలోగాని, నేతిలోగాని వేసి కొంచెముగా ఉడికించినచో ఎఱ్ఱరంగువచ్చును. వీనినే చంద్రకాంతలు అందురు. ఇవి తినుటకు చాల రుచికరముగానుండును.

—చదలవాడ రాఘవమ్మ.

## —రవ్వసేమియా యిడ్లీ—

గోధుమరవ్వలో పెరుగుబోసి గరిటజారుగాకలిపి కొంచెము నానబెట్టవలెను. ఇందు సేమియాను వేయించి కలుపునది—

పిమ్మట ఇడ్డెను పాత్రలో ఇడ్లీమాదిరిగానె గుంటలలో ఆపిండినిపోసి, ఆవిరిమీద ఉడికినపిదప దించుకొనునది—

## —ఇడ్లీపచ్చడి—

శనగపిండిలో పెరుగు పలుచగాకలిపి తాలింపు పెట్టి, ఉప్పు కలుపునది—

ఈపచ్చడితో, ఇడ్లీలో నేయివేసికొని భుజింప రుచికరము.

# హరిజనాభ్యుదయము

## వసతిగృహములు.

వసతిగృహము లోకరీతి గురుకులముల వంటివి. అందువసించు బాలురను మేనేజరులనుకూడ వసతి గృహములకు కావలసినవంట, యూడ్చు, పాకీపని సమస్తమును తామే యొనరించుకొనవలెనుగాని ఇందు కొరకు జీతగాండ్రను జీతకత్తెలను నియమించిచేయించు కొనరాదు. ఈ పనులలో న్యూనతకలదనియు, ఇందువలన విద్యకుభంగము కలుగుననియు కొందరు తలచి ఇట్టిపనులకు జీతగాండ్రను నియమించు గృహములు కొన్ని లేకపోలేదు. ఈ అభిప్రాయములు సరియైనవి కావని మహాత్ముడు హరిజన పత్రికలో వ్రాయుచున్నాడు. మేనేజరులే మొదట ఈ పని చేయుటను ప్రారంభించినచో విద్యార్థులిట్టి పనులు చేయుటను న్యూనతగా తలచక ఉత్సాహముతో పాల్గొందురు. మరియు ఇట్టిపనులవలన చదువునకు భంగము కల్గుటకుబదులు చదువుసార్థక మగుననియు, వారి ఆరోగ్యము వృద్ధియగుననియు, ఖర్చు తక్కువగుననియు ముఖ్యముగా హరిజన వసతిగృహముల వారీసూత్రము ప్రకారము వర్తింపవలెననియు వారు వ్రాయుచున్నారు.

## సబర్మతీ ఆశ్రమము.

పూర్వము సబర్మతీ సత్యాగ్రహాశ్రమముగా నుండిన యిండ్లు యిప్పుడు హరిజన సేవాసమితివారి పరము చేయబడినవి. కొన్ని నిబంధనలకు లోబడి యిందు హరిజన కుటుంబములు వాసము చేయుచుండును. హరిజనబాలుర వసతిగృహ మొకటి యుండును. ఇంకను సవర్ణులుకూడ చేర్చుకొనబడుదురు. చర్మ పరిశ్రమనుగూర్చిన సాంకేతిక విద్యాలయ మిందు నెలకొల్పబడును. చర్మములను ఒలుచుట, చక్క చేయుట, వివిధవస్తువులుగా కుట్టుట యిందు నేర్పబడును. అఖిల భారత హరిజన సేవాసంఘమునకుగాని గుజరాతు రాష్ట్రీయ హరిజన సేవాసంఘమునకుగాని రెండింటికినిగాని ఇది ప్రధాన కార్యాలయమై యుండును. బిర్లా ఠక్కరుగార్లు మరిముగ్గురు అహమ్మదాబాదు వాస్తవ్యులును కలిసి ఒకసంఘముగా నేర్పడి, కావలసినచో మరికొంతమంది సభ్యులను చేర్చుకొని యీ భవనములను స్వాధీనము చేసుకొని పైకార్యక్రమమును ప్రారంభింతురు. ఈ యిండ్లతో పాటు 100 యకరములభూమి సామానులుకూడ యీ సంఘమువారికి సంక్రమించుచున్నది. 100 హరిజన కుటుంబములు దీనివలన జీవించవచ్చును. ప్రస్తుతమున్న నేతకర్మాగారములుకూడ వీరివశము గావింపబడెను. మున్ముందిది ప్రధాన హరిజనక్షేత్రమై మహాత్మునకు హరిజనుల యెడలగల ప్రేమకు శాశ్వతచిహ్నమై అలరారగలదు.

## సాండూరు సంస్థానము—

### అస్పృశ్యతా నిర్మూలనము:—

బళ్లారిజిల్లాకు సమీపమునున్న సాండూరు సంస్థానమున కధీశుడు తన సంస్థానమున అస్పృశ్యతను నిర్మూలించుటకు మిక్కిలి యోచించెను. కాని అతనికి బలవంతముగ నెట్టిమార్పును ప్రవేశపెట్టుట కిష్టము లేక ప్రజాభిప్రాయ మెట్లున్నదో కనుగొనుటకొక కమిటీని పెట్టెను. వారుచేసిన సిఫార్సులపైని 17-11-1932 తేదిని ప్రభువుగారొక ప్రకటన గావించెను. బావులను వైద్యశాలలను, పాఠశాలలను హరిజనులెట్టి యభ్యంతరమును లేక యుపయోగించుకొనుటకీ ప్రకటన సహాయపడినది. మరియు ప్రకటన ప్రకారము సంస్కారము వడివడిగ సాగించుటకొక స్థాయీసంఘము నేర్పరచబడినది. ఈ ప్రకటన ప్రకారము హరిజనులు దేవాలయములలో ప్రవేశించి దైవారాధనము చేసికొనుటకు కూడనెట్టి యభ్యంతరము నుండరాదు. అయినను హరిజనులను తరతరములనుండి వచ్చుచున్న భీతి ఆవరించి దేవాలయములలోని కడుగు పెట్టలేకుండ జేసెను. స్థాయీ సంఘమువారీభయమును నివారించి 7-8-1933 తేది శ్రీకార్తీకస్వామి వారి పగోడాలో ప్రవేశపెట్టి దైవసందర్శనము చేయించిరి. శాంతికెట్టి భంగమును కలుగలేదు. పవిత్రత యేమియు చెడలేదు. యాత్రికులు మునుపటివలెనే తండోపతండములుగవచ్చి దర్శించిపోవుచున్నారని హరిజన పత్రిక వ్రాయుచున్నది.

# ఆంధ్రమహిళాసభలు

కృష్ణామండల మహిళాసభ మాజవీడులో శ్రీ రాజా వారి హైస్కూలులో సెప్టెంబరు 30-వ తేదిని జరిగినది. శ్రీమతులు గుమ్మిడిదల దుర్గాబాయమ్మ అల్లూరి సీతమ్మ గుర్లపాటి రాజేశ్వరమ్మగార్లును ఇతరులును విచ్చేసిరి. పట్టణములో నిజమీందారుకుటుంబములలోని రాణీగార్లందరునుకూడ విచ్చేసిరి. 200 మంది సభ్యులు సమావేశమైరి. ఖద్దరు, హరిజనసేవ, హిందీ మున్నగు జాతీయ విషయములనుగూర్చి స్త్రీలు శ్రద్ధాన్వితులై పనిచేయవలెనని ప్రబోధము సల్పఁబడెను.

◆ ◆ ◆

27-9-33 తేదిని శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు 9 గంటలవేళను వేటపాలెములో సరస్వతీ ధ్వజమునెత్తి మహోత్సవమును జరిపినారు. గ్రంథాలయముల ఆవశ్యకత, మాతృభాషారాధనములనుగూర్చి ఆమె మనోరంజకముగ ఉపన్యసించెను. పిమ్మట నాంధ్ర మాతృస్తవము మంగళాచరణము జరుపఁబడెను.

◆ ◆ ◆

బాపట్లలోగల శ్రీహితైషిణీమండలి ఆంధ్రదేశమునందలి మహిళా సంస్థలలో నెల్ల విశేషముగు చురుకుతనముతో పనిచేయుచున్నదని, ఆ మండలి తరఫున సెప్టెంబరు నెలలో జరిగిన అసంఖ్యాకములగు సభలవలన విశదము కాగలదు. 4, 5, 6, తేదిలను శ్రీ కోరంకి వేంకటరామశర్మగారు భాగవత తత్వమును గూర్చి యుపన్యసించిరి. 12వ తేదిని శ్రీకృష్ణావతార ఘట్టమునుగూర్చి ఎస్.ఎ. పంచాపగేశయ్యరు శ్రీమతి శిష్టా లక్ష్మమ్మగార్లుపన్యసించి శ్రీకృష్ణజయంతి నతి వైభవముగా జరిపిరి. 21వ తేదిని రామమోహనుని శతవార్షికోత్సవ ప్రచారసభను - జరిపి శ్రీమతి జ్ఞానాంబగారుపన్యసించిరి. మరియు శ్రీమతి మన పాకం కమలమ్మగారు స్త్రీలు—భీమావ్యాపారము అను విషయమునుగూర్చి యుపన్యసించిరి. 22వ తేదిని శ్రీ॥ శ్రీ॥ అనీబిసెంటు స్మారకసభ జరిపి ఆమె గుణగణములనుగూర్చి శ్రీమతులు శిష్టా లక్ష్మమ్మ కనపర్తి వరలక్ష్మమ్మగార్లుపన్యసించిరి. 26వ తేదిని దసరా ఉత్సవములు జరిపి బాలికలకు స్వదేశీ బొమ్మలను గూర్చియు స్త్రీ విద్యనుగూర్చియు, నగలనుగూర్చియు, దేవీనవరాత్రులను గూర్చియు మంచి నీతికథలు వివిధ నారీమణులచే చెప్పబడినవి. వ్యాసములు చదువబడినవి. 27వ తేదిని రామమోహనుని శతవార్షికోత్సవసభను దసరా ఉత్సవములను కలిపి మరియొక సభజరిపిరి. ఇట్లువచ్చిన అవకాశమును దేనినికాని జారవిడువక స్త్రీలకు ప్రబోధమును కలిగించుచున్న స్త్రీ హితైషిణీమండలి వారిని ఏతన్మండలకార్యదర్శి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిని యెంతయు అభినందించుచు, ఇతర మహిళాసంస్థలీయుదాహరణము ననుకరించవలెనని హెచ్చరించుచున్నాము.

◆ ◆ ◆

విశాఖపట్టణములో శ్రీ గాంధి నవరాత్రుల ఉత్సవము మనోహరముగ జరిగినది. శ్రీమతి గుండుమళ్ల రంగనాయకమ్మగారీయుత్సవమును తమ గృహమునందు ప్రారంభించిరి. మహాత్ముని పటముతో తిరువీధి యుత్సవము, సత్యనారాయణ వ్రతము, పురమందిరములో బహిరంగసభ, కద్దరువిక్రయము, నగరసంకీర్తనము, కరపత్రముల పంపకము మొదలగు కార్యములెన్నియో ఆనవరాత్రములలో జరిగినవి.

◆ ◆ ◆

తూర్పు పడమర గోదావరి మండలముల మహిళాసభ శ్రీమతి సారంగు సీతాదేవిగారి అధ్యక్షత క్రింద

23-9-1933 తేదిని జయప్రదముగ జరిగెను. శ్రీమతి పి. ఇందిరాబాయి బి. ఏ. గారాహ్వాన సంఘాధ్యక్షురాలు. ప్రేక్షకులకును ప్రతినిధులకును ఉచితభోజనములు, వసతులు. పేరుపొందిన దేశసేవికారత్నములెల్లరును సభనలంకరించిరి. సభాభవనము క్రిక్కిరిసియుండెను. నిర్బంధప్రాథమికవిద్య, పాఠశాలలలో నీతిమతబోధనము, దేశీయపరిశ్రమలు, శారదాబిల్లు, ఘోషాపద్ధతినిర్మూలనము, శిశుపోషణము, గర్భాధాన వయోనిర్ణయము, శ్వేతపత్రవిమర్శనము, కన్యావర శుల్కములు, విధవా వివాహములు, నిమ్నజనోద్ధరణము, వివాహ విచ్ఛేదము మొదలగు నంశములను గూర్చి 20 తీర్మానములు చేయబడినవి

◆ ◆ ◆

"రానురాను క్షీణించిన స్త్రీల గౌరవస్వాతంత్ర్యములు మరల నిలువబెట్టుటకై విద్యావ్యాప్తి స్త్రీలోకమున ముఖ్యఅవసరము. విద్యావ్యాప్తి కావలెనన్నచో ఘోషాపద్ధతి రూపు మాపవలసియున్నది. బాల్యవివాహ నిరోధ సాధనమగు శారదాచట్టము అమలులోనికి తెచ్చిన యెడల వితంతు వివాహసమస్యయే అంతరించును. బాల్యవివాహములును వృద్ధపురుష వివాహములును రూపుమాయువరకు, కన్యాప్రాయమున భర్తల గోల్పోయిన అబలలను శాశ్వతముగా విధవల జేయుటకంటె పునర్వివాహము చేయుటకు స్త్రీలతోబాటు పురుషులుకూడా అంగీకరించుట ధర్మమగును. వివాహాది కార్యములందు మూర్ఖతయు ఛాందసమును పూర్వాచార పరాయణులనుండి తొలగినగాని, సంసారజీవయాత్రకు అనుకూలముకాని దాంపత్యనిర్బంధములు జ్ఞానమురాని కన్యలపట్ల అంతరింపజాలవు. అట్లు అధర్మముగా దాంపత్యమును గూర్చినప్పుడు విధిలేనిచో భర్తలను విడుచుటకు హిందూస్త్రీలకు విడాకులు (Divorce) మొదలగు హక్కులకొరకు పాటుపడుచున్న సర్ హరిసింగుగౌరు గారికిని, సర్ హరవిలాస శారదా గారికిని స్త్రీ సంఘమువారు వందనము లర్పించుచున్నారు. హిందూధర్మశాస్త్రము ప్రకారము తండ్రియొక్కయు భర్తయొక్కయు ఆస్తియందు హక్కులేకున్నను స్త్రీలకట్టి హక్కును కలిగించుటకు ప్రయత్నించుచున్న జయకరు గారికి సహస్రవందనము లర్పించుచున్నాను. ప్రజోపయోగ సంస్థలయందు స్త్రీలు అధికముగ పాల్గొని, స్థానిక పురోవృద్ధి కార్యములయందు నిమగ్నులయినగాని, జాతి, కుల, మత, కలహములకు తావైన మనదేశము అభివృద్ధికాదని అందరు ఇప్పుడిప్పుడు గ్రహించుచున్నారు.

స్త్రీస్వాతంత్ర్య మనగా పురుషుల అగౌరవపరచుటయని కొందరు పురుషులింకను నిరసనభావము చూపించుచున్నారు. హిందూసాంప్రదాయములను, గౌరవనీయమగు పూర్వసిద్ధాంతములను, స్త్రీస్వాతంత్ర్యముతోడను భారతీయ ఆత్మతత్వముతోడను సమన్వయపరచి గృహజీవనమునకును, సంసారసౌఖ్యమునకును, లోక మర్యాదలకును, లోపములేకుండ, స్త్రీజనసామాన్య అజ్ఞానాది పిశాచములను పారద్రోలుటయు పురుషులతోపాటు గౌరవమైన బహిరంగ జీవనమున పాల్గొనుటయు స్త్రీలకు విధి."

(పైసభ ఆహ్వాన సంఘాధ్యక్షురాలు శ్రీమతి పి. ఇందిరాబాయి, బి.ఎ. గారి ఉపన్యాసమునుండి.)

◆ ◆ ◆

"మనము యిప్పుడు, ముఖ్యముగా సంపాదించవలసినహక్కు ఏమనగా, సంఘవిషయములలోను, మతవిషయములలోను రాజకీయ విషయములలోను, పురుషులు అనుభవించుచున్న హక్కుబాధ్యతలు, స్త్రీలకు కూడ ఉండవలెననితీర్మానించుట. సంఘ విషయమైన హక్కుబాధ్యతలలో మొదటిది, స్థిరచరాస్తులకు సంబంధించిన విషయము. రెండవది, వివాహమునకు సంబంధించిన విషయము. స్త్రీవిషయములో పురుషులకు సర్వస్వాతంత్ర్యము కలుగజేసి, స్త్రీలకు అట్టి స్వాతంత్ర్యము, హక్కు, లేకపోవుట న్యాయమైన పద్ధతికాదని నాకు తోచుచున్నది. పురుషులకు మాత్రము అట్టి స్వాతంత్ర్యము ఒసంగుటకు, పూర్వకాలమందు ఏమికారణములు ఉండియున్నను, ప్రస్తుత పరిస్థితులనుబట్టి నిష్పక్షపాత బుద్ధితో యోచించినయెడల, ఆకారణములు యిప్పుడు వర్తించవని విశదమగును. వివాహ విషయములో,

పురుషులు వారికి యిష్టమైనప్పుడు యిదివరలో చేసుకొన్న భార్య ఉన్నప్పటికీ, తిరిగి వివాహము చేసికొనుట హిందూశాస్త్రమునకు విరుద్ధము కాకపోయినప్పటికీ, అది మనదేశమందుండు ఆచారములలో అతిఘోరమైన దనియు, స్త్రీపురుషుల అన్యోన్యతకు భంగకరమైనదనియు, ప్రకృతి ధర్మములకే విరుద్ధమైనదనియు, నా అభిప్రాయము. ఇటువంటి దురాచారము ఏ సంఘములో ప్రబలియుండునో, అటువంటి సంఘమును మానవాధములలో చేర్చవలసినదే కాని, అట్టివారు మానవులలో చేర్చబడ వలసినవారుకారు. ఈ దురాచారమును, మన హిందూదేశమునుండి తొలగించి, పురుషులకు నీతి కలుగచేయు శక్తి, మనదేశ స్త్రీలు పొందుదురుగాక యని నా ప్రార్థన. అటుతరువాత అతిబాల్య వివాహములు కూడదనియు, వితంతువులకు మరల వివాహములు చేయుట ముఖ్య ఆవశ్యకమనియు, కొన్ని సంవత్సరములనుండి దేశాభివృద్ధియందు అభిలాష కలిగిన విద్యావంతులగు పురుషులు చాలమంది వచించుచునే యున్నారు. ఈ రెండు విషయములయందు, దాదాపు 50 సంవత్సరములనుండి ఉపన్యాసములు జరుగుచున్నప్పటికి, క్రియ వచ్చినప్పుడు కొంతమంది ఉపన్యసించు పురుషులే వెనుదీయుచున్నారు. బాలవితంతువులయొక్క సంఖ్య, రానురాను వృద్ధియగుచున్నదే కాని తగ్గుటలేదు. దీనికి కారణము, సర్వము తెలుసునని విఱ్ఱవీగెడు పురుషులేకాని స్త్రీలు కారని, నా నిశ్చయము. కళాశాలలలో గొప్ప విద్యలయందు ఆరితేరి, పరీక్షలు ప్యాసుచేసిన యువజనులు, వేనవేలు రూప్యములిచ్చి పిల్లనిచ్చు అజ్ఞానులగు తల్లిదండ్రులు ఎక్కడ దొరుకుదురాయని యెదురు చూచుచుందురే గాని, ఇంటికి తెచ్చుకొను జవ్వనియందు అనురాగము ఉండవలెననిగాని, అట్టివివాహము సౌఖ్యదాయకమగునో కాదో అను అంశమును గురించి ఆలోచించ వలయుననిగాని, కొంచెమయినను మనస్సునందు యోచింపరు. ఆకారణమువల్లనే అప్పుడప్పుడు వివాహానంతరము జరుగు ఆత్మహత్యలను వినుచున్నాము. పైకి ఎల్లరకును తెలియకుండా మనోవ్యాధితో పీడింపబడుచు, చెప్పవలవికాని కష్టముతో జీవించుచున్న నారీమణులయొక్క సంఖ్య వేనవేలుండునని, యీ ప్రచురింపబడిన ఆత్మహత్యలవల్ల రూఢి అగుచున్నది. మన హిందూదేశమందు, యీ సోషల్ రిఫారము అనే ఉద్యమము రామమోహనరాయలవారి కాలమునుండి ఉన్నప్పటికిని, అభివృద్ధి కాకపోవుటకు కారణము, యింతవరకు పురుషుల స్వాధీనములో ఉండుటయే అని నా అభిప్రాయము. ఈపైన చెప్పిన దురాచారములను పోగొట్టుటకు, పురుషులు చేసిన పని ఏమన, ప్లాటుఫారములమీద లెక్చరిచ్చుట, చట్టనిర్మాణ సభలయందు రెండు మూడు చట్టములను స్థాపింపజేయుటయే. సంఘమునందుండు మతవిషయములలోని కొన్ని దురాచారములు, చట్టనిర్మాణ సభలయందు ఆక్టులు ప్యాసుచేసిన మాత్రముననే, పోజాలినవికావు. ఈ రిఫారమనే సమస్య, స్త్రీలు భారము వహించి మనోధైర్యము కలిగిన పురుషుల సహాయము తీసికొని, పనిచేసి, అములుకు తీసుకొని రావలసినదే కాని, మరి ఏవిధముగానైనను కొనసాగ నేరదు.

నాయొక్క ముఖ్యప్రార్థన ఏమనగా, యీసంఘసంస్కరణ విషయమై మన స్త్రీలే ముఖ్యముగా భారము వహించి మన సంఘమందును, కులాచార విషయములందును గల మంచి చెడ్డలను తెలిసికొని, ఆవశ్యకమైన మార్పులు చేయుటకొరకు, యిటువంటి మహిళా సభలయందును, ముఖ్యముగా మన స్వగృహములయందును పరస్పరము కలుసుకొని నూతన అభిప్రాయములను ప్రచురింప చేయవలయును. ఇది మన సంఘోద్ధారణకొరకు, నైతికౌన్నత్యము కొరకు, ఆచరింపవలసిన ముఖ్యమైన స్త్రీధర్మము.

నా మనస్సునకు తోచినమట్టుకు నా అభిప్రాయము తెల్పియో, చెప్పియున్నాను. నేను అంత ఎక్కువగా చదువుకొన్నదానను కాను గనుక వీటియందు కొన్ని లోట్లు ఉండవచ్చును."

(అధ్యక్షురాలు శ్రీమతి సారంగు సీతాదేవిగారి ఉపన్యాసమునుండి.)

# వివాహ విశేషములు

శారదా చట్టమునకు విరుద్ధముగ మచిలీపట్నములో 23-6-32 తేదిని ఒకవివాహము జరిగెను. వకీలు వేమూరి చిన్నయ్యారావుగారి సవతిచెల్లెలు 11 ఏండ్ల బాలిక వధువు. వకీలు యల్. శ్రీనివాసరావుగారు కన్యాదాత. వీరిపై తేబడిన కేసులో చిన్నయ్యారావుగారు కన్య తనయొద్ద మాత్రమే కాక తమ అన్నదమ్ము లందరియొద్దను నుండుచుండెననియు, తాను కుటుంబము పెద్ద గనుక తనపేర శుభలేఖలు వ్రాయబడెనేకాని అంతకుమించి వివాహముతో తనకు జోక్యము లేదనియు వాదించెను. శ్రీనివాసరావుగారు తాను కన్యాదానమును మాత్రమే చేసెననియు అది సంపూర్ణవివాహ మనిపించుకోనదనియు వాదించెను. పురోహితుడు కన్య వయస్సు తనకు తెలియదనెను. పురోహితునకు రు 50 లును కన్యాదాతకు రు 200 ను జరిమానావిధించబడెను. వరుని పక్షమువారు హైదరాబాదు రాజ్యమునకు చెందినవారగుటచే విడిచిపెట్టబడిరి.

◆ ◆ ◆

నెల్లూరుజిల్లాలో 2 వివాహములు శారదాచట్టమునకు విరుద్ధముగ జరిగినవి. ఒకటి వైశ్యవివాహము, 50 యేండ్ల వరునకు 10 యేండ్లబాలిక వివాహము చేయబడినది. రెండవది బ్రాహ్మణవివాహము 20 ఏండ్ల వరునకు 10 యేండ్ల కన్య వివాహముచేయబడినది. పెండ్లికుమాళ్ల పెండ్లికుమార్తెల తండ్రులు నేరము చేసినట్లు ఒప్పుకొనిరి. నలుగురికి నాలుగు రు 25 లు కలెక్టరుగారు జరిమానావిధించి కంప్లెయింటు దారునకు ఒక్కొక్కపార్టీచేత పదేసిరూపాయీలు ఖర్చుల క్రింద ముదరా యిప్పించెను.

◆ ◆ ◆

అక్టోబరు 1 వ తేదిని 10 గంటలకు ఒక వైశ్య వితంతు వివాహము శాస్త్రరీత్యా తెనాలిలో జరిగినది. అన్నవరపు కృష్ణయ్యగారు తమకుమార్తెకు ప్రథమవివాహము 3 వ సంవత్సరమున చేసెను. ఆమె 5 వ సంవత్సరమున వైధవ్యమునందెను. ఆమె అన్నయగు నరసింహంగా రామె యవస్థనుచూచి సహింపలేక వివాహముచేయ బూనెను. అనేక విఘ్నములు కలుగుచువచ్చెను. కాని అతను పట్టుదలవీడలేదు. జక్కులవారి సత్రములో వివాహమును వేదోక్తముగ శ్రీ యుతులు గణపవరపు సుబ్బయ్య, బొడ్డుపల్లి వెంకటప్పయ్యగార్ల వశిష్టత్వమున జయప్రదముగ జరిగినది. 500 మంది సభికులువచ్చి భోజన భాజనములలో పాల్గొనిరి. 100 మంది వైశ్యస్త్రీలు దీని నామోదించుచు లేఖలు వ్రాసిరి.

## వివాహసంస్కరణ సంఘ నివేదిక

(సేవాశ్రమము, ఉప్పాడ.)

బాలవితంతు వివాహములను జరిపించుటకై సంఘము 16-2-1932 తేదిని స్థాపించబడినది. శ్రీయుత గంపల పద్మనాభంగారు దీనికి జనకులు. 24-6-33 తేదిని మొదటి సంఘసభ్యసమావేశము జరిగినది. రు. 120 లు వాగ్దానము చేయబడినవి. 5 కరపత్రముల నీ సంవత్సరము ప్రకటించినది. ప్రచారకులు కొన్ని గ్రామములకుగూడ నేగి యీ సందేశమును బోధపరచిరి. కాని పూర్వాచారపరాయణులు బహిష్కరణములు, పికెటింగులు మొదలగునవి చేయుచు వచ్చిరి. 28-12-32 తేదిని ఒక వివాహము, 25-6-33 తేది నొక వివాహము, 15-7-33 తేది నొక వివాహము మూడు వితంతూద్వాహములను జరిపించిరి.

ఇంకను అనేకమంది వితంతువులున్నారు కాని వారు విద్యావతులు కాకుండుటచేతను, తమ జాతివారే వరులుగా కావలెననుటచేతను వివాహములు కాకున్నవి. ఈ సంఘమునకు రు. 201-2-6 విరాళములు జమఅయినవి. రు. 493-8-6 ఖర్చులయినవి. అనగా రు. 169-7-9 లు అప్పులయినవి. అని కార్యదర్శులు తెలుపుచున్నారు. సంస్కరణాభిమాను లెల్లరును ఇట్టి తూష్ణీభావమునుమాని విరివిగా ధనసహాయము చేయకున్నచో ఇట్టి మహోద్యమము నశించిపోవును. కనుక సంస్థాపకులకు తగినంత చేయూత నొసంగుదురుగాక యని కోరుచున్నాము.

◆ ◆ ◆

సింధుదేశములో అమిళులను నొక తెగవారిలో వరశుల్క దురాచార మన్యకులములలో నెక్కువగ నున్నదట. ఈ దురాచారము నాపుటకై ఈ రాష్ట్రములోని హైదరాబాదు నగరముననున్న 20 మంది యువకు లొక దారుణప్రతిజ్ఞ జేసిరట. ఈ ఆచారమును తమదేశీయులు మానకున్న తాము విషము తీనుకొని మరణింతుమని ప్రతిజ్ఞ బూనిరట. మరి కొంతమంది బాలికలు ఈ దురాచారము హిందూ మతమునుండి తొలగింపకున్నచో తాము క్రైస్తవము పుచ్చుకొందుమని ప్రతిజ్ఞ బూనుచున్నారట. ఇట్టి దారుణప్రతిజ్ఞలు చేయుటకు బదులు అసలు వివాహము నే మానుకొందుమని ప్రతిజ్ఞ చేయరాదా? వివాహమాడకున్న గౌరవముగ జీవించు తెరవులేకపోయెనా యని ధర్మసాధని పత్రిక సలహాయిచ్చుచున్నది.

### హిట్లరుగారి వివాహచట్టములు

జర్మనీదేశపు డిక్టేటరు హిట్లరుగారు 18 యేండ్లు దాటిన యువకులు వివాహమాడకుండా ఉద్యోగములు చేయుచున్నచో వారి ఆర్జనలనుబట్టి పెద్ద పెద్ద పన్నులను చెల్లించుకొనవలెనని చట్టము ప్యాసు చేసెను. ఈపన్ను చెల్లించుకొనుట కష్టము కనుక అనేకు లింతకంటె వివాహమే తెరిపని పెండ్లి చేసుకొనుచున్నారు. వివాహమాడదలచుకొన్న యువకులకు కొంత ద్రవ్యమునుగూడ కట్నము నిచ్చుచున్నాడు. కనుక యువకులు విశేషకాలము తగినంత ద్రవ్యమును సంపాదించుకొనుటకు వేచియుండకనే వివాహమునకు వేగము సిద్ధపడుచున్నారు. ఇప్పుడు యువతులు వరులనందరిని గ్రహించుకొనిపోవుచుండుటచేత నడివయస్సు మీరువరకు వేచియుండి పిమ్మట వరాన్వేషణమునకు గడంగుపోలతులకు వివాహములు కాకపోవుటచేత వారి కామరణాంత కన్యాత్వము సిద్ధించనున్నది. వీరు వివాహబద్ధులై గృహిణీధర్మకార్యాసక్తులై యిల్లు కనిపెట్టుకొనియుండుటచేత వేనవేలు యువకులకు మంచి యుద్యోగములు కూలులు వేతనములు లభించుచున్నవి.

### బ్రిటనులో వివాహప్రతిబంధములు

బ్రిటిషు పార్లమెంటు లేక వైటుహాలునుండి చిత్రవిచిత్రములగు వివాహప్రతిబంధ సూత్రములు వెలువడుచున్నవి. ఉపాధ్యాయినులు, దాయీలు మొదలగు స్త్రీ యుద్యోగస్థులు తా ముద్యోగము చేయుచున్నన్నాళ్లు పెండ్లి చేసుకొనమని పత్రములు వ్రాసి యియ్యవలెనని నిర్బంధింపబడుచున్నారు. పోస్టాఫీసులలో పనిచేయు పడుచులుకూడ ఉద్యోగమునో పెనిమిటినో యెవరినో యొకరినిమాత్రమే వరింపవలెనని కోరబడుచున్నారు. పోలీసు ఉద్యోగములో చేరువారు నాలుగు సంవత్సరములవరకైనను వివాహమాడరాదని శాసింపబడినది. ఇట్టి నిర్బంధ శాసనములు లేనిచో హేరాళముగ అనేక వివాహములు జరిగి సుఖదాంపత్యము ననుభవింప గలవారనేకులు దీనిమూలమున నుద్యోగబద్ధులై నిర్బంధ బ్రహ్మచర్యమార్గమున ద్రోయబడుచున్నారు. దేశము నలుమూలల నసంతృప్తి చెలరేగి "మమ్ముల పెండ్లాడనీయండోయి" అను కేకలతో ఆందోళనము లంకురించుచున్నవి. రాబోవు పార్లమెంటు సమావేశములో ఇట్టి చట్టములు తీసివేయవలెనని కొందరు సభ్యులు ప్రతిపాదనములు పెట్టనున్నారు.

# గ్రంథ పరిచయము

శిశురక్షణ :—

గ్రంథకర్త్రి:—శ్రీమతి టి. వరలక్ష్మమ్మగారు. డెమ్మీసైజు 105 పుటలు, వెల 0-12-0.

హైదరాబాదు నివాసినియు దేశీయ వైద్యురాలును సుప్రసిద్ధానుభవ జ్ఞానసంపన్నయునగు శ్రీమతి టి. వరలక్ష్మమ్మగారు, తాము శ్రమపడి రచించిన "శిశురక్షణ" యను గ్రంథమును మాకంపి మా ధన్యవాదములకు పాత్రురాలైనది. ఈ గ్రంథమును మే మామూలాగ్రముగా జదివి యానందించితిమి. ఇందు చేటతెల్లమగు తెలుగుభాష, అత్యుపయోగకరమగు విషయము ప్యానుభవముగల యొక యిల్లాలిచే దెలుపబడియుండుటయు, బరమసంతోషకరములైయున్నవి. ఈ గ్రంథమును జదివి బాగుగా జీర్ణము చేసుకొని యే యిల్లాలుగాని, నిరాటంకముగా పిల్లల వైద్యురాలు కాగలదని మా యాశయము. ఇందులో శిశుపోషణాదివిషయము లెంతవరకు జెప్పబడియున్నవో అంతవరకే (యింగ్లీషున వ్రాయబడియున్న యొకటి రెండు గ్రంథములను) జదివి వానిలో నొక పరీక్షనిచ్చి యావెనుక నిరాటంకముగా మంత్రసానివృత్తి నవలంబించి రాజకీయ వైద్యశాలలయం దుద్యోగముల సంపాదించు యువతులెందరో కలరు. ఈ పుస్తకమున కింగ్లీషుభాషాపరిచయ మంతగా నక్కరయే లేదు. కాబట్టి యక్షరాస్యలగు సోదరీమణు లందరును జదివి తమతమ బిడ్డల నకాల మృత్యురోగాద్యవస్థలనుండి రక్షించుకొనగలరని మేము రూఢిగా జెప్పుచున్నాము. ఈగ్రంథ మింటింట నుండదగినది. ఇందు శిశువును జన్మించినది మొదలుకొని యొకయేడాది వయసు వచ్చువరకు, సర్వశిశుసాధారణములగు వ్యాధులనుండి తెమల్చి రక్షించుకొను విషయము మిక్కిలి వివరముగా చెప్పబడినది. అక్షరజ్ఞానము కలిగియున్న యేయువిదగాని యిందు దెలుపబడియున్న ప్రక్రియలను సులభముగా జేయగలదు. మరియు కావలసియున్న వస్తువులుగూడ సామాన్యములే! ఇవి యన్నియూళ్లయందును దొరకును. ఇంగ్లీషునందు తెనుగునందు అను భేదములేక రెండును యథోచితముగా నుపయోగములైయున్నవి. డోవర్సుపౌడర్, ఉదుకోలోన్, టింక్చర్ ఫెర్రి పెర్ క్లోరైడ్ అను నిట్టివి మాత్రము పల్లెటూళ్లలోని వారు దగ్గరనున్న చిన్న పట్టణముల నుండి తెప్పించుకోవచ్చును.

దీని వెల సులభమైనను ఫలముమాత్ర మమూల్యము. "Children are a great heritage from God above all otlfer gifts" అన్నట్లుఅష్టైశ్వర్యము లందును సంతానవిషయికమగునది మొట్టమొదటిది. ఇట్టిదానిని ఆరోగ్యవంతముగా నుంచుకొనుటకంటె తల్లులకు గోరదగిన దేదియుండును? ఇట్టి కోరిక నెరవేర్చుకొనుట కీగ్రంథమే సాధనము. శ్రీమతి టి. వరలక్ష్మమ్మగారింక నిట్టి పొత్తములను వ్రాసి యాంధ్రనారీలోకము నుద్ధరింతురు గాకయని మాకోర్కె.

గ్రంథము వలయువారు ఈ దిగువ విలాసమునకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

శ్రీమతి వరలక్ష్మమ్మగారు,<br>
C/o డాక్టరు. మిసెస్ యస్. శ్రీకంఠ,<br>
యమ్. బి. బి. యస్.<br>
3'59/4 కాచిగుడ స్టేషనురోడ్డు,<br>
హైదరాబాదు (డక్కన్).

—వ॥ కృ॥

## బాపట్ల స్త్రీ హితైషిణీమండలి 1932-33 నివేదిక.

శ్రీమతి కామరాజు వెంకటలక్ష్మమ్మగారీ సంఘమున కధ్యక్షురాలై యొనరించిన సేవకు కృతజ్ఞతాసూచకముగా నీ సంవత్సరముకూడ అధ్యక్షురాలై యెన్నుకొనబడిరి. శ్రీమతులు కనుపర్తి వరలక్ష్మమ్మ, గంగరాజు లక్ష్మీనరసమ్మగార్లు కార్యదర్శు

లుగ ఎన్నుకొనబడిరి. ప్రస్తావ సంవత్సరమున పెక్కుసభలు, జయంతులు, పండుగలు మొత్తము 120 కంటె నెక్కువగా జరిగినవి. శ్రీయుతులు పాల శక్తి రామమూర్తి, నరసింహం, ఆంజనేయులు, రాయసం వెంకటశివుడు, దేశోద్ధారక నాగేశ్వరరావు, వావిలికొలను సుబ్బారావు, మతుకుపల్లి వెంకట లక్ష్మీనరసింహారావుగార్లు శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారిగారు పెక్కు భక్తియుతవ్యాసములిచ్చిరి. భారతి, గృహలక్ష్మి, వినోదిని, ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక మొదలగు పత్రికలుచితముగ వచ్చుచున్నవి. నిరటి 160 గ్రంథములు చేరి 900 అయినవి. గడియారము, ప్రాతబల్ల, కుర్చీ మొదలగునవి సేకరించబడినవి. సంస్థ భాగ్యరైన కోలనిచయి ప్రత్యేకభవనపు టావశ్యకత హెచ్చుచున్నది. భవననిర్మాణసంఘ మేర్పడి దీక్షతో కృషిచేయ యత్నించుచున్నది. రు. 200 ల మించి యీసంవత్సరము వసూలు కాబడినది. 150 రూపాయీలు ఖర్చులయినవి. రు. 90 లింకను మిగిలియున్నవి. లెక్కలు, గ్రంథములు చాలా చక్కగానుంచబడినవి.

శ్రీ బుగ్గ దేవాలయ క్షేత్రమువారి 17-11-1930నుండి 30-9-1932వరకు నివేదిక:—

ఈ క్షేత్రము దక్షిణకాశినాఁ బరగుచు, శివ విష్ణు దేవాలయములు, జలధారలు మొదలగు పవిత్ర సంపదలచే నొప్పారుచున్నది. జీర్ణావస్థలోనున్న ఇచ్చటి గుడి గోపురములను బాగుచేసి సత్రములు వగైరాలు కట్టుటకు 'శ్రీ బుగ్గ దేవాలయ జీర్ణోద్ధారక కమిటీ' శ్రీయుత కుందారెడ్డి రంగయ్య రెడ్డిగారి అధ్యక్షత క్రింద 17-11-30 తేదిని స్థాపింపబడినది. శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతులు శ్రీ జగద్గురు శంకరాచార్యులువారును, శ్రీయుత బొల్లినముని స్వామినాయుడుగారు మొదలగువారును, దరిగ్రామస్థులును దీనికి చేయూతనొసగి 7000 రూపాయలకు పైగా చందా లొసగియున్నారు. ఈ సొమ్ము కట్టడములు అభరణములు వగైరాల నిమిత్తము వెలవు చేయఁబడినది. తీర్థయాత్రాపరులును, భగవద్భక్తులును, సనాతన హిందువులగువారెల్లరును ఈ సంస్థను విరివిగా చందాలిచ్చి ఉద్ధరింతురుగాకయని కోరుచున్నాము. ఇట్టి పుణ్యకార్యభారమును వహించి మిగుల శ్రమపడుచున్న అధ్యక్షులును, కార్యదర్శులగు శ్రీయుత ఇ. త్రిపురాంతక మొదలియారు యచ్. సుబ్రహ్మణ్యశర్మగార్లును మిగుల ప్రశంసార్హులు.

ప్రజాసేవ:—

ఈ సంవత్సరము జూలై మాసమునుండి గుంటూరు పురమునుండి వెలువడుచున్న యీ చిన్న మాసపత్రికకు మేము సంపూర్ణస్వాగతము నొసగుచున్నాము. సంపాదకులు మదరాసు శాసనసభా సభ్యులగు శ్రీయుత గాదె సింహాచలం పంతులుగారు. జూలై, అగస్టుమాస సంచికలు మా కార్యాలయము నలంకరించినవి. గ్రామపంచాయితీలు, సహకారసంస్థలు, రైతుల సమస్యలు మొదలైన విషయములనుగూర్చి చక్కని గద్యపద్యాత్మకములైన వ్యాసములు హృదయముల నుప్పొంగించు రీతిని శ్రీయుతులు కర్లపాలెం కుటుంబశాస్త్రిగారు, అన్నాతుని వెంకటాచలపతి రావుగారు, వామెర్ల పుండరీకాక్షుడుగారు మొదలగువారిచే వ్రాయఁబడినవి. గుంటూరు జిల్లాయందలి ప్రతిగ్రామ సంస్థవారును తెప్పించుకొనవలసినది. ఈపత్రిక సంకల్పసిద్ధయై చిరకాలము గుంటూరుమండలసేవ నొనరించవలెనని కోరుచున్నాము.

మాధవాశ్రమము (రెండవ భాగము):—

ఈగ్రంథముయొక్క ప్రథమభాగమును పూర్వము విమర్శించితిమి. విద్యార్థులగు యువకులు ఉద్యోగములకై పట్టణములఁ బోక గ్రామములలో స్థిరపడి తదేకదీక్షతో పనిచేసినచో ఎట్టి ప్రజోపయుక్తసంస్థలను స్థాపించి నడిపించగలరో గ్రంథము విశదముచేయుచున్నది. గ్రామసేవ సల్పుటయనిన మాటలతో పని కాదు. అనేక ప్రతిఘటనల నెదుర్కొనవలసియుం

లుగ నెన్నుకోబడిరి. ప్రస్తుత సంవత్సరమున పెక్కుసభలు, జయంతులు, పండుగలు మొత్తము 120 కంటె పెక్కువగా జరిగినవి. శ్రీయుతులు పాలసత్తి రామమూర్తి, నరసింహం, ఆంజనేయులు, రాయసం వెంకటశివుడు, దేశోద్ధారక నాగేశ్వరరావు, వావిలికొలను సుబ్బారావు, మతుకుమల్లి వెంకటలక్ష్మీనరసింహరావుగార్లు శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారిగారు పెక్కు భక్తియుపన్యాసములిచ్చిరి. భారతి, గృహలక్ష్మి, వినోదిని, ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక మొదలగు పత్రికలుచితముగ వచ్చుచున్నవి. నిరటి 160 గ్రంథములు నేటికి 900 అయినవి. గడియారము, వ్రాతబల్ల, కుర్చీ మొదలగునవి సేకరించబడినవి. సంస్థ భాగ్యరైన కొలదియు ప్రత్యేకభవనపు టావశ్యకత హెచ్చుచున్నది. భవననిర్మాణమునకు మేర్పడి దీక్షతో కృషిచేయ యత్నించుచున్నది. రు. 200 ల విలువ యీసంవత్సరము వసూలు కాబడినది. 150 రూపాయిలు ఖర్చులయినవి. రు. 90 లింకను మిగిలియున్నవి. లెక్కలు, గ్రంథములు చాలా చక్కగానుంచబడినవి.

శ్రీ బుగ్గదేవాలయ క్షేత్రమువారి 17-11-1930నుండి 30-9-1932వరకు నివేదిక:—

ఈ క్షేత్రము దక్షిణకాశీనాఁ బరగుచు, శివవిష్ణు దేవాలయములు, జలధారలు మొదలగు పవిత్రసంస్థలచే నొప్పారుచున్నది. జీర్ణావస్థలోనున్న ఇచ్చటి గుడి గోపురములను బాగుచేసి సత్రములు వసతిశాలలు కట్టుటకు 'శ్రీ బుగ్గదేవాలయ జీర్ణోద్ధారక కమిటీ' శ్రీయుత కుందారెడ్డి రంగయ్యరెడ్డిగారి అధ్యక్షత క్రింద 17-11-30 తేదిని స్థాపించబడినది. శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతులు శ్రీ జగద్గురు శంకరాచార్యులువారును, శ్రీయుత బొల్లినముని స్వామినాయుడుగారు మొదలగువారును, దరిగ్రామస్థులును దీనికి చేయూతనొసగి 7000 రూపాయిలకు పైగా చందాలొసగియున్నారు. ఈ సొమ్ముకట్టుడములు అభరణములు వగైరాల నిమిత్తము సెలవుచేయబడినది. తీర్థయాత్రాపరులును, భగవద్భక్తులును, సనాతనహిందువులగువారెల్లరును ఈ సంస్థను విరివిగా చందాలిచ్చి ఉద్ధరింతురుగాకయని కోరుచున్నాము. ఇట్టి పుణ్యకార్యభారమును వహించి మిగుల శ్రమపడుచున్న అధ్యక్షులును, కార్యదర్శులగు శ్రీయుత ఇ. త్రిపురాంతక ముదలియారు యం. సుబ్రహ్మణ్యశర్మగార్లును మిగుల ప్రశంసార్హులు.



ప్రజాసేవ:—

ఈ సంవత్సరము జూలైమాసమునుండి గుంటూరు పురమునుండి వెలువడుచున్న యీ చిన్న మాసపత్రికకు మేము సంపూర్ణసాహాయ్యము నొసగుచున్నాము. సంపాదకులు మదరాసు శాసనసభా సభ్యులగు శ్రీయుత గాదె సింహాచలం పంతులుగారు. జూలై, ఆగష్టుమాస సంచికలు మా కార్యాలయము నలంకరించినవి. గ్రామపంచాయితీలు, సహకారసంస్థలు, రైతుల సమస్యలు మొదలైన విషయములనుగూర్చి చక్కని గద్యపద్యాత్మకములైన వ్యాసములు హృదయముల నుప్పొంగించు రీతిని శ్రీయుతులు కర్ణపాలెం కుటుంబశాస్త్రిగారు, అన్యుతుని వెంకటాచలపతిరావుగారు, వామెల్ల పుండరీకాక్షుడుగారు మొదలగువారిచే వ్రాయబడినవి. గుంటూరుజిల్లా యందలి ప్రతిగ్రామ సంస్థవారును తెప్పించుకొనవలసినది. ఈపత్రిక సంకల్పసిద్ధయై చిరకాలము గుంటూరుమండలసేవ నొనరించవలెనని కోరుచున్నాము.

మాధవాశ్రమము (రెండవ భాగము):—

ఈగ్రంథముయొక్క ప్రథమభాగమును పూర్వము విమర్శించితిమి. విద్యాధికులగు యువకులు ఉద్యోగములకై పట్టణములం బోక గ్రామములలో స్థిరపడి ఏకదీక్షతో పనిచేసినచో ఎట్టి ప్రజోపయుక్తసంస్థలను స్థాపించి నడిపించగలరో గ్రంథము విశదము చేయుచున్నది. గ్రామసేవ సల్పుటయనిన మాటలతో పని కాదు. అనేక ప్రతిఘటనల నెదుర్కొనవలసియుం

డును. ప్రథమమున నిశ్చలముగ నెల్లరును దీనికి విరోధులే. వాయుదుని యకలంకవర్తనమువలననే అన్నియు సరిచేయఁబడవలెను. మాధవు డిట్టి ఆదర్శ పురుషుడు. అతని దీక్షవలన కల్లుపాక రొత్తివేయ బడినది, కరణముగారి ఆటలు కట్టఁబడినవి, కద్దరు వ్యాపకము చేయఁబడినది, దేశీయపాఠశాల నెల కొల్పఁబడినది, పంచాయతీసంస్థ బాగుచేయబడినది, నిరాధారనిందలు తొలగింపఁబడినవి, కరూరు గ్రామము లోని కుటుంబకలహము లంతరించి ఆదర్శప్రాయ మైనది. ప్రతి గ్రామమునకును నొక మాధవుడును ఒక ఆశ్రమమును ఉన్న ఎట్టిసేవ యొనరింపబడగలదో దీనవలన విశదము కాగలదు. గ్రంథము ప్రతి గ్రామ సంస్థయొక్క గ్రంథాలయము నలంకరింపదగ్గది. క్రౌనుసైజు 255 పుటలు. ఇల్లారి శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాలవారిచే 8వ పుష్పముగా ప్రకటింపబడినది. గ్రంథకర్త: కుంటి సుబ్రహ్మణ్య శర్మగారు. గ్రంథ మాలవారు సంవత్సరమున కిట్టి గ్రంథములు 300 పుటలుగల 3 గ్రంథములను ప్రకటించి వీపీ చార్జీలు లేక రు. 1-4-0 లకు విక్రయింతురు. భాషాభిమాను లెల్లరును చందాదారులుగాను, దాతలుగాను, పోషకులుగాను చేరి వీరి యుద్యమమునకు చేయూతనిత్తురు గాక!

**హరిజన సమస్య:—**

ఇది జాతీయగ్రంథమాలవారిచే ప్రకటింపఁబడిన తృతీయకుసుమము. గ్రంథకర్త నంబూరు వెంకట కృష్ణమాచార్యులుగారు బి.ఏ. కాకినాడ భారతీ నికేతనమువారు ప్రకాశకులు. 588 పుటలుగల అయిదుఖండముల విపులగ్రంథము. ప్రథమఖండమున హరిజనులెవరో, ఏయే రాష్ట్రముల నెంతమంది యే యే పేరులు, ఆచారములు అవస్థలలోనున్నారో, వారి యుద్ధరణముగూర్చి నేటివరకెట్టి ప్రయత్నములు జరిగినవో, ముందేమార్గములు అవలంబింపబడవలెనో తెలుపఁబడినది. రెండవ భాగమున ఇందును గూర్చి మహాత్ముని అభిప్రాయములు యంగు ఇండియా పత్రికనుండి యెత్తి వ్రాయబడినవి. మూడవభాగమున ప్రాయోపవేశదీక్ష, గురువయ్యూరు సత్యాగ్రహము, పూనా ఒడంబడిక, శాసనసభలలో బిల్లుల ప్రవేశములనుగూర్చి తెల్పఁబడినది. నాల్గవభాగమున మహాత్ముని ప్రకటనలు, తత్ఫలితముగ దేశములో కలిగిన హరిజనాభ్యుదయము వివరింపఁబడినవి. 5వ భాగమున మహాత్ముని రెండవ యుపవాసదీక్ష, అతని విడుదల, శాసనోల్లంఘనము తాత్కాలికముగ వాపుట వివరింపబడినవి. ఇట్లు హరిజనాభ్యుదయ మెట్లు దినదినాభివృద్ధికరముగ నుద్యమమై విరాజిల్లుచున్నదో గ్రంథము ఆక్లే క్రొత్తవిషయములతో రాజిల్లుచు చవులూరుచున్నది. శైలి సులభము, తేటతేట. వరిమిలా చరిత్రనుగూడ జాగ్రత పెట్టి రెండవ భాగము గ్రంథకర్తగారు ప్రకటించిన ఉద్యమమునకు మంచి ప్రోత్సాహము కలుగకమానదు. వెల రు. 1-0-0 మాత్రమే.

**కామదేవశతకము:—**

క్రౌనుసైజు 23 పుటలు. వెల రు 0-2-0. గ్రంథకర్త వంటివాడ వెంకటరత్నముగారు, తాళ్లపూడి, తూర్పుగోదావరిజిల్లా. ఇందలి 103 సీసపద్యములును మానవులు కామవశులై యెట్టి అనాగతముల పాలగుదురో వర్ణించుచున్నవి.

**నిరుద్ధభారతము:—**

క్రౌనుసైజు 70 పుటలు, వెల రు 0-5-0. గ్రంథకర్త శ్రీయుత మంగిపూడి వెంకటశర్మగారు. తంబు శెట్టివీధిలోనున్న ఆంధ్రగ్రంథమాలవారు దీనిని పునర్ముద్రణము చేయించిరి. దేశోద్ధారకుని పరిచయ వాక్యముతో రాజిల్లుచున్నది. అస్పృశ్యతానివారణోద్యమమున కిది జయభేరివంటిది. పంచమజాతి యనునది యెట్లు కృత్రిమాచార కల్పితమైనదియు, ఆ జాతినుండి యెట్టి దేవతలు, ఋషులు, మహనీయు లుదయించినదియు, వారిని నిరసించుటవలన నెట్టి యనర్థములు చేకూరుచున్నదియు, దానిని తొలగించుటవలన నెట్టి సౌభాగ్యము దేశమునకు చేకూరునదియు శ్రుతిస్మృతి పురాణేతిహాసిక వాక్యములతో కూడ ఋజువుపరచబడినది. తేటతెల్లమగు సుందర

పద్యకావ్యము. చిత్తము నుత్తేజించుచుండును. హృదయమును కరగించు కరుణారసముతో నుప్పొంగుచు నెట్టి పాషాణచిత్తునైనను కార్యపరతంత్రుని చేయకమానదు. ప్రస్తుతకాల మిట్టి యుద్గ్రంథప్రబోధమునకు వేచియున్నదనుట కాటంకములేదు. దీనిని ప్రకటించి దేశోద్ధారకులు హరిజనాభిమానులెల్లరి గౌరవ కృతజ్ఞతకు పాత్రులైనందుకు వారి నెంతయు అభినందించుచున్నాము. ఇంత స్వల్పవెలగల యీ గ్రంథము నతివేగముగ ఆంధ్రలోకము గ్రహించి తిరిగి పునర్ముద్రణ భారమును సమర్థులగు దేశోద్ధారకులకు కలిగించవలెనని కోరుచున్నాము.

### భాగవతావతరణము:—

రాయలు 1/8 సైజు 40 పుటలు. గ్రంథకర్త శ్రీయుత నోరి నరసింహశాస్త్రిగారు. సాహితీసమితి, గుంటూరు. నారాయణస్వరూపులగు వ్యాసులవారు తమశిష్యులు పైల, వైశంపాయన, జైమిని, సుమంత, రోమహర్షణుల కొసగిన యొకే ధర్మస్వరూపమగు ఋగ్యజుస్సామాథర్వణపురాణేతిహాసములు వివిధ విధములుగ వారికి గోచరించి పరస్పర వివాదకారణమగుటయు, నారదులు భక్తిమాత్ర సమన్వయముచే వాటి యేకత్వమునుగూర్చుటయు, వ్యాసులు తత్సూత్ర సహాయమున భగవద్గుణనామ సంకీర్తనంబగు భాగవతలహరిని పుడమితలమున వెల్లివిరియించుటయు, శుకయోగీంద్రుడు దానిని ధరించి శిష్యవర్గము నెల్ల తన్మయత్వముతో తాండవింపఁ జేయుటయు నిందలి కథాంశము. కావ్యసంకల్పము, కల్పన, రచన, పరిణామము అంతయు ఒకటికొకటి యీడుతీయుచున్నవి. కావ్య మెంతచిన్నదో అంత ప్రౌఢము, ఎంత సులభమో అంత గంభీరము, ఎంత మృదులమో అంత తేజోవంతము. ఇట్టి కావ్యమును రచించిన శాస్త్రిగారి లేఖిని ధన్యమైనది.

### శ్రీమల్లేశ్వరశతకము:—

క్రౌను సైజు 57 పుటలు, వెల రు 0-4-0 లు. గ్రంథకర్త శ్రీయుత మావుడూరు శ్రీశైల మల్లిఖార్జునరావుగారు, సుందరాపురం, ఊర్లాంపోస్టు, గంజాంజిల్లా. శ్రీయుతులు సోమంచి వాసుదేవరావు, గరిమెళ్ల వేంకటరామమూర్తిగార్ల తొలిపలుకులతో రాణించుచున్నది. భక్తి, నీతి, నిష్ఠ, ధ్యానము మోక్షాసక్తులను మేల్కొల్పు 108 సీసపద్యములును, సంస్కృత భాషలో శ్రీమల్లేశ్వరాష్టకమును నిందుగలవు. శైలి మృదుమధురము. కవిగారు ఇతోధిక గ్రంథముల రచించి పాఠకుల వీనులకు భక్తిరసమరందబిందువులను విందు గుడుపుదురుగాక యని కోరుచున్నాము.

### ఆత్మజ్యోతి:—

క్రౌను సైజు 73 పుటలు, వెల రు 0-8-0 లు. గ్రంథకర్త ముద్దా విశ్వనాథంగారు. విశాఖపట్టణము జిల్లా, ఎలమంచిలి తాలూకా. మేలుపాకలోనున్న కుటీరము వారిచే ప్రకటితము. టాలుస్టాయి వ్రాసిన ఇరువురు యాత్రికులను సుప్రసిద్ధకథ ననుసరించి ఆంధ్రమున వ్రాయబడినది. మానవసేవ పుణ్యక్షేత్ర దర్శనముకంటెఁ గూడ ఘనతరమగు తీర్థయాత్రయనియు, మానవసేవాపరుల కనిమిత్తాగమంబులగు శుభంబులు చేకూరుననియు, వారివలన లోకమున కమితకళ్యాణమును వారికి లోకుల యాశీస్సును లభించుననియు గ్రంథముయొక్క నీతి. గ్రంథమెంత యాంధ్రసాంసారికజీవనమువలె కనుపట్టును. ప్రజల నిత్యజీవనములోని భాషతోను సామెతలతోను సంభవములతోను గూడి శైలి సజీవ భాషాప్రవాహమువలె విలసిల్లును. ఈ కుటీరమువా రిప్పటికి నాలుగు గ్రంథములను ప్రకటించినారు. మరి యొనిమిది గ్రంథములు ప్రకటనమునకు సిద్ధముగనున్నవి. వెల లతిస్వల్పములు, కల్పనములును నీతులును బహ్వమూల్యములు. ఆంధ్రులెల్లరును వీరి సదుద్యమమునకు చేయూత నొసగుదురుగాక!

### మానవస్వత్వములు:—

క్రౌను సైజు 49 పుటలు, వెల రు 0-4-0. గ్రంథకర్త వల్లమూడి గోపాలకృష్ణమూర్తిగారు. 'త్యాగధనులగు దేశోద్ధారకుల' కంకితము. థామసు పెయిను అను ఆంగ్ల రాజ్యాంగ తత్త్వవేత్త వ్రాసిన ఆంగ్లగ్రంథ

ముల కనువాదము. సందర్భవశమున అమెరికా ఐరోపాలలోని రాజ్యాంగముల చరిత్రమెల్లయు సంగ్రహముగ సూచింపబడినది. ప్రజాస్వాతంత్ర్యప్రతిభంగకరములగు రాజ్యాంగములు పతనము లగునని దీనివలన తెలియవగును. ఇట్టి కాలానుగుణ గ్రంథము లను ప్రకటించు గ్రంథమాలవారు ఆంధ్రమహాజను లెల్లరి ప్రశంసకును మిక్కిలి పాత్రులు.

కంఠమాల:—

క్రౌనుసైజు 36 పుటలు గల చిన్నిపద్యకావ్యముల సంపుటము. గ్రంథకర్త శ్రీయుత జక్కంతి గంగన్న గారు, ఇన్నీసుపేట, రాజమహేంద్రవరము. వెల 6 అణాలు. కవివరునకావేశసమయములయందుదయించు భావములను లిఖించుట కవిత్వమగుచో నిందలి యెనిమిది పద్యమాలలను నిజమైన భావకవిత్వమనవలెను. ప్రకృతి సమ్ముఖమున ప్రాపంచిక విషయములు విస్మృతింబడునప్పటి హాయియు, అభిమానస్థలంబు పయి నవ్యాజంబుగ పొడము నభిమానము మొదటి రెండు పద్యములకును విషయము. కామినీ ప్రణయ మునకుగాని తన్నిరాకరణమునకుగాని కారణము దురూహ్యమనునది మూడు నాల్గవపద్యముల విషయము. శ్రుతిస్మృత్యాదిసూత్రంబులకు దుష్టమానవకోటి స్వార్థప్రేరితులై విపరీతవ్యాఖ్యలు చేయుచు మహనీయుల ఆత్మలకు కలిగించు కుందును అయిదవ పద్యము విలపించుచున్నది. ఎట్టి వేదాంతవాక్యములును కడుపు శోకము మార్పలేని వాని దుఃఖోపశమనమున కేదేని యూతయున్నదేమో యని ఆరవపద్య మన్వేషించు చున్నది. వివిధరికముల యింపుసొంపుల వెలయించు విరులలో తారతమ్యముల నెంచచూచుట క్రిందదన మని యేడవపద్యము నిర్ణయించుచున్నది. ఈశ్వర సాన్నిధ్య మేకారణమున కలుగదో తర్కించుచు, తన్నిరోధక కారణములనెల్ల తొలగించి దర్శనమిప్పించుమని యెనిమిదవ పద్యము ప్రార్థించుచున్నది. మొత్తముపైని పద్యము లన్నిటియందును నొక సంశయాకుల స్వాంతము ఉజ్జ్వాగుచున్నది. ఇది ప్రస్తుత ప్రపంచ విద్యావిధానములయొక్క లక్షణమనుటకు సందేహములేదు. నిర్వక్రమగు నుత్సాహవిశ్వాసములు తప్ప మరియేవియు దీనినుండి మానవుని విముక్తుని చేయజాలవు. ఈ యెనిమిదవ పద్యములోని ప్రార్థన మెవ్వని యీశ్వరు డాలకించునో వాడు ధన్యుడు.

కన్నతల్లి:—

డెమ్మీసైజు 116 పుటలుగల గ్రంథము. గ్రంథకర్త్రి శ్రీమతి కంభంపాటి సీతారామగారు, సుభద్రానికేతనము, మజ్జిపూడి, గుంటూరుజిల్లా. కీర్తిశేషురాలగు శ్రీమతి సుభద్రమ్మగారి జీవితచరిత్ర. సుభద్రమ్మగారు గ్రంథకర్త్రికి మాతృదేవత. గ్రంథమామూలాంతము "భక్తి ప్రేమావిచార"రసములతో తుందిలమైయున్నది. గ్రంథమంతటను హిందూదేశములోని దురాచారముల విమర్శనమును సదాచారముల ప్రశంసయు గానవగును. మంచి ఆవేశముతో వ్రాయబడినది. శైలివ్యావహారికమయ్యు గ్రాంథిక పదవివర్జితము కాక విషయమున కనుకూలముగ నున్నది. హిందూ సంఘమునకు జ్ఞానము కలుగవలె నన్న సీతారామమ్మగారివంటి గ్రంథకర్త్రిలు, చీపురు కట్టపట్టి కొట్టినట్లుండు ఇట్టి శైలిలో, సంఘదురాచారములను చెడామడా మర్దించవలసిన అవశ్యకత యెంతేని గలదు. సుప్రసిద్ధాంగ్లపండితుల, ఆంధ్రకవుల అభిప్రాయములను నుదహరించుచు ఆమె వ్రాసిన యీదీర్ఘగ్రంథ మామె యపారపాండిత్యమును, జ్ఞానమును విమర్శనశక్తిని, దేశాభిమానమును, నిరుపమానమగు ఆవేదనమును జాటకమానదు. వెల రు 1-0-0 మాత్రమే.

ప్రౌఢకృష్ణలీల:—

డెమ్మీసైజు 184 పుటలు. వెల రు 1-4-0 లు. బళ్లారి రాజరాజేశ్వరీ గ్రంథమాల వారిచే ప్రకటితము. పండిత క. సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే రచితము. ద్రౌపదీ స్వయంవరము, పాండవుల రాజసూయయాగము, కపటద్యూతము, సుయోధనుడు పాంచాలిని పరాభవించు ప్రయత్నము శ్రీకృష్ణుడక్షయ వస్త్రములనొసంగుట యిందలి యితివృత్తము. గ్రంథము పేరునకు తగినట్లు ప్రతిపాత్రమును మంచి ప్రౌఢముగను స్ఫుటముగను కనిపించి వర్తించును. శైలి సంస్కృతపద సమ్మిళితమై ప్రౌఢపాత్రముల

కుచితమైయుండును. పాండవులను పరాభవించవలె
నను సుయోధనుని దురాశాపాతకబుద్ధి, ఎట్టి కపట
నీచకృత్యములకైన సిద్ధపడి మార్గము లన్వేషించు
దుశ్శాసనుని దుస్స్వభావము, కౌరవవంశనిర్మూలనము
చేయగోరిన పాంచాలి యాక్రోశాహంకారములు
కడుభీకరములుగ కన్పట్టును. కౌరవసభలోని అక్ర
మములను కుందుచు సేవకావృత్తికతంబున నోరు మెద
ల్పలేని ధర్మబుద్ధి కర్ణునియందు చిత్రించబడినకతం
బున కర్ణపాత్ర మిగుల మనోహరముగనున్నది. కౌరవ
సభయొక్క అక్రమములను తెగించి తెగడిన అశ్వ
ద్ధామ వికర్ణుల సాహసమును వర్ణనీయము. చిన్నవా
రయ్యు సత్యములగు పౌరుషవాక్యములను పలుకుచు
కయ్యమునకు మునుముందురుకుచుండు లక్ష్మణ, ఇలావం
తుల పాత్రములు కడుసుందరములు. విద్వన్నటకులకు
గాక ఆయాయినటకులకు నటింపరాని సూక్ష్మసన్ని
వేశములతో గూడి గ్రంథము కవిగారి ప్రజ్ఞను
ప్రకటించుచున్నది.

మేవాడు శౌర్యాగ్ని:—

డెమ్మీసైజు 202 పుటలు. వెల రు 1-4-0 లు.
బళ్లారి రాజరాజేశ్వరీ గ్రంథమాలవారిచే ప్రకటితము.
గ్రంథకర్త పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.
మేవాడు పాలకుడు శ్రీరాణాప్రతాపుని శౌర్య
పౌరుషముల నెఱుగని వారాంధ్రదేశమున లేరు. ఇతని
ప్రతిభను తెలియజేయు అనేకకథలును గ్రంథములును
ఆంధ్రభాషలో ప్రకటింపబడియేయున్నవి. అయినను
యీయితిహాసము నాటకరూపమెత్తి శ్రీ శాస్త్రి
గారి లేఖినినుండి యపూర్వపౌరుష ప్రతాపవహ్ను
లను వెలిగ్రక్కుచున్నది. ప్రమదాదేవి యార్ష్య
ప్రతాపుని సోదరుడు సాగర్జియొక్క దేశద్రో
హము, దుర్గాదాసుయొక్క నిశ్చలరాజభక్తి, రాణా
బాయియొక్క మోహము సన్న్యాసముగా పరిణ
మించిన దేశసేవావిధానము, ప్రతాపునిదీక్ష, భిల్లుల
మగటిమి, గోపీనాథునిసమయస్ఫురణ మొదలగున
వన్నియుకలిసి నాటకములోని అనేక అపూర్వసన్ని
వేశములకు కారణములైనవి. కవిగారి శైలికున్న
పటుత్వ మసాధారణమని యీగ్రంథము చాటుచు
న్నది. దేశభక్తిని, జాతీయగౌరవమును, సర్వంకష
త్యాగమును ప్రబోధించు ఇట్టి కావ్యములను రచించి
గ్రంథకర్తగారి లేఖిని ధన్యమగుచున్నది. ఇతిహాసము
నకు తగిన శయ్యను శయ్యకుతగిన యితిహాసమును
యెంచుకొనుటలో నేమి, పాత్రపోషణములో నేమి
కవిగారద్వితీయులై యున్నారని చెప్పవచ్చును.

చంద్రహాసము:—

క్రౌనుసైజు 68 పుటలు. వెల రు 0-12-0 లు.
గ్రంథకర్త శ్రీయుత జి. జోసెఫు కవిగారు. ఇతి
వృత్తమెల్లఱు నెఱింగిన చంద్రహాస చరిత్రమేయయ్యు
శైలి, వర్ణనలు, రసపోషణము, కథాపరిణామము
మొదలగువానిలో గ్రంథము గ్రంథకర్తగారి విశిష్ట
వ్యక్తిత్వమును చాటుచున్నది. నిర్దుష్టమైన గ్రాంథిక
శైలి. సంస్కృతపద జటిలము. ఉన్నత తరగతుల
విద్యార్థుల కుపయోగకరము. ఆంధ్రగ్రంథమాలవారిచే
ప్రకటితమై దేశోద్ధారకున కంకితమైయున్నది.

హరిజనశతకము:—

రాయలు 1/8 సైజు 45 పుటలు. 108 ఆట
వెలదిపద్యములు. గ్రంథకర్త వైద్యవిద్వాన్ కుసుమ
ధర్మన్నకవిగారు, కుసుమకుటీరము, రాజమహేంద్ర
వరము. "అలకింపుమయ్య హరిజనుండ" అను మకు
టమును పెట్టి శతాబ్దములనుండి నిర్లక్ష్యముగ నణగ
ద్రొక్కబడిన హరిజనులను గంభీరరవముతో కవి
మేల్కొల్పుచున్నాడు. గ్రంథమును పఠించువారికి
అస్పృశ్యతా సిద్ధాంత మర్థవిహీనమని స్పష్టముకాక
మానదు. రైతులు, సాహుకార్లు హరిజనులను పిండు
కొనితినుచు అధికముగ తలనెత్తుకొనకుండ చేయుభాగ
ములను చదివిన నుద్రేకము కలుగకమానదు. ఇట్టి
అన్యాయములకు తగిన ప్రతీకారము ఐకమత్యముతో
గూడిన సమ్మెకట్టు అని కవిగారి విశ్వాసము కనుక
జాగ్రత్తగా ఆలోచించినచో ఈగ్రంథము హరిజను
లకు కంటె సవర్ణులకును, సాహుకార్లకును, యజమా
నులకునే పెద్దమేలుకొల్పు. కవిత్వము తేటముజ్జిగవలె
నుండును. కవిగారు తమసుందర సులభశయ్యను సజా
తీయ సముద్ధరణము కొరకేవిధముగ వినియోగించుచు
న్నందు కెంతయు ధన్యులు. వెల ప్రతి రు 0-2-0
12 ప్రతులు రు 1-0-0.

# సంపాదకీయములు

**మహాత్ముని వర్ధంతి:—**

మహాత్మునకు క్రీస్తుశకము ప్రకారము అక్టోబరు రెండవ తేదినాటికి అరువదినాలుగు వత్సరములు గడచి అరువదియైదవ వత్సరము ప్రవేశించినది. మహాత్ముడు ప్రజాహితజీవి, త్యాగమూర్తి, అవతారపురుషుడు. భారతదేశచరిత్రమునసేమి, ప్రపంచభావవిజ్ఞానముల నేమి యొక నూతనపుటను తెరచి నూతన దృష్టిని ప్రసాదించినాడు. ఒక మానవుని జీవితపరిమితిలో సాధింపరాని మహాత్కార్యముల నాతడు తన పట్టుదలవల్లను, పారిశుద్ధతవల్లను, విశాలదృష్టివల్లను, నిర్మమత్వమైన త్యాగమువల్లను సాధింపగలిగినాడు. ఇంకను సాధింపనున్నాడు. అటువంటి మహానీయు లెందరో మన భారతదేశమునఁ బుట్టిరి కాని అట్టి పవిత్రజీవులు తరచుగ ప్రపంచమును సన్యసించి ఆత్మతరణోపాయమునే చూచుకొనిరి గాన వారి మహానీయసేవలు భారతీయులకు ప్రత్యక్షముగ దక్కలేదు. అతనికిగల పాశ్చాత్యదేశపరిచయమును నూతన ప్రపంచసమస్యావిజ్ఞానమును అతనిని మానవసేవారంగమున కాకర్షించి రాజకీయరంగములోనికి లాగి భారతీయులెల్లరికి నపూర్వ కర్తవ్యతాజ్ఞానము నుపదేశించినవి. అట్టి మహానీయుని జన్మదినమే జన్మదినము. నిజముగా అది నూతన భారతజాతికంతకునుగూడ జన్మదినమనవలసినదే. ఆ మహానీయుని జన్మదిన మా సేతు శీతాచలపర్యంతమును, లండను నగరములోని కొన్ని భాగములలోఁగూడ నత్యానందముగ జరుపఁబడుటలో నాశ్చర్యములేదు.

మరియు ఈ జన్మదినోత్సవములలో వేరొక విశేషమున్నది. మహాత్ముడీ సంవత్సరమున హారిజనోద్ధరణమునకుగాను మూడు నిట్టుపవాసముల నొనరించెను. అట్టి నిరంతరసంచలనజీవి ఇట్టి కఠోరవ్రతములనుబూని తిరిగీ మానవప్రపంచమున మనగలిగి ఆయురారోగ్యవంతుడై కార్యరంగమున ప్రవేశింపగలుగుట ఈశ్వరప్రసాదము కాని మానవసాధ్యము కాదని నమ్మవలెను. పరమేశ్వరునికి భారతదేశముపైని, దీనహారిజనులపైని పరిపూర్ణానురాగము కలదు గనుకనే అతను మనకు దక్కినాడు. అతని జీవన మొక్కొక్క నిమిషమును భారతదేశవిముక్తికి ధారాదత్తమైనది. అట్టివారి జీవనమువలన మన దేశమున కెంత ప్రయోజనము గలుగఁగలదో అంతయు గ్రహించుట మన కర్తవ్యమైయున్నది.

అతని రాజకీయనాయకత్వము నెదురించు దేశీయప్రముఖులు లేకపోలేదు. మతము, ఉపవాసము, దైవము, అశరీర

వాణీ మొదలగు క్షుద్రతంత్రములను ప్రజలపై ప్రయోగించి వారిని భావదాస్యము పాలొనరించి నిరంకుశాధికారియై దేశపురోగమనము నణిగట్టుచున్నాడని దూషించుచున్నారు. అత నెట్టి నాయకత్వమును కోరుచున్నాడని గాని, తాను చేయుచున్నవి తంత్రములని అత ననుకొనుచున్నాడని గాని, అవి తంత్రములని గాని మే మొకనాటికిని నమ్మము. అట్లు నమ్మెడివారికి అతనిని సంపూర్ణముగ ధిక్కరించి క్రొత్తసూత్రములతో క్రొత్తపద్ధతుల నవలంబించుటకు సంపూర్ణస్వాతంత్ర్యము గలదు. కాని అందులో వారు సఫలులు కాలేక మహాత్మునిపై కత్తికట్టుట అనాలోచితకార్యము. వచ్చే సంవత్సర మాగష్టువరకైనను ఆతను రాజకీయప్రశంసలు వదలుకొంటినని తాత్కాలిక సన్యాసము బూనినాడు. అతని ప్రతిపక్షులకు తమ బలములను సరిగూర్చుకొని దిట్టపడుట కిది మంచి యవకాశము. ఇట్టి యవకాశములోగూడ వారు సఫలీకృత మనోరథులు కానేరరేని అది ఆతని నేరము కానేరదు.

అతను రాజకీయనాయకత్వమును విరమించుకొని హరిజనసేవారతుడగుటకూడ సనాతనులకేగాక కొంద ఱధునాతన రాజకీయవేత్తలకును కంటకొక్కసముగానున్నది. హరిజనసమస్య రాజకీయ స్వాతంత్ర్య సంపాదనానంతరము సాధింపవలసినదనియు, రాజకీయపురోగమనమున కది యెన్నడును నడ్డురారాదనియు వారి వాదన. కాని హరిజనసమస్య నెట్టి కారణములచేతనైన వెనుకకు నెట్టరాదనియు అతనికి ప్రాణతుల్యమైనదనియు హరిజనోద్ధరణసన్నాహమును ఏనా డతను విసర్జింపవలసివచ్చునో ఆనాడు ప్రాయోపవేశప్రయత్నములు బూనవలసివచ్చుననియు అతని విశ్వాసమైనప్పుడు మన మెంతకినిసినను నేమి ప్రయోజనము? కొందరు తలంచినట్లు అతని హరిజనోద్ధరణసన్నాహము రాజకీయోద్యమమును కొంత వెనుకదిక్కునకు త్రోసినను హరిజనుల కతని చర్యవలన ననంతమగు నుపకారమును, హరిజనాభిమానుల కనుపమానమగు నానందమును గలుగుచున్నది గనుక వారును వారిలోవారిమగు మేమునుగూడ అతని ప్రయత్నములకు మనఃపూర్వ కాశీర్వచనముల నొసంగి అవి సఫలీకృతములగుగాక యని కోరక మానము.

ఆంధ్రదేశము హరిజనోద్యమముపట్ల చూపిన అభిమానము, దీక్ష, కార్యసిద్ధి మరి యే యితరరాష్ట్రిమును జూపలేదని మహాత్ముడు ప్రశంసించియున్నాడు. ఆంధ్రులకు మహాత్ముని వాణి దివ్యవాణి. ఆతని యుపదేశము గురూపదేశము. అమాయకులగు నాంధ్రులు మహాత్ము డుపదేశించినదే తడవుగ ఖద్దరు ఉద్యమమునందు, హిందీప్రచారమునందు, హరిజనోద్ధరణమునందు మనఃపూర్వకముగ ప్రవేశించి తదేకదీక్షతో పనిచేసి ధన్యులైనారు.

మరియు హరిజనోద్ధరణోద్యమ మాంధ్రదేశమునకు క్రొత్తదికాదు. ప్రాతయాచారము లన్నంతమాత్రమున నాంధ్రులు వేనిని కాని పట్టుకొని ప్రేలాడబోరు. నూతన సం

స్ఫురణము లన్నంతమాత్రమున బులోమని
అనాలోచితముగ పడబోకున్నను, మూర్ఖ
పరాఙ్ముఖత్వము నెన్నడును చూపరు. సనా
తన సంప్రదాయములకు భంగము కలిగించు
కొనకుండ వారు అన్ని సంస్కరణోద్యమముల
కును స్వాగతమిచ్చి సానుభూతి చూపు
చున్నారు. కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం
పంతులుగారు, బ్రహ్మర్షి రఘుపతి వెంకట
రత్నం నాయుడుగారు, ఉదారజమీందారు
పీఠికాపురాధీశుడు, సర్వసంగ సన్యాసి
గూడూరు రామచంద్రరావుగారు మొదలైన
వారెందరో ఆ యుద్యమము నీ రాష్ట్రమున
నింతకుముం దెంతో పూర్వమే స్థిరీభూతము
చేసిరి. జిల్లాబోర్డులు, తాలూకాబోర్డులు,
పంచాయితీలు, పాఠశాలలు, సభలు, సమ
పంక్తి భోజనములు మొదలగువానియన్నిటి
లోను హరిజను లింతకుముందే ఉదారజను
లందరివల్లను సోదరగణమువలె పరిగణింప
బడుచున్నారు. మహాత్ముని యుపవాసము
లును, దీక్షయు ఈ యుద్యమమునకు
ద్విగుణీకృతవేగమును వ్యాప్తియు నొసంగి
నవి.

కొంచెము దినముల క్రిందట శ్రీయు
తులు అయ్యదేవర కాళేశ్వరరావు, మాగంటి
బాపినీడుగార్లు మహాత్ముని దర్శించి ఆంధ్ర
దేశ సంచారము చేయవలసినదిగా కోరిరి.
మితమైన ప్రయాణములును, కార్యక్రమ
మును, తగినంత విశ్రాంతిని పెట్టుకొని అతను
సంచారము చేయవచ్చునని వైద్యుల సెల
వైనది. మహాత్ముని సమ్మతి చిక్కినది.
కొంచెముకాలములో వారీ దేశమునకు రాను
న్నారు. స్తుతిపూర్ణములగు స్వాగతపత్రము
లతో తనను విసిగించక, క్లుప్తముగ సభలు
జరుపుటకు, విరివిగా కట్నములిచ్చుటకు,
జరిపిన పనులను విశదీకరించు నివేదికలను
తయారుచేసి చదువుటకు పల్లెపట్టణములెల్ల
యు సిద్ధముగ నుండవలెనని అతను కోరుచు
న్నాడు. అతని సలహాప్రకార మాంధ్రు
లెల్లరును సిద్ధముగ నుండవలెనని హెచ్చరిం
చుచున్నాము.

### మహిళాజనోద్యమ వ్యాప్తి

మన ఆంధ్రదేశమున మహిళాయుద్య
మము తక్కిన రాష్ట్రములలోకంటె నెందు
ను తీసిపోలేదని యుద్యమచరిత్రను గమనిం
చు వారికిని, వార్తాపత్రికలు సభావేదికలు
కారాగారములు మొదలగు సంస్థలను జూచి
గొని రాణించుచుండు నారీమతల్లుల చరిత్ర
లను దిలకించువారికిని విశదముకాక
మానదు. గ్రంథాలయములు, ఖద్దరు, హిందీ
ప్రచారము, రాజకీయ స్థానికసంస్థలు, పాఠ
శాలలు, హరిజనోద్ధరణము మొదలగు నుద్య
మములలోనెల్ల వారు ప్రవేశింపని తావే
లేదు. ప్రజాహిత సంస్థలను దిలకించినంత
మేరకు మనకు స్త్రీపురుష భేదమే యెందును
గోచరింపక సార్వజనీనసేవాపథంబు
మాత్రమే రాచబాటయై కనిపించుచున్నది.
సాధారణ విద్యావతులతో ప్రారంభమై,
సామాన్య వనితలలోనికిగూడ ప్రవేశించి,
యీయుద్యమమునేడు రాణివాసముల కెక్కి
అంతఃపుర పురంధ్రీమణులగూడ వశీకరణ
మొనర్చుకొని సభలకు రప్పించి ప్రజాసేవను
చేయించుచున్నది. ఇందుకు ప్రబలనిదర్శ

సము సెప్టెంబరు 30వ తేది స్థిరవాసరమున నూజవీడులో ఉయ్యూరు రాజావారి ఉన్నత పాఠశాలా భవనమున శ్రీమతి దుర్గాబాయమ్మగారి అధ్యక్షతను జరిగిన కృష్ణామండల మహిళా సభ యేదై యున్నది. ఇందు అంగీకరింపఁబడిన తీర్మానములు ఆంధ్రనారీమణుల ఉన్నతాశయములను వివేకమును స్పష్టముగ తెలియఁజేయుచు ఇతరరాష్ట్రముల పూఁబోఁడులకుగూడ ఆదర్శకప్రాయములై యున్నవి. ఈ సభ కాహ్వానసంఘాధ్యక్షురాలైన శ్రీమతి ఉయ్యూరురాణీగారి యుపదేశము సకల భారత నారీమణుల హృదయ కమలములలోను స్థిరముగ నాటుకొని అనుపమాన ప్రోత్సాహము నొసగూర్పగలదని విశ్వసించుచున్నాము.

"నవీనయుగమగు నీకాలమున అనేకమంది స్త్రీలు సుకుమారులయ్యును పలుశ్రమలకోర్చి సంఘములనేర్పరచి హిందూసంఘములో ప్రవేశించిన అనాచారములను పోఁగొట్ట ప్రయత్నించుచున్నారు. ఈ సంఘములో పాల్గొనిన మనమందరము అట్టిరీతిని ప్రయత్నించుట మన కర్తవ్యమైయున్నది. కావున ఆంధ్రవనితలమగు మనము నేఁడు విదేశీయుల నాగరికతలచే భ్రమింపబడక, హృదయ దౌర్బల్యమునకు లోనుగాక, విచక్షణఁగలిగి, చక్కఁగా విమర్శించుకొని, మనపూర్వపుస్త్రీలవలె ధైర్యసాహసములుగలిగి సాంఘికమత విషయములలో ప్రవర్తించుచు, మన బాలబాలికలకు విద్యావినయ సౌశీల్యము లలవడఁజేయుటకునై పాటుపడుచు, లోటుపాటులను సవరించుకొనుటయే ముఖ్యోద్దేశముగా నిడుకొని ఇచటసమావేశమైనారము."

నారీజనోద్యమముయొక్క ఆశయము నింతసుందరముగను సూక్ష్మముగను గ్రహించి వివరించిన శ్రీమతి రాణీగారిని మేమెంతయు ప్రశంసించుచున్నాము.

### కవి పూజ

తిరుపతివేంకటేశ్వరకవు లిరువురును ఆధునిక యుగంబున కవిచక్రవర్తులు. ఆంధ్రభాషాసామ్రాజ్యము నెల్ల వారియిచ్చవచ్చిన లీలనేలి కవితాసుందరిని కనకశోలికలోఁ గూర్చుండఁబెట్టి యామెయశోరోచిస్సులు దిగంత విశ్రాంతములగున ట్లూఁచిపెట్టిరి. వారు పలికినది కవిత్వము, వారు పట్టినది మేరువు, వారు త్రొక్కినది పిండి, వారెత్తినది ధ్వజము, వారాడినది మాటగా ఒకతరమనగా ముప్పదియేండ్లు గడచినవి. ఇంతలో తిరుపతిగారు పరమపదమునందిరి. వేంకటశాస్త్రిగారు వృద్ధులై స్వగ్రామమగు కడియములో విశ్రామము తీసుకొనఁ జొచ్చిరి. అయిననేమి వసంతు డడుగుపెట్టిననేలయెల్ల చిగిరించునట్లు ఈ కవీంద్రులగాలి తగిలినంత మేరకు పిల్లశతావధానులు, బాలకవియుగ్మములు, ప్రౌఢకవిత్వప్రవీణు లెందరో వారి శిష్యులై వెలయఁజొచ్చిరి. నేఁడాంధ్రదేశమునఁ దలయెత్తి ప్రశంసనీయమగు కవిత్వము చెప్పుచున్న యువకులలో వెంకటశాస్త్రిగారి శిష్యులమని చెప్పుకొనని వారు లేరు. వారితో పదినెల లిష్టాగోష్ఠిలో నుండుట కంటె పాండిత్య సంపాదనకుగాని కవితారహస్య గ్రహణమునకుగాని సులభోపాయ

ము లేదు. మధురాదరవచోవిలాసులగు శాస్త్రిగా రిట్టిభాగ్యము నడిగినవారికెల్ల నొసంగి ఆంధ్రభాషోద్యానమెల్ల అందముగ చిగిర్చి నవ్యనవ్యకావ్యకుసుమములను పుష్పించునట్లుచేసిరి. ఇట్టి మహనీయున కిప్పటికే అరువదిమూడు ఏండ్లుఅయినను మొన్న కార్తీకశుద్ధ ద్వాదశినాడు షష్టిపూర్తి యను పేర పూజా మహోత్సవము బందరునగరమున అతివైభవముగ జరిగినది. ఇదియే యేహిందూచక్రవర్తులో మహమ్మదీయ నవాబులో పాలించు దినములైనచో వారికి కనకాభిషేకములు, అభ్యాగతపండితకోటి కనంతసంభావనలు, సమారాధనలు, ఊరేగింపులు, ఉపన్యాసములు మొదలగువానితో రాజధానీనగరము పదిదినములపాటు కలకలలాడవలసినది. రాజసమ్మానము లేకున్న నేమాయె! అనురాగపూరితమగు ప్రజాలోకమాలోపమును పూర్తిచేసినది. సెప్టెంబరు 29వ తేది ఉదయమున వారిని ధర్మపత్నీ సమేతముగా మోటారున గూర్చుండబెట్టి పురవీధులం ద్రిప్పిరి. సమ్మాన పత్రము, భూసురాశీర్వాదము, ఖద్దరుచాపులు, వెండి పొడుముడబ్బి, వెండిపాన్దాను, వెండిసిరాబుడ్డి, వెండికలము, చదరంగంబరిణ మొదలగు సంసారి సత్కారముల కెట్టిలోపమును జరుగలేదు. హరినాగభూషణంగారు తమ అఖండగానకళను ప్రదర్శించి సభకెక్కడలేని యందమును గూర్చిపెట్టిరి.

30వ తేదిని దేశోద్ధారక నాగేశ్వరరావుగారి యధ్యక్షతను తిరిగీ సభ జరిగినది. సమ్మానసంఘమువారు కవీంద్రుని గౌరవించు నిమిత్తము రు. 10000లు వసూలు చేయనెంచి మరి రు. 500 లు అధికముగా వసూలుచేయగలుగుట కవిగారియెడలఆంధ్రదేశీయులకున్న అభిమానమునేగాక సమ్మానసంఘమువారి చాకచక్యమునుగూడ తెలియఁజేయుచున్నది. అయినను కవిగారిగ్రంథముల నచ్చువేయించుటకు వారు రు. 6500 అంచనావేసుకొనగా అది రు 7500లకు వచ్చుచున్నది. కనుక ఆ రు 1500 లును ఆంధ్రదేశము భర్తీచేయవలసి వచ్చుచున్నది. బీదవారికి విద్యార్థివేతనము నిచ్చునిమిత్తము ఆంధ్రవిశ్వవిద్యాలయములో వారిపేర 1000 రూపాయలు నిలవచేయుట కూహించుచున్నారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు గురుదక్షిణగా నొకవజ్రపుటుంగరము నంపిరి. కొల్లిపర వెంకటరమణయ్య నాయుడు బి.ఏ. బి.యల్ గారు రు 116లు కట్నముచదివించిరి. ఇట్లాంధ్రదేశ మెల్లయు యథాశక్తిగా కవిపూజచేసి ధన్య ననిపించుకొన్నది. నాడు చదువఁబడిన వేదోక్తాశీర్వచనముల ఫలితముగా శ్రీవేంకటకవిగారు ఇతోధిక శతాయుష్మంతులై తమ విశ్రామ కాలమును శిష్యజన శిక్షణమునందును పవిత్రకవితాపరిపాకమునందును పుచ్చుచు ఆంధ్రభాషను ధన్యను చేయుచుందురుగాక!

ఒరిస్సా వరదలు:—

ఈ మధ్యను మహానది వరదలవలన ఒరిస్సాలో సంభవించిన ప్రాణనష్టమును ధననష్టమును పత్రికాపాఠకు లెల్లరికిని విదితమైయున్నది. సి. యఫ్. ఆండ్రూస్ గారు అచ్చటికిపోయి స్వయముగ విచారణచేసి అక్కడ

ననేకులు తినతిండియు నిలువనీడయు లేక అల్లాడుచున్నారని తెలియఁబరచుచున్నారు. ఒరిస్సారాష్ట్రము చాలా పేదజనులతో కూడి యున్నది. వారిచ్చిన స్వల్పచందాలవలన ఈవేనవేలు నిరాధార జనమునకు ఎంతమాత్రమును తగిన ప్రయోజనము లభింపఁజాలదు. కనుక "ఫెడరేషను ఆఫ్ ఇంటర్నేషనల్ ఫెల్లోషిప్సు" (అంతర్జాతీయ స్నేహిత సమితి) వారు భారతీయ లెల్లరిని ప్రబోధించి చందాలు బట్టలు వసూలుచేసి వీరి సహాయార్థము పంపుచున్నారు. వీరికి సహాయముగా ధన మీయఁదలచుకొన్నవారు మిసెస్. ఇ. బార్నెసు (Mrs. E. Barnes Christian College, Tambaram) కోశాధికారిగారికిని, కంబళీలు పంచెలు మొదలగు బట్టలు ఈయఁదలచుకొన్నవారు సత్యనారాయణ సేన్‌గుప్త (కటకము) గారికిని పంపవచ్చును. ఆంధ్రులు శక్తివంచనలేక దైన్యమునఁ గుందుచున్న తమ పొరుగుజాతివారికి సహాయము చేయుదురుగాక!

దురదృష్టము :—

సేనుగుప్తగారు మరణించినందువలన కలిగిన దుఃఖపు కంటితడి యారకుండనే విఠలభాయి పటేలుగారుకూడ దివంగతులగుట భారతమాతయొక్క దురదృష్టమే యనవలెను. అటువంటి రాజ్యాంగ విద్వాంసుడు, ధైర్యశాలి, కార్యనిపుణుడు, నిష్కళంక దేశాభిమాని ఈయుగమున నేదేశములోఁ గూడ పొడమ లేదనుట నిక్కము. భారత భూమియే స్వతంత్రదేశమైనచో అట్టి మహనీయుడు మేగ్డనాల్డు, రూజువెల్టు, హిట్లరు, ముసలోని ప్రభృతులకు పాఠములు చెప్పి ప్రస్తుత ప్రాపంచిక దుస్థితిని సరిచేయఁగల సమర్థుడు. అతని ప్రజ్ఞయంతయు నొక్క భారతదేశస్వాతంత్ర్యసంపాదనాసమరముననే చెల్లిపోవలసి వచ్చెను. అయినను ఆ స్వాతంత్ర్యలక్ష్మి మనకు దూరస్థ దృశ్యమాత్రముగనే యున్నదిగాని చేరువకాఁగల సూచనలు లేవు. ఏతత్సిద్ధికొరకు ప్రార్థించుచునే అతను కన్నుదోయిని ముకుళించినాడు. శాసనసభల వెలుపలనుండియో లోపలనుండియో అందుకుగాను తీవ్రతర ప్రయత్నములుసలిపి తెల్లపత్రమును దిద్దించవలసిన దినములు ముందున్నవి. ఇట్టి మహాసంరంభమున పెట్టనికోటలై మనహక్కులను కాపాడగల వీరులిట్లు పరమపదించుచుండుట మనదురదృష్టముకాక వేఱేమి? అయినను భారతీయులు జిగుప్స నొందకుందురుగాక! వారు స్వర్గమందున్నను వారి యుత్సాహకిరణములను మన యువకహృదయములలోనికిని, వారి యాశీర్వచనములను మన సదుద్యమముల మీదికిని ప్రసరించుచుండకమానరు. పటేలుగారు జనీవానగరమున మరణించిరి. వారి కళేబరమును పదిలపరచి ఇటలీ స్టీమరుమీద హిందూదేశమునకు గొనివచ్చి యథోచితాంత్య సంస్కారములు చేయుదురు.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.